# బౌద్ధము-ఆంధ్రము

(వ్యాస సంకలనము)

ఆచార్య బి.యస్.యల్.హనుమంతరావు




తెలుగు విశ్వవిద్యాలయం
పబ్లిక్‌గార్డెన్స్, నాంపల్లి
హైదరాబాదు-500 004

# BOUDDHAMU-ANDHRAMU

By Prof. B.S.L.Hanumantha Rao

తెలుగు విశ్వవిద్యాలయం
ప్రచురణల సంఖ్య-154
ప్రతులు-2000
ప్రథమ ముద్రణ-1995



**వెల: రు. 21/-**



ప్రతులకు:
రిజిస్ట్రార్
**తెలుగు విశ్వవిద్యాలయం**
పబ్లిక్ గార్డెన్స్, నాంపల్లి
హైదరాబాదు-500 004

ముద్రణ:
**ఫాంట్‌లైన్ గ్రాఫిక్స్**
బాగ్‌లింగంపల్లి
హైదరాబాదు-44

# ముందుమాట

ఆచార్య పేర్వారం జగన్నాథం,
ఉపాధ్యక్షులు,

తెలుగు విశ్వవిద్యాలయం,
హైదరాబాదు.

తెలుగుజాతి గర్వించదగిన సాహిత్య సంపదను ఈ తరానికి అందించవలసిన గురుతర బాధ్యతను తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణల విభాగం ద్వారా నిర్వర్తిస్తున్నది. అలభ్యాలు, అముద్రితాలైన గ్రంథాలను అచ్చువేసి పాఠకులకు, పరిశోధకులకు, విద్యార్థులకు, జిజ్ఞాసువులకు ఉపకరించడానికి ప్రయత్నిస్తున్నది. ప్రాచీన కావ్య ప్రబంధాలు కొన్నింటికి వ్యాఖ్యానాలు రచింపచేసి వ్యాఖ్యాస్రవంతి పేరుతో ప్రచురిస్తున్నది. ఈ ప్రయత్నంలో భాగంగా 'బౌద్ధము - ఆంధ్రము'అన్న ఈ అముద్రిత గ్రంథాన్ని ముద్రించి పాఠక లోకానికి అందిస్తున్నది.

బౌద్ధమతం అతి ప్రాచీనమైనది. అది భారతదేశంలో పుట్టి, ప్రపంచ పరివ్యాప్తంగా ప్రవర్తిల్లినది. బౌద్ధమత ప్రవక్త బుద్ధుడు. అతని జీవితం మానవాళికి ఆదర్శప్రాయమైనది. దయ, సత్యం, జీవకారుణ్యంతో కూడుకొన్న అతని బోధలు సర్వకాల, సర్వావస్థలయందు మనుష్యకోటికి అనుసరణీయాలుగా నిలిచినాయి. బౌద్ధం ఆనాడు అన్ని దేశాలలోని సమస్త రంగాలను అత్యంత ప్రభావితం చేసింది. ఒక దేశం, ఒక జాతి చరిత్ర సంస్కృతుల అధ్యయనానికి బౌద్ధం ఒక ప్రామాణికాధారంగా రూపొందింది.

ప్రపంచమంతా, యావద్భారతమంతా అల్లుకొని పోయిన బౌద్ధం ఆంధ్రదేశాన్ని, ఆంధ్రజాతిని, ఆంధ్ర సంస్కృతిని ఏ విధంగా ప్రభావితం చేసిందో చరిత్ర ద్వారా తెలుస్తున్నది. అటువంటి చారిత్రక పరిశోధనాంశాలు 'బౌద్ధము - ఆంధ్రము' అన్న ఈ పుస్తకంలో విస్తారంగా ప్రస్తావించబడినాయి.

ఆంధ్రదేశాన్ని పాలించిన రాజుల చరిత్ర, వారు బౌద్ధాన్ని ఆదరించిన తీరు, బౌద్ధం జనజీవితాన్ని, సాహితీ సంస్కృతులను, కళలను ముఖ్యంగా శిల్పకళను ప్రభావితం

చేసిన వైనం ఈ వ్యాస సంపుటిలో స్పష్టంగా కనిపిస్తున్నది. బౌద్ధమత సంపర్కంతో మన శిల్పకళ ఎట్లా సంపన్నమైందీ, మన శిల్పాలు, శిల్పులు ప్రపంచ శిల్పరీతికి ఏ రకంగా ఒరవడి దిద్దిందీ ఇందులో ప్రముఖంగా చెప్పబడింది.

రెండు భాగాలుగా సాగిన ఈ గ్రంథరచన కేవలం బౌద్ధమత ప్రాశస్త్యాన్నే గాక, ఆంధ్రదేశ చరిత్ర, సంస్కృతుల ప్రాభవాన్ని కూడా సహేతుకంగా వివరించింది.

ఈ గ్రంథ రచయిత ఆచార్య బి.ఎస్.ఎల్.హనుమంతరావు గారు సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులు. మరుగుపడిన చారిత్రకాంశాలనెన్నింటినో వెలుగులోనికి తెచ్చిన విద్వాంసులు. ఆయన ఇంతకుముందే తెలుగులోను, ఆంగ్లంలోను పెక్కు రచనలు చేసినారు. విద్యాశాఖలో వివిధ పదవులను నిర్వహించి పరిశోధనకు, బోధనకు ఇతోధికమైన సేవలు అందించినారు. వీరి సేవలను గుర్తించి నాగార్జున విశ్వవిద్యాలయం వీరిని బౌద్ధమత అధ్యయన పీఠానికి ప్రత్యేక ఆచార్యులుగా నియమించి గౌరవించింది. ఆంధ్రదేశంలోని చారిత్రక పరిశోధకులలో వీరికి ప్రత్యేక స్థానమున్నది. వీరి గ్రంథం 'బౌద్ధము - ఆంధ్రము' తెలుగు విశ్వవిద్యాలయం ద్వారా ప్రకటించి వెలుగులోనికి తీసుకొని రావడం మాకెంతో ఆనందదాయకంగా ఉంది. ఇది విద్యార్థులకే గాక అధ్యయన శీలురందరికీ ఉపయుక్తం కాగలదని మా విశ్వాసం.

ఈ అమూల్యమైన గ్రంథాన్ని మాకు అప్పగించి, ముద్రించడానికి వీలు కల్పించిన డా॥ హనుమంతరావు గారి సోదరులు శ్రీ బి.ఎస్.ఆర్.ఆంజనేయశర్మ గారికి మా కృతజ్ఞతలు. ఇది ప్రచురింపబడడానికి ముఖ్యకారకులు, మాకు ప్రేరణ కలిగించిన వారూ సాహితీ ప్రియులు శ్రీ సి.ఆంజనేయరెడ్డి, ఐ.పి.ఎస్. గారు. వారికి మా ధన్యవాదములు.

(పేర్వారం జగన్నాథం)

హైదరాబాద్,

తేది: 26.1.1995.

# ఇందులో...

## మొదటి భాగము



## రెండవ భాగము

# 1. 'రత్నత్రయ' సందేశము

మానవునిలో అంతర్గతంగా ఉండే హేతువు నుండే 'మతం' ఉద్భవించింది. ప్రకృతి వైపరిత్యాల తాకిడి నుండి రక్షించుకోవటానికి ఆది మానవుని మేధ తాపత్రయపడింది. వైపరిత్యాల కారణాలను పరిశీలించి రక్షణకై శోధించిన మానవ సామర్థ్యం మతాన్ని రూపొందించింది. భూమిపై మానవుని సుఖజీవనానికి ఉద్దేశించిన అద్భుత సృష్టే మతం. కాలక్రమంలో అన్ని వ్యవస్థలకు పట్టిన చీడ మతానికి కూడ సోకింది. మతము ప్రజల అమాయకత్వాన్ని ఆసరా చేసికొని పీడించే స్వార్థపరుల సొత్తు అయింది. ప్రజాజీవితాన్ని సుగమము, సుఖమయము చేయవలసిన సాధనం పీడించి అణగద్రొక్కే పాశవిక ఆయుధంగా రూపాంతరం చెందింది. అటువంటి పరిస్థితులు తలెత్తినప్పుడల్లా జొరాస్టరు, గౌతమ బుద్ధుడు, జీసను క్రీస్తు, మహమ్మదు, శంకరాచార్యుడు మున్నగు ప్రవక్తలు ఉద్భవించి తమదైన పంథాలో మార్గనిర్దేశకులైనారు. సుఖము, ఉదాత్తము అయిన జీవన విధానాన్ని రూపొందించి మతాన్ని పునరుద్ధరించారు.

ప్రపంచంలో అతి ప్రాచీనము ఉదాత్తము అయిన మతాలలో 'బౌద్ధం' ఒకటి. ప్రగతి దిశలో సంఘాన్ని నడిపించే తాత్విక చింతన బౌద్ధం. నిజానికి బౌద్ధం 'జీవితదర్శనం', బౌద్ధమత ప్రవక్త అయిన గౌతమ బుద్ధుడు క్రీ.పూ. ఆరవ శతాబ్దంలో జీవించాడు. అప్పుడు భాథత జనజీవితం అతలాకుతలంగా ఉంది. నైతికంగా, సామాజికంగా పతనావస్థలో ఉంది; జాతి వైషమ్యాలు సామాజిక అసమానతలు సంఘాన్ని పీడిస్తున్నాయి. రాజకీయంగా ఆర్థికంగా సంక్లిష్టపరిస్థితి నెదుర్కొంటున్నది. మతం బలిపీఠం అయింది; మూఢవిశ్వాసాలకు భయంకరమైన ఊహలకు ఆటపట్టయింది. క్రూరమైన ఆలోచనలకు ఆచరణకు వ్యతిరేకంగా స్పష్టంగా నిర్దుష్టంగా బుద్ధుడు తన గళాన్ని విప్పాడు. మానవ జీవితాన్ని సంపూర్ణంగా పునర్వ్యవస్థీకరించే హేతుబద్ధమైన జీవన విధానాన్ని జాతిముందుంచాడు. అప్పటికి లభ్యమైన తాత్విక చింతనను - అనుభవాలను

సమన్వయించి సమకాలీన సమస్యలకు సమాధానంగా దర్శనంగా రూపొందించాడు. అన్ని గొప్ప మతాలకు పట్టిన దుర్గతే బౌద్ధానికి కూడా పట్టింది. కాలక్రమంలో బుద్ధుని ఉపదేశాలకువక్రభాష్యాలు వెలిసినాయి. అతని మౌలిక ఉపదేశాలకు బౌద్ధులు, బౌద్ధులు కానివారు కూడ అన్యాయం చేశారు. దురాశాపరులైన పూజారులు, నీతిబాహ్యులైన రాజులు, రాజకీయవేత్తలు ఈ నాటకంలో ప్రధాన దుష్ట పాత్రధారులు. ఉదా: మధ్య ఆసియాలోని భయంకర రక్తపిపాసుడైన చెంఘీజ్‌ఖాన్ కూడా బౌద్ధమతస్థుడే అనే స్థాయికి ఈ నాటకం చేరింది. అవధులు లేని ప్రేమ, కరుణల మతమైన బౌద్ధానికి ఇంతకు మించిన అన్యాయం ఉండదు! తరువాత కాలంలోని బౌద్ధమత వ్యతిరేకులు తథాగతుని గురించి, బౌద్ధమతాన్ని గురించి దుష్ప్రచారం చేశారు. 'బుద్ధిహీనుని', 'మందబుద్ధిని' బుద్ధ శబ్దానికి పర్యాయ పదాలుగా వాడారు. జ్ఞానం బుద్ధిహీనత గాను, అజ్ఞానం బ్రహ్మానందంగాను, గుర్తించటం ఎంతటి ఆశ్చర్యకరమైన పరివర్తన! దురాశపరులు స్వార్థపరులు సుఖ సౌఖ్యాలతో తులతూగటానికి సామాన్యజనులు అజ్ఞానం అంధకారంలో ఉండటం అవసరం. బుద్ధుడు ప్రజల అజ్ఞానాన్ని పారద్రోలి జ్ఞానవంతులను చేయాలని ప్రయత్నించాడు. దీనితో అవకాశవాదులు స్థానం కోల్పోయారు. అందుచేతనే బుద్ధునిపై, బౌద్ధమతంపై వారి ఆగ్రహం, దుష్ప్రచారం.

బుద్ధుని జీవితమూ, ఆయన జీవితంలోని విశిష్ట సంఘటనలు అందరికీ తెలిసినవే. కాని ఒక ముఖ్యమైన విషయంపై అందరూ మరింత అవగాహనతో దృష్టికేంద్రీకరించాలని నా అభిప్రాయము. అది బుద్ధుని మహాభి నిష్క్రమణ - పదవీ త్యాగం. నేటి రాజకీయ వేత్తలు ప్రజాసేవ చేయటానికి అధికారాన్ని ఆశిస్తున్నారు. హస్తగతం చేసికోవాలని అన్ని మార్గాలు త్రొక్కుతున్నారు. జ్ఞాని అయిన సిద్ధార్థునికి అధికార పరిధులు తెలుసు. మానవ సేవకై సింహాసనాన్ని త్యజించాడు. నిజంగా ప్రజాసేవా తత్పరతే నేటి రాజకీయవేత్తల ఆశయమైతే గౌతమ బుద్ధుని జీవితం నుండి ఈ ఉత్తమ పాఠాన్ని నేర్పటం చాల అవసరం. ("అధికారం అవినీతికి మార్గం. సర్వాధికారం సర్వత్రా అవినీతినే మిగులుస్తుంది" - అని ఆక్టన్ ప్రభువు అంటాడు. సుమతీ శతక కారుడు

అధికార వ్యాధి పీడితుడు బధిరుడు అంధుడు అవుతాడని పేర్కొంటాడు.)

గౌతమ బుద్ధుడు ఆచరణ బద్ధుడైన దార్శనికుడు. మానవాళి తక్షణ అవసరాలపై దృష్టి కేంద్రీకరించాడు. తన దర్శనంలో తర్క వితర్కాలకు, వితండవాదనకు తావు ఇవ్వలేదు. బౌద్ధం నీతిశాస్త్రం, తర్కశాస్త్రం, మనోవిజ్ఞానాల సమన్వయ ఫలితంగా ఆవిర్భవించిన దర్శనము అని రాధాకృష్ణ పండితుడు పేర్కొన్నాడు. నిజమైన దర్శనానికి అంతిమ లక్ష్యం 'మరణము కాదు - ప్రాణము'. 'భగవంతుడు కాదు - మానవుడు' అని బుద్ధుడు గుర్తించాడు. 'విషశస్త్రపీడితుని ఉపాఖ్యానము' (Parable of the poisoned Arrow) లో గుర్తింపు చక్కగా విశదీకరించబడింది. 'మజ్జినికాయ'లో బుద్ధుడు మాలుంక్య పుత్రునికి ఇలా చెబుతాడు. 'సృష్టి, పరలోకము, దైవము, నిత్యము (eternal) మున్నగు సమస్యలన్నిటికీ వివరణలు లభించినప్పటికీ ప్రపంచంలో దుఃఖము, బాధ, వృద్ధాప్యము, నిస్పృహ మరణము మున్నగు సమస్యల పరిష్కారం లభించదు. విషబాణ పీడితునికి బాణాన్ని తీసివేసి బాధోపశమన చర్యలతో చికిత్స చేయటమే వైద్య నిపుణుని కర్తవ్యము; ఆ వ్యక్తి పేరు, కులము, మున్నగు వివరాలతో కాలహరణము చేయతగదు. అదే విధముగా నిజమైన దార్శనికుడు దుఃఖము బాధల నుండి మానవుని విముక్తుని చేయాలి''.

బుద్ధుడు ఎంత యధార్థవాదో అంత ఆశావాది. మానవుని భవిష్యత్తుపై అతనికి ఎంతో నమ్మకం. మానవుని ఋజువర్తనపై అతనికి అచంచల విశ్వాసం. దళారి అయిన పూజారి అవసరం లేకుండా, శిక్షించబడతాననే భయం లేకుండా, ఏ బహుమతినీ ఆశించకుండా తన నిర్వాణాన్ని మానవుడు సాధించుకోగలడని బుద్ధుడు చెప్పాడు. తన భవిష్యత్తు నిర్దేశకుడు వ్యక్తేనని చెబుతూ ప్రపంచాన్ని చెదలా పీడిస్తున్న దుఃఖానికి, బాధకు కారణాన్ని నివారణను కనుగొన్నాడు. అయితే దుఃఖానికి హేతువేమిటి? మానవుడు బాధనుండి నివృత్తి ఎందుకు పొందలేక పోతున్నాడు? బుద్ధుడు పలాయనవాది కాదు. ప్రపంచాన్ని ఆవరించి ఉన్న దుఃఖము, బాధ 'మిధ్య' అని తన పృచ్ఛకులను తలాయించలేదు. సత్యాన్వేషి కనుక మానవ జీవితంలో వికారమైన నగ్నసత్యాలుగా

వాటిని గుర్తించాడు. కారణాలను లోతుగా శోధించి పరిష్కార మార్గాన్ని కనుగొన్నాడు. అతని సమాధానం 'అవిద్య' (అజ్ఞానం) అన్ని చెడులకు, పాపాలకు కారణం. అజ్ఞానాన్ని జయించటమే పరిష్కారం.

బుద్ధుడు హేతువాది. కార్యానికి కారణం ఉంటుంది. చర్యకు ప్రతిచర్య ఉంటుంది. అన్ని గ్రహింపు గలవాడు. ఋజువర్తనతో మంచి కార్యాలను ఆచరించుటం ద్వారా మానవుడు జీవన స్థాయిని పెంచుకోగలడు; లక్ష్యాన్ని చేరగలడు; బాధనుండి విముక్తుడు కాగలడు అని చెప్పాడు. వ్యక్తి ఔన్నత్యానికి చాలా సులువైన నైతిక సూత్రాలను - అష్టాంగ మార్గాన్ని - బోధించాడు. అష్టాంగ మార్గాన్ని క్లుప్తంగా శీలము, సమాధి, ప్రజ్ఞ అను మూడు ప్రధాన సూత్రాలుగా పేర్కొనవచ్చు. శరీర వాంఛలను అదుపులో ఉంచటం (శీలము), మనో చాంచల్యాన్ని అదుపు చేయటం (సమాధి) ద్వారా మానవుడు జ్ఞానాన్ని (ప్రజ్ఞ) పొందగలడు. ప్రజ్ఞావంతుడు కావటమే అజ్ఞానాన్ని (అవిద్య) జయించటం. అట్టి మానవుడే 'అర్హతుడు' అంటే నిర్వాణాన్ని పొందినవాడు. నిర్వాణాన్ని పొందిన వ్యక్తి అన్ని కర్మల నుండి విముక్తుడు అవుతాడు. అద్వయాన్ని గ్రహించిన ఆనందస్థాయియే నిర్వాణము. అన్ని ప్రాణులను బంధించే మౌలిక సూత్రం 'జీవము'. జీవము అవిభాజ్యము. ఆ గ్రహింపే అద్వయము. అప్పుడే మానవుడు ఇతర ప్రాణులతో తాదాత్మ్యం పొందగలడు. ఆ మానసిక స్థితే 'కరుణ' పెల్లుబకటానికి కారణం అవుతుంది. కరుణ న్యాయాలకెల్లా న్యాయం. మానవజాతి మనుగడకు కరుణే ఆధారము.

బౌద్ధమతం అంధ విశ్వాసాలతో విద్వేషాలతో కూడిన మార్గం కాదు; ప్రేమ జ్ఞానం నిండిన మార్గం. ఆత్మత్యాగము, ఆత్మన్యూనత దాని లక్ష్యం కాదు. వ్యక్తిత్వ వికాసము, ఔన్నత్యము దాని లక్ష్యం. ఆ ఉన్నత మార్గాన్ని అనుసరించి అంతిమ లక్ష్యమైన నిర్వాణాన్ని పొందటానికి కులము, వర్ణము, ఏ మతము, వృత్తి ప్రతిబంధకాలు కావు. ఇతర మతాలపై అసహనము, విద్వేషము బౌద్ధమతంలో లేవు. మ్లేచ్ఛ, Cauffer మతవిరోధి - ద్వేషి వంటి పదాలు బౌద్ధ నిఘంటువులో లేవు.

తాను నిర్దేశించిన మార్గము చాల కఠినమైనదని బుద్ధునికి తెలుసు (సుత్తనిపాత)

విజయానికి అడ్డదారులు, దొడ్డిదారులు, డొంకదారులు ఉండవని బుద్ధుని ఉపదేశము. అదే సమయంలో తాను చూపిన మార్గవిషయమై అతడు మొండిపట్టు కలవాడు కాదు. తన శిష్యగణాన్ని బుద్ధుడు "అధికారంతో ఆదేశించిన దానిని తు.చ. తప్పక ఆచరించవలసిన పనిలేదు" అని హెచ్చరించాడు. (ఆధునిక విజ్ఞానశాస్త్ర పితగా గుర్తించబడిన బేకన్ కూడ ఇలాంటి హెచ్చరికనే చేశాడు) స్వర్ణకారుడు బంగారును కొలిమిలో వేసి నాణ్యాన్ని నిర్ధారించినట్లు ఏ ప్రవచనాన్నయినా మీ అనుభవమనే కొలిమిలో వేసి చూడండి. మీకు సమాజానికి ఉపయోగపడుతుంది అనే నమ్మిక కలిగినప్పుడు మాత్రమే ఆ ప్రవచనాన్ని నమ్మండి" అన్నాడు. కల్లబొల్లి ఊహలతో ఎవరూ స్వచ్ఛతను పొందలేరు అని 'సుత్తనిపాత'లో వివరిస్తాడు. చివరి ప్రవచనమైన 'మహా పరినిభానసుత్త'లో బుద్ధుడు ఇలా చెబుతాడు; "మీ నిర్వాణాన్ని మీరే నేర్పుగా, సున్నితంగా రూపొందించుకోండి. ఇతరుల సహాయ సహకారాలు ఆశించవద్దు. ఓ పరివ్రాజకులారా! మీ జ్ఞానజ్యోతిని మీరే వెలిగించుకోండి". ఏ కాలంలోనూ, ఏ మతప్రవక్త ఇంతటి హేతుబద్ధమైన ప్రవచనాన్ని వెలువరించలేదు.

బౌద్ధ దార్శనికతనంతటినీ 'రత్నత్రయా'ల రూపంలో వెల్లడించవచ్చు.

సంఘం శరణం గచ్ఛామి
బుద్ధం శరణం గచ్ఛామి
ధమ్మం శరణం గచ్ఛామి

"నేను ప్రార్థనలకై దేవాలయాలకు పోను. తపస్సుకై అరణ్యములు చేరను. నా సహచర మానవుల సంఘటిత శక్తిని శరణు వేడెదను. తాదాత్మ్యత పొందెదను".

"నేను దళారులైన పూజారులను ఆశ్రయించను. అంధ విశ్వాసాలకు బందీని కాను. జ్ఞానమును జ్ఞానవంతుల శరణు జొచ్చెదను"

"నేను క్రతువుల, యజ్ఞాలను ఆచరించను; న్యాయానికెల్లా న్యాయమైన ధర్మానికి సర్వవ్యాపిత కరుణకు విధేయుడనై ఉంటాను."

ఈ విధంగా బుద్ధుడు హేతువు, జ్ఞానాల ప్రాధాన్యతను గుర్తించాడు, వివరించాడు. మూఢవిశ్వాసము, అజ్ఞానము, భయము అనే ఊబినుండి నైతికతను ఉద్ధరించాడు; స్వర్గము దైవముల నుండి నిజజీవితాలవైపు మానవుని దృష్టి మళ్ళించాడు; స్వశక్తిపై మానవునికి నమ్మకం కలిగించాడు, జీవితాన్ని పునర్నిర్మించుకోవటానికి అవకాశం కల్పించాడు; బుజువైన, ఉన్నతమైన జీవితంపై ఆశను రేకెత్తించాడు; సుఖమయ జీవితాన్ని సాటి మానవులతో పంచుకునే నైతిక సామర్థ్యాన్ని పెంపొందించాడు.

2,500 సం॥నాటి దర్శనమైనప్పటికీ, రత్నత్రయం ప్రతిపాదించిన జీవన విధానం ఆధునిక మానవుని ఆశలు ఆశయాలకు అనువుగా తీర్చిదిద్దబడింది. 1. బౌద్ధం ప్రజాస్వామిక విలువలున్న దర్శనం. సమతా సమాజాన్ని ప్రతిపాదించింది; ధనిక-పేద, ఉన్నత-అధమ, మతస్థులు-మతద్వేషులు, Trusted- Trustees, Thesis - Antith-esis అనే కృత్రిమ విభజనలకు అందులో తావులేదు. వ్యక్తిని దైవానికో, ఆర్థిక వ్యవస్థకో బానిసను చేయదు. వ్యక్తిత్వ వికాసమే దాని ప్రాతిపదిక. 2. హేతువు విజ్ఞానశాస్త్రము బౌద్ధానికి పునాదులు. అసంబద్ధ ప్రమాణాలతో కూడిన వాఙ్మయాన్ని తృణీకరించింది. హేతువు, అనుభవము జీవితానికి మార్గదర్శకంగా పేర్కొంది. ప్రగతిపై విశ్వాసాన్ని కలిగించింది. 3. బౌద్ధం ఏకైకము, అవిభాజ్యము అయిన మానవ బంధాన్ని ధ్రువపరిచింది. మానవతా దృక్పథాన్ని స్పష్టం చేసింది. 4. దానినుండి ఉద్భవించిన 'కరుణ' క్లిష్టమైన ప్రపంచ శాంతి సమస్యను తొలిగిస్తుంది.

రత్నత్రయం ప్రతిపాదించిన జీవన విధానం జ్ఞానం. హేతువు, ప్రేమ, కరుణ, శాంతితో కూడి ఉన్నది. అజ్ఞానం, మూర్ఖత్వం, అంధవిశ్వాసం, ద్వేషాలకు అందులో తావులేదు. రత్నత్రయ మార్గం మానవ జాతికి నాగరిక జీవన విధానాన్ని ప్రతి పాదిస్తుంది. అందుకే ప్రస్తుత పరిస్థితులలో మానవాళి శ్రేయస్సుకు పురోగతికి, మరేయితర జీవన విధానాని కన్నా రత్నత్రయ మార్గం అనుసరణీయం.



# 2. బౌద్ధము - ఆంధ్రము

ప్రప్రథమంగా బౌద్ధానికి స్వాగతం పలికి, బుద్ధుని ఉపదేశాలను ఆదరించి ఆచరించిన భారతీయులలో ఆంధ్రులు ఒకరు.

అశోకుని మూడవ బౌద్ధ సమావేశానికి (Third Buddhist Council) ముందే ఆంధ్రదేశంలో బౌద్ధం ఉనికిని వాఙ్మయము, పురాతత్వ విశేషాలు వెల్లడిస్తున్నాయి. ఆంధ్రదేశంలో బౌద్ధము నాటికే విశేషజనాదరణ పొంది స్థూపనిర్మాణం జరిగిందని చెప్పవచ్చును. తూర్పున విజయనగరం జిల్లాలోని శాలిహుండం నుండి ప్రకాశం జిల్లాలోని రామతీర్థం వరకు, పడమర కరీంనగర్ జిల్లాలోని ధూళి కట్టనుండి, కడప జిల్లాలోని ఆదాపూర్ వరకు అనేక బౌద్ధక్షేత్రాలు బయల్పడినాయి. 600 సంవత్సరములకు (క్రీ.పూ. 300 నుండి క్రీ.శ. 300 వరకు) పైగా ఆంధ్రప్రజాజీవితంలోని అన్ని కోణాలను బౌద్ధం ప్రభావితం చేసింది. ఆంధ్రబౌద్ధ శ్రమణకులను 'అంధకులు' అని ఆనాడు పిలిచేవారు. అంధకులు బౌద్ధ దర్శనాన్ని సుసంపన్నం చేసారు. దక్షిణ దిశలోని శ్రీలంక, ఉత్తరాపథంలోని గాంధార తూర్పు సముద్రంలోని సువర్ణభూమి మున్నగు సుదూర ప్రాంతాలకు బౌద్ధమత సందేశాలైన 'మైత్రి', 'కరుణ' లను తీసుకువెళ్లారు.

బౌద్ధం ఆంధ్రదేశానికి విస్తరించిన సమయంలో ఆంధ్రులు 30 తెగలుగా (జాతులుగా) ఉండేవారని, దుర్భేధ్యాలయిన 30 దుర్గాలు ఉండేవని మెగస్తనీసు వ్రాసినాడు. మరో గ్రీకురచయిత ఆంధ్రులకు పట్టణాలతో, గొప్పసైన్యంతో కూడిన 30 రాజ్యాలు ఉన్నాయని వ్రాసినాడు. అశ్వకులు (నిజామాబాదు), శబికులు (కరీంనగరు) మహిశకులు (నల్గొండ), నాగులు (ధాన్యకటకం) యక్షులు (భట్టప్రోట) సోమకులు(వడ్డమాను) బహుశ: కళింగులు (గోదావరి ముఖద్వారము) మున్నగు ఆంధ్రతెగలను వాఙ్మయము పురాతత్వ విశేషాలు ధ్రువపరుస్తున్నాయి. ధాన్యకటకంలోని ప్రాచీన శాసనాలలో స్థానిక రాకుమారుల ప్రసక్తి

ఉంది. బ్రాహ్మణ వాఙ్మయం ఆంధ్రులను మ్లేచ్ఛులుగా గ్రామాల వెలుపల ఉండవలసిన వారుగా నిర్దేశించింది. ఆర్థికంగా సంపన్నులు, రాజకీయంగా చైతన్యవంతులు అయిన ఆంధ్రులు బ్రాహ్మణ వాఙ్మయ నిర్దేశాలకు వ్యతిరేకంగా బౌద్ధమతాన్ని ఆదరించటంలో ఆశ్చర్యం లేదు. ఆంధ్రులు బౌద్ధ సంస్థలను ఉదారంగా పోషించారు. బౌద్ధం భిన్న తెగల మధ్య అడ్డుగోడల్ని ఛేదించింది, బలమైన ఆంధ్రజాతిని తీర్చిదిద్దింది; ఒకే జాతి స్పృహను వారిలో కలిగించింది. ఒకే గొడుగు క్రింద చేరాలనే ఆకాంక్ష కలిగిన ఆంధ్రులు ఏకచ్ఛత్రాధిపత్యానికి పునాదులు వేసారు. తిరిగి ఏనాడు పొందలేనంత రాజకీయ (సార్వభౌమిక) అధికారం సాతవాహనులకు దక్కింది.

బౌద్ధయుగంలో ఆంధ్రులలో సామాజిక ఉదారభావం ప్రబలంగా ఉండేది. అప్పటికి కులవ్యవస్థ పటిష్ఠపడలేదు. బ్రాహ్మణులు సమాజంలో ప్రముఖ స్థానంలో ఉండేవారా? లేదా? అనేది అనుమానాస్పదం పాలకులు, సామాన్యులు బ్రాహ్మణ పండితులకు పూజారులకు దానాలు ఇచ్చిన శాసనాధారాలు అరుదు. గౌతమ, వశిష్ట, మున్నగు బ్రాహ్మణ గోత్రీకులు తమ పుత్రికలను సాతవాహనులకు వివాహం చేయటానికి ఉత్సాహం చూపేవారు. కథాసరిత్సాగరం, సింహాసన ద్వాత్రింశక, సాతవాహనులను హీనకులజాలుగాను, ఇక్ష్వాకులను స్థానిక తెగలుగాను (Indegenous stock) పేర్కొంటున్నాయి. ఆ విధమైన వివాహబంధాల ద్వారా వైదికమత పునరుద్ధరణోద్యమానికి రాజాదరణను వారు ఆశించారు. తద్వారా బౌద్ధమతానికి గల ప్రజాదరణను అరికట్టటం వారి ధ్యేయం. సాతవాహనులు బౌద్ధం పట్ల కృతఘ్నుతనే చూపారు. మనకు తెలిసినంతవరకు బ్రాహ్మణ రాణికి జన్మించిన మొదటి సాతవాహన రాజు - గౌతమీ పుత్ర శాతకర్ణి. అతడు వైదికమతంపై కృతజ్ఞతతో సమాజాన్ని 'ఆగమ' పద్ధతిలో పునర్నిర్మించాలని ప్రయత్నించాడు కానీ సఫలీకృతుడైనట్లు ఆధారాలు లేవు. కారణం- రాజు బొక్కసాన్ని నింపే గహపతులు (Rich Peasents) కమరులు (వృత్తిపనివారు) శ్రేష్టులు (సేట్టి-వణిజులు) బౌద్ధాన్ని ఆదరించారు. కుల సాంకర్యాన్ని అరికట్టినట్లు అతడు గర్వంగా చెప్పుకున్న మాటలు కూడా నీటిమూటలే. అతని కుమారుడు వాశిష్టీపుత్ర శివశ్రీ శక (మ్లేచ్ఛ) రాకుమారి

రుద్రదమనికను పెండ్లాడాడు. వైదిక రాజుగా కొనియాడబడే ఇక్ష్వాకు వంశస్థుడయిన శ్రీ ఛాంతమూలుని కుమారుడు, వీరపురుషదత్తుడు కూడా శక రాకుమారిని పెండ్లాడాడు. కుల చైతన్య చిహ్నాలు ఆనాడు ఏ రూపంలోనూ లేవు. సమస్త మానవాళితో తాదాత్మ్యతను మహాయాన బౌద్ధ నైతికసూత్రాలు ప్రతిపాదించాయి. ఆ సూత్రాలకు ఆంధ్రులు కట్టుబడే ఉండేవారు. వారిచ్చిన బహుమతులు సమస్త మానవజాతి కల్యాణానికి ఉద్దేశింపబడేవి.

ఆచార్య నాగార్జునుడు తన 'లోకతితస్తవ' ఇలా ముగిస్తాడు.

యదానాప్తం మయాపుణ్యాం
స్తువత్యం స్థుతి భాజనం
అనిమిత్త బంధనాపీఠం
భూయాత్ తేనా ఖిలం జగత్.

సామాన్య ప్రజలు కూడ ఇదే స్ఫూర్తితో ఉండేవారని జగ్గయ్యపేట శాసనం వెల్లడిస్తోంది. ఒక వణిక ప్రముఖుడు అందులో ఇలా అంటాడు.

తేనపుణ్యేన లోకోయాం
నిర్వాణ మధిగచ్ఛతు.

బౌద్ధ మతం ప్రతిపాదించిన సామాజిక సమతాభావాన్ని, విశ్వ ఉదార స్ఫూర్తిని అమరావతిలోని ఒక శాసనం ద్వారా మనం గ్రహించవచ్చును. 'విధికు'డనే చర్మకారుడు సకుటుంబంగా స్తూపాన్ని దర్శించి బహుమతులు ఇచ్చినట్లు ఆశాసనం వెల్లడిస్తోంది. నేటి లౌకిక(?) భారతదేశంలో కూడా ఒక వైదిక సంస్థలో అలా జరగటం ఊహించలేము. బౌద్ధం క్షీణించి 'ధర్మమహారాజు'లు రాజకీయాధికారులై లౌకికతత్వముపై స్వేచ్ఛగా తమ కృపాణాలను సంధించిన తరువాతనే ఆస్ఫూర్తి అంతరించింది; ఆంధ్రదేశంలో కులాలు ఘనీభవించి కులచైతన్యం ప్రబలింది; సాంఘిక అసమానతలకు, విద్వేషాలకు ఆంధ్రులు గురయినారు.

బౌద్ధమతము ప్రజలను బద్ధకస్తులుగా చేస్తుందనీ, దేశ ఆర్థిక మాంధ్యానికి కారణమవుతుందనీ అనటం కేవలం అపోహ. ఆనాడు వ్యవసాయము, వాణిజ్యము, పరిశ్రమలు ఆంధ్రదేశంలో సర్వతోముఖంగా వృద్ధిచెందాయి. గోదావరి ముఖద్వారం రేవుపట్టణంగా ప్రసిద్ధిచెంది లాభదాయకమైన నౌకావాణిజ్యానికి ఆటపట్టయింది. కృష్ణాజిల్లా వరిపండే సారవంతమైన భూమి. అనంతపురం కర్నూలు ప్రాంతాలు బంగారు గనులకు ప్రసిద్ధిచెందినాయి. శ్రేష్ఠులు తీరప్రాంతము, పీఠభూమి ప్రదేశాలలో ధాన్యము, జౌళివస్త్రాలు, అటవీసంపద, పశుసంపదతో వర్తక సంబారాలు నిర్వహించేవారు. సువర్ణభూమి, ఇతర దూరప్రాంతాలకు మహానావికుల పడవలతో వాణిజ్యం నెరపేవారు. వీరు గడించిన లాభాలతో పర్వత సమానమైన ఉన్నత చైత్యాలను (చైత్యశాలలను) ధాన్యకటకము, భట్టిప్రోలు ఘంటసాల మున్నగు ప్రదేశాలలో నిర్మించారు. ఆంధ్రదేశం నాలుగు చెఱగులా రోమను నాణాలు లభించాయి. శాతవాహనుల, ఇక్ష్వాకుల నాణాలు ఆనాటి ఆంధ్రదేశసిరిసంపదలను వెల్లడిస్తున్నాయి. సువర్ణ భూమిలోని ఆంధ్రవాణిజ్య స్థావరాలు ఆగ్నేయ ఆసియాలో బౌద్ధ సంస్కృతీ విస్తరణ కేంద్రాలుగా విలసిల్లినాయి.

బౌద్ధ శ్రమణకులు కొండలలో అడవులలో నివసించే వారు కారు; ప్రజలలో ఒకరుగా ఉండేవారు. మతపునాదులు పటిష్ఠము, విశాలము చేస్తూనే సామాజిక నైతికతకు, వ్యక్తివికాసానికి, ఆధ్యాత్మిక ఔన్నత్యానికి పాటు పడేవారు. ఆంధ్రశ్రమణకుల మేధాసంపద సూత్రవాఙ్మయాన్ని సుసంపన్నం చేసింది, మహాయాన విప్లవానికి నాంది పలికింది. ప్రాచీన కాలం నుండి ఆంధ్రులు శుద్ధ సాంప్రదాయ వాదులు కాదు; సంస్కరణోద్యమాలలో ముందుండే వారు. వైదికమత పునరుద్ధరణోద్యమ కారణంగా జనజీవితం మార్పు చెందసాగింది. ఆంధ్ర బౌద్ధులు కూడా తమ మతంలోని కట్టుబాట్లను సడలించే ప్రయత్నం చేసారు. మత పునాదులను విశాలం చేసారు. కృష్ణా ముఖ ద్వారంలోని విహారాలు మేధా చైతన్యవంతాలయినాయి. 'ద్వితీయ సంగీతి' లో తాను ప్రతిపాదించిన సూత్రాల కారణంగా సంఘంలో విభజన తెచ్చిన మహా దేవభిక్షు ధాన్యకటక చైత్యశాలలో నివసించేవాడు. 'ద్వితీయ సంగీతి' తర్వాత మహాసాంఘికులకు ధాన్యకటకం నెలవయింది.

వారు తమని చైత్యకులు, శైలులు అని పిలుచుకునేవారు. బుద్ధుని ఉపదేశాలపై విశేష పరిశోధనలు చేసారు. సూత్ర వాఙ్మయం పలువిధాలుగా వృద్ధిచెందింది. ప్రజ్ఞాపారమిత, వైపుల్య వెలసి మహాయాన బౌద్ధానికి పునాదులయినాయి. సూత్రాలను విశదీకరించే శాస్త్ర వాఙ్మయం కూడా వృద్ధిచెందింది. శాస్త్ర, సంహితలలో ఉద్దండులయిన ఆచార్య నాగార్జునుడు, అతని శిష్యుడు ఆర్యదేవుడు శ్రీపర్వత ధాన్యకటక విహారాల్లో నివసించేవారు. వీరే మహాయానాన్ని ఒక దర్శనంగా మత శాఖగా తీర్చిదిద్దారు. ఆచార్య నాగార్జునుని మేధా సంపద అసమానం. భారతీయ దర్శనము తత్వచింతనలపై అతని కృషికి అతని ప్రత్యర్థులే తలలు వంచేవారు. నాగార్జునుడు, ఆర్యదేవుడు (వీరి) తరువాత బుద్ధపాలిత, భావవివేక, దిఙ్నాగ, ధర్మకీర్తి, మహాయాన బౌద్ధానికి పుష్టిని చేకూర్చారు. వీరి భిన్న దృష్టిని, మేధా వైశాల్యాన్ని, వీరి వ్రాతలు ఋజువు చేస్తున్నాయి. ఆంధ్రజిజ్ఞాసువులు, భారతీయ దర్శనానికి, ప్రధానంగా తర్కశాస్త్రానికి చేసిన కృషిచాలా ఉన్నతమైనదని వారి ప్రత్యర్థులే కీర్తించారు.

ఆచార్య నాగార్జునుని సృహల్లేఖ, రత్నావళి,(పటిష్టమైన) ప్రభుత్వ యంత్రాంగము, సుఖమైన సామాజిక జీవనము మున్నగు లౌకిక సమస్యలను నిశిత దృష్టితో పరిశీలించాయి. నాగార్జున, ఆర్యదేవ అసంగ, వశుబంధు, దిఙ్నాగ, ధర్మకీర్తి అనే ఆరు వజ్రాలతో భరతవర్షము అలంకరింపబడినదని టిబెట్ వాఙ్మయం తెలియ చేస్తోంది. ఆ ఆరువజ్రాలలో నలుగురు ఆంధ్రులు కావటం గర్వించవలసిన విషయం.

మహాయాన బౌద్ధానికి ఆంధ్రదేశం జన్మస్థలం. థేరవాద బౌద్ధానికి ఆంధ్రుల సేవ అపారము. ధాన్యకటకము మహాయానానికి ఆయువుపట్టు; నాగార్జున కొండ ప్రాంతంలోని పల్లబొగ్గ థేరవాద బౌద్ధానికి నెలవు. థేరవాద బౌద్ధానికి మూలకేంద్రమైన శ్రీలంకతో సంబంధాలు కలిగియుండేది. శిహలవిహారము, మహిశాసన విహారము, వనవిహార, వశివిహారము మున్నగు అరడజనుపై బడిన నాగార్జున కొండ ప్రాంతములోని విహారాలు థేరవాద విహారాలుగా ప్రసిద్ధి చెందాయి. క్రీ॥శ॥ మూడవ శతాబ్ది మధ్యకాలంలో శ్రీలంకకు వెళ్లిన వైతుల్యకుల (చైత్యకులలో ఒక తెగ) పై శ్రీలంకబౌద్ధులలో తీవ్ర

వ్యతిరేకత వ్యక్తం అయింది. పాళీ సంస్కృతిని రక్షించే ఉద్దేశ్యముతో శ్రీలంకలోని మహావిహారవాసినులు థేరవాద పునరుజ్జీవనానికి ఉద్యమించారు. స్మృతి పథం నుండి దూరమైన పాళీ సంస్కృతి తిరిగి పొందేందుకు ఆంధ్ర మహావిహారవాసినులు బుద్ధఘోషుని శ్రీలంకకు పంపారు. డి.డి. కోశాంబి, సుకుమారదత్తు మున్నగు చరిత్రకారులు పల్నాడులోని కోట నెమలిపురి - గోడలూరు (మొరందకేతక) బుద్ధఘోషుని నివాసస్థలంగా గుర్తించారు. శ్రీలంకనుండి తిరిగివచ్చిన బుద్ధఘోషుడు నాగార్జున కొండలోని కులధమ్మగిరి, శిహలవిహారములోని బోధివృక్షఛాయలలో 'విశుద్ధమగ్గ' ను వ్రాశాడు. అది థేరవాద బౌద్ధంపై ప్రామాణిక నిఘంటువు.

ఆంధ్ర బౌద్ధుల సృజనవాఙ్మయానికి మాత్రమే పరిమితం కాదు. బౌద్ధం ప్రవేశించేనాటికి ఆంధ్రులు భూతవాదులు (animists) పూర్వీకుల భౌతికకాయాలపై నిర్మించిన రాక్షసి గుళ్లను (Megalithic tombs) పూజించేవారు. బౌద్ధమత ప్రవేశంతో ఈ సంస్కృతి కొత్తరూపు రేఖల్ని దిద్దుకుంది. రాక్షసిగుళ్ల స్ఫూర్తితో మహాజ్ఞాని అయిన బుద్ధుని ధాతువులపై (అవశేషాలు) పెద్ద చైత్యాలు స్తూపాలను నిర్మించారు. కృష్ణాముఖద్వారములోని మజేరిక దేశంలోని ధాతుచైత్యాల వివరణ ప్రాచీన సింహళ దేశ చరిత్ర గ్రంథాలు మహావంశ, దలదవంశలలో లభించింది. స్థానిక వాఙ్మయము, శాసనాలు ఆ విషయాన్ని ధృవపరుస్తున్నాయి. ధాన్యకటకము, భట్టిప్రోలు, జగ్గయ్యపేట, ఘంటశాల, నాగార్జున కొండ, గుడివాడ, గోలి, వడ్డమాను, పేదగంజాం మున్నగు ప్రదేశాలలో పర్వత సమానమైనస్తూపాలుండేవి. చిన్న స్తూపాలున్న ప్రదేశాలనేకము. ప్రతి చైత్యము ఒక వాస్తుకళా విశేషంగా రూపొందింది. నాటి ఆంధ్రబౌద్ధులు సర్వప్రాణుల మంచిని సుఖసంతోషాలను ఆశించారు. వారి విశ్వసమభావము ఆత్మసౌందర్యాన్ని పెంపొందిస్తుంది. ఆత్మసౌందర్యమే సృజనాత్మక మేథకు స్ఫూర్తినిచ్చి, అమరావతి, నాగార్జునకొండలోని ఆంధ్రశిల్పాన్ని సృజించింది. అసమాన్య చైతన్యం ఉట్టిపడుతూ ఆంధ్ర శిల్పకళ విశిష్టస్థానాన్ని పొందింది. వైశాల్యము శిల్పకళా సంపదల దృష్ట్యా ప్రపంచంలోని సమకాలీన బౌద్ధస్థూప విశేషాలలో కెల్లా ధాన్యకటకస్తూపము ఉత్తమమయినదిగా కీర్తింపబడింది. అమరావతికళలో

స్తబ్దత లేదు; వృక్ష సంపద, జంతుజాలము, మానవ ప్రతిమలు జీవంతో తొణికిసలాడుతాయి. అమరావతి శిల్పాలు వివిధ భంగిమలతో మృదువుగా మలచబడి (Plastic Art) సజీవంగా దర్శనమిస్తాయి. శిల్ప కళాప్రపంచంలో అమరావతి శిల్పము 'మచ్చుతునక' అని నిపుణుల అభిప్రాయం.

ఆంధ్రులు బౌద్ధధర్మాన్ని భౌగోళికంగా విస్తరించారు. శ్రీలంక, బర్మా, మలయా, ఇండో చైనా దేశాలు బౌద్ధ ధర్మంతో పాటు ఆంధ్ర సంస్కృతీ వైశిష్ట్యాన్ని కూడా రుచి చూసాయి. భూటాను, చైనా, జపాను, టిబెట్ దేశాలు ఆచార్య నాగార్జునుని కీర్తిస్తాయి. బర్మా, శ్రీలంక దేశాలు బుద్ధఘోషుని గౌరవిస్తాయి.

సాంఘిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక కళారంగాలను నిష్పాక్షిక దృష్టితో నిశితంగా పరిశీలించి చూస్తే ఆంధ్రుల చరిత్రలో బౌద్ధయుగం స్వర్ణయుగమనదగినది.



# 3. బౌద్ధము - ఆంధ్ర శిల్పకళా సంప్రదాయములు

మహాదేవ, ఆచార్యనాగార్జున, ఆర్యదేవ, భవ్య, దిఙ్నాగ, బుద్ధఘోష, ధర్మకీర్తి వంటి దిగ్దంతాలైన దార్శనికులు బౌద్ధదర్శనాన్నేగాక భారతీయ తత్వ తార్కిక ఆలోచనావిధానాన్ని సుసంపన్నం చేసినారు. ఆంధ్ర శిల్పులు తమ తమ సౌందర్య భావనకు సృజనా సామర్థ్యాన్ని జోడించి జగద్విఖ్యాతమైన శిల్ప ప్రపంచాన్ని సృష్టించి భారతీయ శిల్పకళాచరిత్రలో అద్వితీయమైన స్థానాన్ని ఆక్రమించి అజరామరమైన కీర్తిని గడించినారు. నిజానికి బౌద్ధయుగంలో ఆంధ్ర దేశంలో జరిగినంతటి తాత్విక చింతన దార్శనిక సారస్వత సృష్టి, కళాసృష్టి మరేయుగంలోనూ జరగక పోవడం ఆశ్చర్యం కలిగించడమేగాక ఆలోచనీయమైన చారిత్రక సమస్య. చాళుక్య యుగంలో, కాకతీయ విజయనగర యుగాల్లో ఆంధ్రదేశంలో శిల్పసృష్టి జరగక పోలేదు. అయితే బౌద్ధయుగ శిల్ప కళే ఆంధ్ర శిల్ప సంప్రదాయం అని రూఢిగా వాస్తుశిల్పచారిత్రక గ్రంథాలలో నమోదు కావడం గమనార్హమైన అంశం. అందుకు కారణం అందలి విశిష్ట సౌందర్యం వ్యక్తిత్వమేనని చెప్పవచ్చు.

బుద్ధుని కాలంలోనే ఆంధ్రులు బౌద్ధానికి నివాళులర్పించి ఆదరించినారనడానికి ఆధారాలున్నాయి. బావరి కథ - సుత్త నిపాతం - విమాన వత్థాకధ, సింహళ చరిత్ర మహావంశ-పల్లవ బొగ్గ ఈ విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి. సుప్రసిద్ధ బౌద్ధ క్షేత్రాలలో అశోకుడు శిలాస్తంభాలు ప్రతిష్టించినాడు. అందుచే ధాన్యకటకం నాటికే బౌద్ధ క్షేత్రం అయిఉండవలే. భట్టిప్రోలు, జగ్గయ్య పేటలలోని స్తూపాలు క్రీ.పూ. 200 నాటికే ఏర్పడినవనడానికి నిదర్శనాలున్నాయి. వీనిని బట్టి నాటికే బౌద్ధం ఆంధ్ర దేశంలో విశేషజనాదరణపొంది స్తూపనిర్మాణం జరిగిందని చెప్పవచ్చు. నాటి ప్రజలు చిహ్నారాధకులని Toternistic tribes - మృతులకు రాక్షసిగుళ్లు అనే సమాధులు నిర్మించేవారని

తెలుస్తుంది. ఆంధ్రదేశంలో అనేక ప్రాంతాల్లో రాక్షసిగుళ్ళు అసంఖ్యాకంగా దొరికినాయి - దొరుకుతున్నాయి. ముఖ్యంగా ధాన్యకటకం, నాగార్జునకొండలలో, అంటే బౌద్ధ క్షేత్రాలలో, రాక్షసిగుళ్లు ఉండటం గొప్ప విశేషం.

రాక్షసిగుళ్ల ద్వారా నాటి ప్రజలకు మరణానంతర జీవితంలో విశ్వాసం ఉన్నదని, పితృదేవతలను ఆరాధించేవారని, మృతులకు సమాధులు - స్మారక చిహ్నాలు నిర్మించే ఆచారం వారికి ఉందని తెలుస్తుంది. వారికి ఇనుము బంగారం వంటి లోహాల వాడకం తెలుసునని బోధపడుతుంది. ముఖ్యంగా ఇనుప పనిముట్ల వాడకంతో ప్రజల ఆర్థిక జీవితంలో విప్లవం వచ్చినట్లు చరిత్రకారులు అంగీకరిస్తారు. వ్యవసాయం చురుకుగా సాగి వ్యవసాయంపై ఆధారపడిన పరిశ్రమలు పెంపొందడానికి అవకాశం ఏర్పడింది. ఆంధ్రదేశం వస్త్ర పరిశ్రమకు ప్రసిద్ధికెక్కినట్లు భీమసేనజాతకం వంటి బౌద్ధవాఙ్మయం వల్ల గ్రహిస్తున్నారు. ఆంధ్రదేశంలోని నగరాలను పశ్చిమతీర రేవులతో కలుపుతూ మచిలీ పట్టణం, వినుకొండ, ప్రాంతాలనుండి రహదారులున్నట్లు పరిశోధకులు కనుక్కున్నారు. నదీ మైదానాల్లో పంటలు విరివిగా పండి వస్త్రాది పరిశ్రమలు పెంపొంది వాణిజ్యం విస్తరించడం వల్లనే ఆంధ్రదేశంలో ముప్పది నగరాలేర్పడడానికి అవకాశం కలిగింది. అంటే ఆంధ్రదేశంలో హస్తకళాకారులు, వర్తకవర్గాలు ఐశ్వర్యవంతములై సమాజంలో బలపడి ప్రముఖస్థానం ఆక్రమించినారు.

బౌద్ధమతం సామాన్య ప్రజానీకంలో ఒక కొత్తచైతన్యం కలిగించింది. వ్యయప్రయాసలు లేని ప్రవర్తనా సూత్రావళి ననుసరించి ఆత్మ సంస్కారం పొంది తద్వారా మానవ కల్యాణం సాధ్యమనే ఆత్మవిశ్వాసం కలిగించింది బౌద్ధం. బౌద్ధ దర్శనం ద్వారా కలిగిన నూతనోత్సాహంతో, నవచైతన్యంతో తాము సాధించిన ఆంతరంగిక సౌందర్యానికి ప్రతీకలుగా గంభీరము మనోజ్ఞము అయిన కళా ప్రపంచాన్ని బౌద్ధులు సృష్టించారు.

ఆంధ్రదేశంలోని బౌద్ధక్షేత్రాలన్నింటిలో సుప్రసిద్ధమయింది ధాన్య కటకం. దాన్నే అమరావతి అని ప్రస్తుతం వ్యవహరిస్తున్నాం. బౌద్ధ జాతక కథలతో తేలివాసహానదికి దక్షిణాన ఉన్నట్లు పేర్కొన్న ఆంధ్ర నగరియే ధాన్యకటకం అయి ఉంటుంది. అమరావతి

కంటే పూర్వమే భట్టిప్రోలు జగ్గయ్యపేటలలో ఆంధ్ర శిల్ప సంప్రదాయాలకు అంకురార్పణ జరిగిన సూచనలు లభ్యమవుతున్నప్పటికీ ధాన్య కటకం సుమారొక వేయి సంవత్సరాల కాలం బౌద్ధమతానికి శిల్పసంప్రదాయాలకు నిలయం కావడమేగాక ఇచట ఆంధ్ర శిల్పుల సృజనా సామర్థ్యం పరాకాష్ఠకు చేరి యితర ఆంధ్రప్రాంతాల శిల్పులకు వరవడి అయింది. నాగార్జున కొండ, చందవరం, గుమ్మడి దుర్రు, గోలి మొదలైన ఇతర బౌద్ధ క్షేత్రాల శిల్పానికి అమరావతీ శిల్పం మాతృక కావడమేగాక దూర దేశాల బౌద్ధ శిల్పాన్ని కూడ ప్రభావితం చేసినందున ఆంధ్ర శిల్ప సంప్రదాయాన్ని అమరావతీ శిల్ప పద్ధతి అని పిలవడం వాడుక అయింది.

చైత్యం అనేమాట చితి నుండి, స్తూపపదం స్తూప్ పదం నుండీ ఏర్పడినాయి. స్తుప్ అంటే ప్రోగుచేయుట. మహాపురుషుల శారీరక అవశేషాలపై స్తూపాలు నిర్మించడం బుద్ధునికంటే ప్రాచీనమైన సంప్రదాయం. ఉదయన, గౌతమ వేదుల స్తూపాలతో శ్రావస్తినగరం సుందరమైనదని బౌద్ధమత గ్రంథాలు ప్రశంసిస్తున్నాయి. తనకు గూడ స్తూపం నిర్మించమని బుద్ధుడు శిష్యులకు సందేశం ఇచ్చినట్లు మహా పరినిర్వాణ సుత్తలో స్పష్టంగా ఉంది. Those who gaze me gaze Dharma – నన్ను చూచినవాడు ధర్మాన్ని చూస్తాడని బుద్ధుడు చెప్పినాడు. కాబట్టి స్థూపం స్మృతి చిహ్నంగా ఉండి బుద్ధుని మహాత్యాగాన్ని, ప్రపంచంలోని దు:ఖోపశమనానికి అతడు సూచించిన అష్టాంగ మార్గాన్ని ప్రజలకు గుర్తుతెస్తుందని అతని ఉద్దేశం - ఆ మహదాశయంతోనే బుద్ధుని ధాతువులపై అశోకుడు దేశము నలుమూలలా 84 వేల స్థూపాలు నిర్మించినాడని ప్రతీతి.

ఆంధ్రదేశంలో సమాధి నిర్మాణ సంప్రదాయం అనాదిగా ఉన్నదని పైన పేర్కొన్నాము. అందుచే చైత్య నిర్మాణ సంప్రదాయం ఆంధ్రులకు కొత్తగాదు. బౌద్ధవాఙ్మయంలో యక్షులు, నాగులు సిద్ధహస్తులుగా వర్ణింపబడినారు. వీరు ఆంధ్రజాతులలోని వారే. తత్ఫలితంగానే ఆంధ్రదేశంలో పెద్దపెద్ద చైత్యాల నిర్మాణం జరిగింది. భట్టిప్రోలు, అమరావతి, నాగార్జున కొండ, గుడివాడ, గుమ్మడి దుర్రులోనివి చాలా పెద్ద స్థూపాలు. అయితే ప్రథమదశలో ఇవి కేవలం నిరాడంబరములైన స్మారక చిహ్నాలు మాత్రమే.

శిల్పాలంకరణ ఉండేది కాదు. దృశ్యకళలు ఇంద్రియాలను విషయవాంఛలను ప్రకోపింపజేసే ప్రమాదం ఉన్నందున వాటిని బుద్ధుడు బహిష్కరించాడు. "కామాహి చిత్రా మధురామనోరమా. విరూపరూపేన మథేంతి చిత్తం." సుందర కావ్య నిర్మాణాన్ని కూడబౌద్ధులు నిరసించినారు. కావ్యప్రయోజనం రసానుభూతి కాదు, ధర్మానురక్తి కలిగించటం. సనాతన బ్రాహ్మణ మతస్థులు సైతం "కావ్యాలాపాంశ్చవర్జయేత్" అన్నారు. మూలబౌద్ధంలో, అంటే తరువాతి మాటల్లో హీనయానంలోని క్రమశిక్షణ అంత కఠినమైంది.

అమరావతీ స్తూపచరిత్రలో శిల్పపరిణామ క్రమంలో విమర్శకులు కనీసం మూడు దశలను స్పష్టంగా చూస్తున్నారు. క్రీ.పూ.మూడో శతాబ్ది చివరనుండి మొదటి శతాబ్ది మధ్య మొదటిదశ. ఈ దశలో స్థూపం నిరాడంబరమై అల్ప ప్రమాణం కలదిగా ఉండేది. చక్రాకృతిలోని వేదిక - వేదికపై అండం - దానిపై హర్మిక. హర్మికలో సార్వభౌమాధికార సూచకమైన ఛత్రము. వేదికకు నాలుగు దిక్కులా ఆయక వేదికలు. వానిపై ఐదేసి చొప్పున ఆయక స్తంభాలు మొత్తం ఇరవై ఉండేవని చెప్పవచ్చు. ఆయక వేదికలు - స్తంభాలు-ఆంధ్రదేశంలో ముఖ్యంగా కృష్ణాతీర స్తూపాలకు ప్రత్యేక లక్షణంగా భావిస్తున్నారు. ఈ ఐదు స్తంభాలు గౌతమబుద్ధుని జీవితంలోని పంచకల్యాణాలను సూచిస్తాయి. పుణ్యక్షేత్రాలలో స్తంభాలను ప్రతిష్ఠించడం చాల పురాతన సంప్రదాయం. బుద్ధుని జీవితంతో ముడిపడిన ఐదుప్రదేశాల్లో లుంబిని, కపిలవస్తు, బుద్ధగయ, సారనాథ్ కుశి నగర - బహుశా స్తంభాలు నిలిపేవారు. ఆ ప్రదేశాలన్నిటినీ దర్శించడం సాధ్యంకాని వారు స్తూపాలకు అనుబంధంగా ఆయక స్తంభాలు నిలిపేవారని ఒక సూచన - కాని ఇవి దీపస్తంభాలని హర్మికలోని ధాతువులకు వెలుగునిచ్చే విధంగా ఈ స్తంభాలపై దీపాలుంచే వారని మరొక సూచన. ఏమైనా ప్రథమ దశలోని స్వల్ప శిల్పాలు బార్హూత్, సాంచీ శిల్పాలకు సన్నిహితంగా ఉంటాయి. ఇటీవల అమరావతిలో దొరికిన ఒక శిల్పాన్ని విమర్శిస్తూ నాటి పురావస్తు శాఖాధ్యక్షుడైన ఎన్. ఘోష్ - బార్హూత్ కంటే ముందుగానే అమరావతిలో శిల్పకళాసృష్టి ప్రారంభమై ఉంటుందని సూచిస్తాడు.

క్రమంగా బౌద్ధంలో మార్పులు వచ్చాయి. బుద్ధుని పరి నిర్వాణానంతరం వంద

సంవత్సరాలకే బౌద్ధసంఘం థేరవాద మహాసాంఘిక శాఖలుగా చీలి పోయింది. మహాసాంఘికుల్లో స్థానిక విభేదాలతో భిన్న శాఖలేర్పడినాయి. చైత్య నిర్మాణంలో నైపుణ్యం ప్రదర్శించిన ఆంధ్రదేశంలో చైత్యకవాదం ప్రబలింది. అమరావతి చైత్యకవాదానికి కేంద్రమయింది. బౌద్ధసిద్ధాంతాల్లో, విశ్వాసాల్లో, ఆచారాల్లో వచ్చిన మార్పులు ఆంధ్ర శిల్పంలో ప్రతిఫలించినాయి. స్మారక చిహ్నమైన స్తూపం ఆరాధ్య వస్తువైంది. దీనితో స్తూపాలంకరణ ప్రారంభమయింది. చైత్యక వాద ఆచార వ్యవహారాలకు లోకోత్తర వాదం తాత్వికమైన ఆధారం అయింది. తథాగతుడు - మార్గ దర్శకుడు అయిన గౌతమబుద్ధుడు - లోకోత్తరుడు, మహాపురుషుడు, ఆరాధ్యుడు అయినాడు. గౌతమ బుద్ధుని విగ్రహాలు ప్రతిష్టించడం జరగలేదుకాని బుద్ధునికి చిహ్నంగా సింహాసనం, బోధివృక్షం, ధర్మచక్రం, త్రిరత్నం, బుద్ధపాదాలు ఆరాధించడం ప్రారంభమయింది. ఆ చిహ్నాలతోటి శిలాఫలకాలు వేదిక చుట్టు అలంకరించ సాగినారు. వేదిక చుట్టూ ఉన్న శిలా కంచుకం (Casing) ఈ యుగానిదే. ఈ యుగంతోనే బార్హూత్, సాంచీ సాంప్రదాయాలనుండి భిన్నమైన సంప్రదాయం అమరావతీ శిల్పులు రూపొందించసాగినారు. సాంచీ, బార్హూత్ శిల్పాలలోని స్తబ్దతకు స్వస్తి చెప్పి చైతన్యవంతమైన సహజ సౌందర్యాన్ని రంగరించడానికి అమరావతీ శిల్పి పూనుకున్నాడు. బార్హూత్ శిల్పాల క్రింద ఆ శిల్పాన్ని వివరిస్తూ లేఖనం కనిపిస్తుంది. అమరావతి ప్రథమ దశలోనూ అట్టి లేఖనాలున్నాయి. క్రమంగా ఈ రెండో దశలో అమరావతీ శిల్పి ఆ లేఖనాలు వ్రాయడం మాని శిల్పాలచేతనే మాటాడించినాడు. అంటే శిల్పం చూడగానే అందలి కథావస్తువు, భావం బోధపడేటంత సహజత్వం ఉట్టిపడేటట్లు శిల్పాలను మలచినాడు.

క్రమంగా క్రీస్తుశకారంభ శతాబ్దాలలో మహాసాంఘిక, చైత్యకవాద సిద్ధాంతాలు మహాయానంగా రూపొందింది. మహాయాన పరిణామం బౌద్ధమత చరిత్రలో ఒక గొప్ప విప్లవం. ఆలోచనలో ఆచారాల్లో, ఆశయంలో బౌద్ధులలో విప్లవాత్మకమైన మార్పుకు కారణమయింది మహాయానం. బుద్ధుడు మహాదేవుడైనాడు. బోధిసత్త్వ సిద్ధాంతం ఏర్పడింది. తీర్థయాత్రలు దానధర్మాల ద్వారా బుద్ధుని కరుణ సంపాదించితే నిర్వాణం

లభిస్తుందనే విశ్వాసం ఏర్పడింది. బోధిసత్వ సిద్ధాంతం పునాది మీదనే అసంఖ్యాకమైన జాతకకథా సాహిత్యం ఏర్పడింది. ఒక్క మాటలో బౌద్ధదర్శనం ఆకర్షణీయమైన మతంగా రూపొందింది. రాధాకృష్ణపండితుడు "Buddhism was a religion of classes but not of masses." అన్నాడు. కానీ ఈ అభిప్రాయం మహాయానానికి వర్తించదు. మహాయానం పామరుల మతం అయింది.

మత విశ్వాసాల్లో వచ్చిన మార్పులతో నాటి నిర్మాణకార్య క్రమాల్లో శిల్పస్వభావంలో గొప్ప విప్లవం వచ్చింది. నాటి విశ్వాసాలకు అనుగుణంగా ప్రజలు బౌద్ధస్థూపాలు నిర్మించడంలో వానిని అలంకరించడంలో అపూర్వమైన శ్రద్ధ ప్రదర్శించినారు. అమరావతిలో ఈ యుగ శిల్పం శిలా ప్రాకారంలో కనిపిస్తుంది. ఈ ప్రాకారాన్ని రెండో శతాబ్ది ఉత్తరార్ధంలో నాగార్జునాచార్యుడు నిర్మించినాడని ప్రతీతి. పదమూడు అడుగులు ఎత్తుండే ఊర్ధ్వపట్టికలను కలుపుతూ, మూడు సూచీపట్టికలు, వానిపై మదురు ఉండేవి. ఈ కమ్మలు - మదురు పూర్తిగా శిల్పీకృతములే. ప్రాకారాన్ని నాగార్జునుడే ఉద్దేశించినా ఇందలి వివిధ భాగాలను ప్రజలే దానం చేసినట్లు వానిపైని లేఖనాలవల్ల తెలుస్తుంది. ఆంధ్రదేశంలో మరే యుగంలోనూ మతసంస్థల నిర్మాణంలో పోషణలో ప్రజలు ఇంతటి శ్రద్ధాసక్తులు ప్రదర్శించలేదు. అందుచే మహాయాన శిల్పాన్ని Popular Art -ప్రజాశిల్పం అని చెప్పడంలో తప్పులేదు.

మరో ముఖ్య విశేషం. మహాయాన ఆంధ్రశిల్పులకు నిబంధనలు తొలగి స్వేచ్ఛలభించింది. వారి భావనా శక్తికి, సృజనశీలతకు శిల్ప నైపుణ్య ప్రదర్శనకు అవకాశం లభించింది. కథావస్తువు కూడా అపారంగా లభించింది. జాతక కథలు, లలిత విస్తార - అశ్వఘోషుని బుద్ధచరిత సౌందరనందకావ్యం, నాటికి బహుళ ప్రచారం పొంది ఉంటాయి. అశ్వఘోషుని కావ్యాలలోని స్త్రీమూర్తులకు అమరావతీ శిల్పంలోని స్త్రీమూర్తులకు సన్నిహితమైన పోలికలున్నాయి. బుద్ధుని జాతక కథలు - బుద్ధుని జీవితంలోని వివిధ ఘట్టాలు - మాయాదేవి స్వప్నం మొదలు మహాపరి నిర్వాణం వరకు - ముఖ్యంగా పంచకల్యాణాలు శిల్పీకరించాడు. అమరావతీ శిల్పాలన్నీ లభించి ఉంటే బోధిసత్వ

చరిత్ర సమగ్రంగా బొమ్మల్లో ఉండేది. ప్రతి జాతక కథను ఒక దృశ్యకావ్యంగా మలచినాడు అంతేకాదు ఆ కావ్యంలోని పాత్రలచే నటింపజేసినాడు. అమరావతి శిల్పంలోని ప్రత్యేకత 'Movement' అని విమర్శకులంటారు. ఈ చైతన్యాన్ని భిన్న శరీర భంగిమల ద్వారా, అంగవిక్షేప చిత్రణల ద్వారా ముఖ భంగిమల ద్వారా సాధింప గలిగాడు. శరీరం ఎన్ని వంపులు తిరగగలదో ఆ వంపులన్నీ అమరావతీ శిల్పంలోని మూర్తుల్లో కన్పిస్తాయి. అందుచేతనే అమరావతీ శిల్పాన్ని దర్శించేటప్పుడొక నాటక ప్రదర్శనను తిలకిస్తున్న భావన కలుగుతుంది.

Herbert Reed అనే విమర్శకుడంటాడు - 'The interest in Renaissance art is psychological' అని. మహాయానయుగ అమరావతీ శిల్పంలో ఆ లక్షణం స్పష్టంగా కన్పిస్తుంది. ప్రేమ, జాలి, కరుణ, క్రోధం, అహంకారం మొదలైన భావాలను క్లిష్టములైన చిత్తప్రవృత్తులను శిల్పీకరించటంలో అమరావతీ శిల్పికి భారతదేశంలో మరే ప్రాంత శిల్పికూడా సాటిరాడు. దీనితో శిల్పంలో సహజత్వం సాధ్యమవుతుంది. Art comes very near to flesh and blood.

Psychological effect ని contrast ద్వారా పరస్పర విరుద్ధములైన భావాలను ఒకదాని ప్రక్క మరొకదాన్ని చిత్రించడం ద్వారా సాధించినాడు. ఇందుకు ఉదాహరణగా రెండు శిల్పాలను పేర్కొనవచ్చు. ఒకటి అళగిరి-దమనం. రెండు మారధర్షణ శిల్పాలు. ఈ శిల్పాలలోనే మరొక ముఖ్య విశేష లక్షణం గమనించవచ్చు. కథను సంక్షిప్తంగా- synoptic treatment - ఒకే శిల్పంలోని రెండు ఘట్టాల ద్వారా కథ పూర్తిగా కన్నులకు గట్టినట్లు చెప్పడం.

అమరావతీ శిల్పాలలోని స్త్రీ పురుషులు నగరవాసులు, సౌందర్యమూర్తులు, తాము సుందరులమనే ఆత్మవిశ్వాసం ఉన్నవారు. వారి ప్రతి భంగిమలోను పట్టణవాసంలోని సంస్కారం వెల్లివిరుస్తుంది. నగరజీవితంలోని సుఖాలపట్ల విలాసాల పట్ల ఆసక్తి స్పష్టంగా కన్పిస్తుంది. బార్హూత్ శిల్పం గ్రామీణ మని (Rural/pastoral) అమరావతీ శిల్పం నాగరీకమని (urban) విమర్శకులంటారు. అందుకు కారణాలు

దురూహ్యములుకాదు. ఈ శిల్పకేంద్రము మహానగరానికి సమీపంలో ఉంది. నగరజీవితం శిల్పికి నమూనా అయింది. రెండో కారణం శిల్పాన్ని పోషించినవారు వర్తక, హస్తకళాకార వర్గాలు ఐశ్వర్యంతో కలిగే సుఖాసక్తి భోగలాలసత్వం అమరావతీ శిల్పంలో ఉంది. భారతదేశ శిల్పం అంతటిలో అమరావతీ శిల్పం most voluptuous అంటాడు నీహర రంజన్‌రాయ్. అతని మాటల్లో "The Amaravathi sculpture breathes more of the spirit of gatha -saptasati than of the discipline of Vinaya." అయితే ఒక విషయం గమనించాలి. గౌతమ బుద్ధుడు బోధించింది మధ్యమార్గము కఠోర నియమాల ద్వారా శరీరాన్ని హింసించడం (Self malification) గాని విశృంఖల విలాస ప్రియత్వం (Too – much self indulgence) గాని కూడదన్నాడు. గృహస్థులను ప్రాపంచిక సుఖాలు వీడమని బోధించలేదు. అతడు సాధ్యాసాధ్యాలను దర్శించిన హేతువాది. మానవ జీవితాన్ని సుఖమయం చేయాలని తాపత్రయ పడిన మానవతావాది ఆ ధోరణిలోనే శిల్పి లౌకిక సుఖాలకు ఆధ్యాత్మిక శాంతికి సమతూకం సాధించడానికి ప్రయత్నించాడు.

అమరావతీ ప్రభావం అనంతర దాక్షిణాత్యవాస్తు శిల్పాలు -1. సింహద్వారం 2. మకరతోరణం 3. వృత్తాశ్రయ, ఆయితాశ్రయ నిర్మాణాలకు నమూనాలు - కూడు, పంజర, శాల మొదలైన అలంకార విశేషాల - పైనే గాక, దేశాంతరాల - సింహళం, మలయా, ఇండోచైనా, ఇండోనేషియా మున్నగు దేశాలపై కూడా ప్రసరించింది. ఇండోచైనాలో అమరావతి, విజయపురి రాష్ట్రాలు ఉన్నాయి.

ఇంతటి చైతన్యం, సృజనాత్మక సామర్థ్యం తరువాతి యుగాలలో ఏమయ్యాయి? సామాజిక శాస్త్రంలో, మతాల్లో, చరిత్రలో పరిశోధకులీ ప్రశ్నకు సమాధానం అన్వేషించాలి.



# 4. బౌద్ధమతం బోధించిన సమతాధర్మము

బౌద్ధం వాస్తవానికి ఒక మతరగా అవతరించినది కాదు. ప్రాయికంగా బౌద్ధం ఒక దర్శనం. బ్రాహ్మణ వాఙ్మయంలో సయితం 'బౌద్ధదర్శన' మనేవ్యవహారం తరచు కన్పిస్తుంది. 'శాస్త్రాలకు శాస్త్రం' అని దర్శనానికి నిర్వచనం. ఉపలభ్యమవుతున్న సమస్త విజ్ఞానాన్ని క్రోడీకరించి సమన్వయం చేయగా నేర్పడిన సిద్ధాంతమే దర్శనం. సమకాలీక సమస్యలకు సమాధానాలు సూచిస్తూ వ్యక్తి జీవితానికి మార్గదర్శినిగా ప్రగతి శీలమైన నవసమాజ నిర్మాణ ప్రణాళికగా ఉపకరించటమే దర్శనానికి ప్రయోజనం. కాబట్టి దర్శనలక్ష్యం ఐహికమేగాని పారలౌకికం కాదు అనడం సమంజసం

బౌద్ధం అవతరించిన కాలంలో- క్రీ.పూ. ఆరోశతాబ్దంలో - సాంఘిక ఆర్థిక ఆధ్యాత్మిక రంగాల్లో అరాచకం ప్రబలి భారతదేశం క్లిష్ట పరిస్థితుల నెదుర్కొంటున్నది. సాంఘికంగా వివిధ స్థాయిల్లో సంఘర్షణ పెచ్చు పెరిగిపోయింది. వైదిక యుగంలో మొదలైన ఆర్య ఆనార్య జాతుల మధ్యవైరం సమసిపోలేదు. ఆర్యేతరులను దాసదస్యులని వైదిక వాఙ్మయం వ్యవహరించింది. ఆర్యదాసదస్య పదాల్లోనే ఆర్యులు ఉత్తములని ఆర్యేతరులు అధములని అర్థం స్పష్టంగా ఉంది. ధర్మశాస్త్రాల్లోని "వైదేహికాదంధ్రమేదే బహిర్గ్రామ ప్రతిశ్రయై:" అనే ఆవేశాలు ఆర్యజాతి అహంకారానికి నిదర్శనలు. ఇట్టి అహంకారాన్నీ ఆర్యుల ఆచారవ్యవహారాలని అనార్యులు ప్రతిఘటించిన సందర్భాలు వైదిక వాఙ్మయంలో తరచుగా కన్పిస్తాయి. ఈ ప్రతిఘటనలో పరాజితులై నిస్సహాయులైన దాసదస్యులు పంచములుగా గ్రామ బహి: ప్రదేశాల్లో నివసిస్తూ నీచవృత్తుల నవలంబిస్తుండేవారు. వీరిపట్ల అగ్రవర్ణాల క్రూరప్రవర్తన మతంగ, కూటదంత మొదలైన జాతక కథలనుండి తెలుస్తుంది.

సవర్ణజుల్లో అగ్రవర్ణాలైన బ్రాహ్మణులు క్షత్రియులు ఒక వర్గం, వైశ్యులు శూద్రులు మరొక వర్గం - హీనవర్గం. ఈ వర్ణవ్యత్యాసాలు సహజంగా వైషమ్యాలకు కారణమైనాయి. దీనికి తోడు యజ్ఞాల పేర బ్రాహ్మణులు పన్నులరూపంలో క్షత్రియులు, వైశ్య శూద్ర వర్ణాల సంపదను హరించడంతో ఉభయవర్గాల మధ్య సుహృద్భావం మృగ్యమై ద్వేషం పెరిగింది. తిరిగి అగ్రవర్ణాల్లో బ్రాహ్మణులకు క్షత్రియులకు మధ్య అంటే మతాధికారానికి, రాజకీయాధికారానికీ మధ్య సంఘర్షణ వైదికయుగంలోనే ప్రారంభమైనట్లు కనిపిస్తుంది. వశిష్టవిశ్వామిత్ర, జమదగ్ని కార్తవీర్యులగాథలీ సంఘర్షణలోని కొన్ని ఘట్టాలను సూచిస్తాయి. కురు పాండవ యుద్ధం సయితం బ్రాహ్మణ పక్షపాతులైన కౌరవులకు తద్వ్యతిరేకులైన పాండవులకు మధ్య జరిగిన పోరాటంగా వ్యాఖ్యానిస్తారు. వాస్తవానికి పాండవ పక్షం వహించిన వాసుదేవ కృష్ణుడు బ్రాహ్మణ మతాన్ని వ్యతిరేకించిన క్షత్రియ వీరుడే !

నాటి సాంఘిక సమస్యలను ఆర్థిక పరిణామాలు క్లిష్టతరం చేసినాయి. క్రీ.పూ. ఏడు ఆరు శతాబ్దాల్లో కాంస్యయుగం నుండి అయోయుగానికి దేశం పరివర్తన చెందడంతోవ్యవసాయమూ పరిశ్రమలు, వాణిజ్యమూ వికసించాయి. విస్తరిస్తున్న భిన్న ఆర్థిక కార్యక్రమాల్లో ఆర్యేతర ప్రజల సహాయ సహకారాలు అవసరమైనాయి. అందుచేత బౌద్ధ వాఙ్మయంలో కన్పించే గహపతి, కమర, సెట్టి వర్గాలలో ఆర్యేతరులు అధిక సంఖ్యలో ప్రవేశించడం జరిగింది. వైదిక యుగంలో ఆర్యగణాలలో నిగూఢమైన రక్తసంబంధ భావన సమైక్యానికి సాధనమైంది. కానీ మారిన పరిస్థితులలో ఆర్యేతరులను సమాజంలో లీనం చేయడానికి రక్తసంబంధ భావన ఉపకరించదు. అందుచేత గణ పరిధులను అతిక్రమించిన విస్తృత మానవతా సంబంధమైన కొత్తభావన అవసరమయింది.

ఈ సమస్యల ఫలితంగా నేర్పడిన ఆందోళనయే గౌతమ బుద్ధుని జీవిత కార్యక్రమానికి నేపథ్యం అయింది. నాటి సాంఘిక సమస్యలకు పరిష్కారంగా జాత్యహంకారాలు, వర్ణవ్యత్యాసాలు లేక సమతా ధర్మంపై నాధారపడిన శాంతియుత సహజీవనం సాగించగల సామాజిక వ్యవస్థను సూచిస్తూ, అట్టి ఆదర్శ సమాజాన్ని స్వయంకృషితో సాధించగల శక్తి సామర్థ్యాలు మానవునకు ఉన్నవనే ఆత్మవిశ్వాసాన్ని బుద్ధుడు కలిగించాడు. అదే

దర్శనకారుడుగా బుద్ధునిలోని వైశిష్ట్యం; అతడు బోధించిన బుద్ధధర్మంలోనిప్రత్యేకత! బుద్ధుడు సంఘసంస్కారాన్ని ప్రబోధించలేదు అనేది వివేచనతో కూడిన విమర్శకాదు.

సమకాలిక వైదిక సమాజానికి ఆధారమైన వర్ణవ్యవస్థలో ఆర్యజాతి అహంకారం ప్రతిఫలిస్తుంది. వైదిక యుగానికి పూర్వమే దేశంలో అమలులో ఉన్న వృత్తి విభజనకు జాతి పరమైన వర్ణభావాన్ని జతపరచి ఆర్యులు వర్ణవ్యవస్థను రూపొందించారు. వీరిలో అగ్రవర్ణాల వారు 'దేవబంధువులు' వారిలో బ్రాహ్మణులు భూదేవులు! అందుచే వారికి ప్రత్యేక హక్కులుండేవి. వర్ణభావనకు జన్మహక్కులు జోడించి వ్యత్యాసాలతో కూడిన ఈ వ్యవస్థ దైవనిర్ణయంగా ప్రచారంచేయడంతో బుద్ధుని కాలానికే పరివర్తనారహితమై సంఘర్షణాత్మకంగా బ్రాహ్మణ సమాజం రూపొందింది.

గౌతమ బుద్ధుడే సామాజిక వ్యవస్థను, దానికి పునాదులైన సిద్ధాంతాలను తీవ్రంగా విమర్శించి తిరస్కరించాడు. జాతి వర్ణవిభేదాలను గురించిన చర్చలు విమర్శలు 'బుద్ధవచనం'గా ప్రసిద్ధమైన నికాయాది ప్రాచీన బౌద్ధవాఙ్మయంలోను, అశ్వఘోషాది తాత్త్వికుల రచనల్లోను కన్పిస్తాయి.

తన 'వజ్రసూచి'లో అశ్వఘోషుడు వర్ణాల ఉత్పత్తిని గురించి 'పురుష సూక్తం'లోని గాథను పరిహసిస్తూ ఒకే తల్లితండ్రులకు భిన్న జాతుల వారు జన్మించడం సాధ్యమా? పనస చెట్టు కొమ్మల చివర కాసేకాయలకు, మూలంలో కాసే కాయలకూ గుణంలో వ్యత్యాసం ఉండడం సంభవమా? మొదటివి బ్రాహ్మణకాయలు, చివరివి శూద్రకాయలూ అవుతవా? అని ప్రశ్నిస్తాడు.

సమకాలిక బ్రాహ్మణ కుటుంబాల చరిత్రల ఆధారంగా వారి జన్మ పవిత్రతను అంబట్ట సూత్రంలో బుద్ధుడు అవహేళన చేస్తాడు. బుద్ధుని విశ్లేషణ ప్రకారం సమాజంలో రెండే రెండు వర్ణాలున్నాయి. ఒకటి ప్రభువర్ణం. రెండోది పాలిత వర్ణం. అయితే వీరికి జన్మహక్కులు లేవు. పరిస్థితుల ప్రభావం వల్ల ప్రభువులు- పాలితులు; పాలితులు- ప్రభువులు కావచ్చును. కాబట్టి పరివర్తన సమాజానికి సహజం అని మజ్ఝిమనికాయలో బుద్ధుడు వివరిస్తాడు. ధనికులైన శూద్రులు బ్రాహ్మణ క్షత్రియులను సేవకులుగా నియమించుకొన్న వృత్తాంతాలు బుద్ధుని కాలంలో అనేకం కనిపిస్తాయి. మజ్ఝిమనికాయలోనే కోసలాధీశుడైన ప్రసేనజిత్తు ప్రశ్నలకు సమాధానమిస్తూ భిన్న

జాతులకు చెందిన వంట చెఱకునుండి లభించే వేడిలో భేదం ఉండనట్లే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య- శూద్ర వర్ణాలు సాధన ద్వారా పొందే నిర్వాణ స్వభావంలో వ్యత్యాసాలు ఉండవని బుద్ధుడు వివరిస్తాడు. మానవుడు శారీరక మానసిక రుగ్మతలకు గురి అవుతాడు. జాతి, వర్ణలేక గోత్ర దురభిమానం తీవ్రమైన మానసిక జాడ్యం వ్యక్తి వికాసానికి లోక కల్యాణానికి ఆ రుగ్మతను పూర్తిగా తొలగించటం జరూరు కర్తవ్యమని అంగుత్తరనికాయలో బుద్ధుడు బోధిస్తాడు ధమ్మపదలో

*నజటాహి! నగోత్తేన!*
*నజచ్చాహోతి! బ్రాహ్మణో!*
*యమ్హి! సచ్చుశ్చ! ధమ్మేచ!*
*సో! సుచీచ! బ్రాహ్మణో!*

జడలు ధరించినంత మాత్రం చేత బ్రాహ్మణుడు కాడు. గోత్రాన్ని బట్టిగానీ, జన్మచేతగానీ బ్రాహ్మణుడనబడడు. సత్యంతో ధర్మంతో సుచియైనవాడే బ్రాహ్మణుడు అని అంటాడు. ఈ విధంగా వర్ణ వ్యవస్థలోని వ్యత్యాసాలకు మూలమైన జన్మహక్కుల సిద్ధాంతాన్ని తిరస్కరించి వ్యక్తి సౌశీల్యానికి బుద్ధుడు ప్రాధాన్యం ఇస్తాడు. శీలవంతులైన వ్యక్తులే ఆదర్శప్రాయమైన సమాజానికి మూలం!

'అమరకోశం' బుద్ధుని అద్వయవాదిగా వర్ణిస్తున్నది. తాత్త్వికపరంగా బౌద్ధం అద్వయవాదం. ఈ వాదం ప్రకారం ప్రాణికోటికి జీవం ప్రధాన లక్షణం. జీవం అద్వయం; అవిభాజ్యం. అందుచేతనే జీవుల సుఖదు:ఖాలకు వ్యక్తి హృదయం స్పందిస్తుంది. మైత్రి, కరుణ, ముదిత మొదలైన భావాలు ఉత్పన్నమవుతాయి. అయితే వృక్షాల్లోను, పశుపక్ష్యాదులలోను, భిన్న జాతులున్నాయి. కానీ మానవ జాతి ఏకైకము. శరీర వర్ణము, కేశస్వభావం నాసికా స్వరూపము వంటి నామమాత్రమైన బాహ్యలక్షణాలను బట్టి మానవజాతిని ఉత్తమ జాతులు అధమజాతులు అని వర్గీకరించటం శాస్త్రీయం కాదు అని 'సుత్తనిపాత'లో వశిష్ట భరద్వాజుల మధ్య జరిగిన చర్చలో బుద్ధుడు హెచ్చరిస్తాడు. జీవ ఐక్యాన్ని గుర్తించడం వల్ల పరాత్మ సమత సిద్ధిస్తుంది. ద్వేషరహితము, ప్రేమపూరితమునైన సమాజం ఏర్పడుతుంది.

తాను ఊహించిన సాంఘిక సమ సమాజానికి నమూనాగా బుద్ధుడు బౌద్ధ సంఘాన్ని

నిర్మించాడు. అందులో సభ్యత్వానికి జాతి వర్ణ వివక్షలు లేవు. నేరస్తులు, వ్యాధిగ్రస్తులు మినహా అందరికీ అందులో ప్రవేశార్హత ఉంది. కొండణ్ణ మొదలైన పంచవర్గీయులు బ్రాహ్మణులు, అనాథ పిండకుడు శ్రేష్ఠి, ఉపాలి మంగలి; ప్రథమ సంగీతిలో వినయపిటకాన్ని ఉపాలి సంకలనం చేశాడు, ఆమ్రపాలి వేశ్య; జీవకుడు వేశ్యాపుత్రుడు. ధీరగాథల్లో కన్పించే పున్నా, పున్నికా బానిసకన్యలు. ధీరగాథల్లోని సునిత వీధులూడ్చే కడజాతివాడు. అంగుళిమాలుడు పరమ కిరాతకుడైన దారిదోపిడి దొంగ. వీరందరికీ బౌద్ధ సంఘంలో సమానమైన స్థానం ఉంది. సముద్రాన్ని చేరిన నదులు తమ వ్యక్తిత్వాన్ని కోల్పోయినట్లే బౌద్ధంలో చేరిన వీరు తమ గత చరిత్రను కోల్పోయి కేవలం మానవులుగా మిగులుతారు.

బౌద్ధ ధర్మ ప్రభావం సుమారు ఆరు శతాబ్దాల కాలం దేశ ప్రజలపై ప్రభుత్వాలపై స్పష్టంగా కన్పిస్తుంది. ఇంచుమించు భారతదేశాన్ని సమైక్యం చేసి తన ప్రభుత్వానికి ధర్మాన్ని గీటురాయిగా చేసిన అశోకమౌర్యుడు దండ సమత వ్యవహార సమతా నెలకొల్పడాన్ని అంతే న్యాయం దృష్టిలో శిక్షాస్మృతి దృష్టిలో అందరూ సమానులేననే విధానాన్ని ప్రవేశపెట్టిన్లు, అతని శాసనాలు చాటుతున్నాయి.

బౌద్ధయుగంలో వర్ణవ్యవస్థ చిట్టెం గట్టిన సూచనలు లేవు. పరివర్తనకనువైన మార్దవం సమాజానికి ఉండేది. 1. బ్రాహ్మణులు సమాజంలో ప్రముఖ స్థానం వహించిన సూచనలు కన్పించవు. ప్రజలు తమ తమ కులాల పట్ల శ్రద్ధాసక్తులు ప్రదర్శించిన వారు కాదు. నాటి దాన శాసనాల్లో దాతలు తమ తమ వృత్తులను మాత్రమే గాని వర్ణాలను ప్రస్తావించినట్లు కన్పించదు. క్రీస్తు శకం ఒకటి రెండు శతాబ్దాలకు చెందిన ఒక ధాన్యకటక శాసనం ప్రకారం విధికుడనే చర్మకారుడు - అంటే కడజాతి వ్యక్తి అచటి బౌద్ధ క్షేత్రాన్ని సకుటుంబంగా దర్శించి మహాచైత్యానికి పూర్ణఘట శిల్పఫలకాన్ని దానం చేశాడు. బౌద్ధం ప్రబోధించిన ఆచరించిన సమతా ధర్మానికి ఇంతకు మించిన నిదర్శనం అక్కరలేదు. అందుచేత:

బుద్ధం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి

---

ఆకాశవాణి విజయవాడ కేంద్ర సౌజన్యంతో

# 5. బౌద్ధయుగ వాస్తువు

భారతీయ వాస్తు చరిత్రలో హరప్పాయుగం తరువాత గణనీయమైనది బౌద్ధయుగం. వైదికయుగంలోని నిర్మాణాలు దారు పటల నిర్మాణాలై నశించినందున వాని స్వరూప స్వభావాలు తెలియవు. క్రీస్తు పూర్వం మూడు నాలుగు శతాబ్దాలలో బౌద్ధులు తమ ధర్మ ప్రచారానికి కళను పరిచారికగా చేయడంతో వాస్తు చరిత్రలో ఒక కొత్త అధ్యాయం ప్రారంభమయింది. మానవ కల్యాణార్థమై ధర్మప్రచారక చక్రవర్తిగా మారిన అశోక మౌర్యుడే బౌద్ధశిల్పానికి తద్వారా చారిత్రకంగా భారతీయ శిల్పానికి శ్రీకారం చుట్టినాడు. అది మొదలు ఒకవేయి సంవత్సరాలు బౌద్ధం భారతీయ కళారంగంలో సువర్ణ యుగాన్ని సృష్టించింది.

శాశ్వతమైన నిర్మాణమే లక్ష్యమైన బౌద్ధులు తమ కళాసృష్టికి సైతం శాశ్వతత్వం చేకూర్చే ఆశయంతో దారువును విసర్జించి గండశిలను స్వీకరించినారు. ప్రాచీన కాలంలో ఈజిప్ట్, గ్రీస్, రోమ్ దేశ ప్రజలు శిలావాస్తువులు నిర్మించినారు. కాని స్వతంత్రము పరిపుష్టమునైన భావనాశక్తిలోను, సృజనా వైవిధ్యంలోను నిర్మాణ కౌశల్యంలోను భారతీయ బౌద్ధులకు మరెవ్వరూ సరితూగలేరని పాశ్చాత్య విమర్శకులు సైతం అంగీకరించిన విషయమే. శీల, సమాధి, ప్రజ్ఞలతో పరిపక్వమైన బౌద్ధుల స్వరూప గాంభీర్యానికి అంతస్సౌందర్యానికీ ప్రతినిధులుగా నిలిచినాయి వారి వాస్తు శిల్ప కళాఖండాలు.

బౌద్ధుల నిర్మాణాలను స్తూపములు, చైత్య గృహాలు, విహారములు అని వర్గీకరించవచ్చు. తిరిగి ఈ త్రివిధ నిర్మాణాలలో కొండల్లో తొలిచినవి ఇటుకలతో నిర్మించినవి అని రెండు రకాలు. ఈ ఉభయ నిర్మాణాలలోను ముఖ్యంగా నాటి గుహాస్తూపములలో శిల్పులు ప్రదర్శించిన ప్రతిభా విశేషాలు అసాధారణమైనవి. కొయ్య నమూనాను

ముందుంచుకొని పర్వత సానువుపై నుండి అదోముఖముగా గుహలను తొలిచే వారు. ఈ కార్యక్రమంలో నాటి విశ్వకర్మల ఏకాగ్రత వారి పనిముట్ల నైశిత్యము చాల ప్రశస్తములు. ఇక ఇటుకలతో లాదులు లాగడంలోను అర్ధవృత్త ద్వారాలను నిర్మించడంలోను నాటి తాపీ పనివారు సిద్ధహస్తులనిపించుకొన్నారు. నాటి ఇటుకలు సైతం పెద్దవి. భట్టిప్రోలు స్తూపంలో వాడిన ఇటుకల కొలతలు 14×8×4 అంగుళాలు. శంఖాకృతి ఇటుకలు, మూలల ఇటుకలు మొదలైన రకాలు ఉండేవి. గుహ నిర్మాణాలు మహారాష్ట్రంలో ఎక్కువ. ఇతర ప్రాంతాల్లో ఇటుకల నిర్మాణాలే ఎక్కువగా కన్పిస్తాయి.

స్తూపములు: మహా చైత్యము దానిని పరివేష్టించిన చిన్న స్తూపములు బౌద్ధక్షేత్రాలలో ఆరాధ్యవస్తువులు. చితినుండి చైత్యము, స్తుప్ నుండి స్తూపము వచ్చినాయి. స్తుప్ అనగా పోగుచేయు అని అర్థము. ఈ మాటల వల్ల స్తూప చైత్యాలు శారీరక అవశేషాలపై నేర్పడిన కట్టడాలు అని తెలుస్తున్నది. అదేకారణంగా వీనిని ధాతుగర్భాలు అనే వారు. ఈ పదమే బర్మా, సింహళాలలో 'డాగోబా' అయింది. శారీరక స్తూపములేగాక పారిభోజక, ఉద్దేశిక స్తూపాలను గూడ నిర్మించే వారు. బౌద్ధాచార్యులు ఉపయోగించిన వస్తువులపై నిర్మించినవి పారిభోజకములు. కేవలం స్మృతి చిహ్నాలుగా నిర్మించినవి ఉద్దేశిక స్తూపములు.

బుద్ధ ధాతువులపై అశోక మౌర్యుడు ఎనభై నాల్గువేల స్తూపాలను నిర్మించినట్లు ప్రతీతి. వీనిలో సుప్రసిద్ధములైన సాంచీ, సారనాథ్, బార్హుత్, భట్టిప్రోలు, అమరావతీ స్తూపాలు ఉండి యుండవచ్చు. స్థూపాన్ని గుండ్రని వేదిక మీద నిర్మించే వారు. వేదికలోపల ధర్మ చక్రాకృతిలోగానీ. స్వస్తిక రూపంలోగానీ గోడలు కట్టి వాని మధ్య ఖాళీస్థలంలో మట్టి కంకరపోసి దిమ్మెస చేసేవారు. వేదికపైన ఎత్తయిన అండం ఉండేది. ఇది బోర్లించిన భేరీవలె ఉంటుంది. అండంపైన హర్మిక, హర్మికలో ఒకటి గానీ అంతకు మించి గానీ ఛత్రములుండేవి. హర్మికలోనే ధాతువును నిక్షేపం చేసేవారు. స్తూపాన్ని పరివేష్టించి శ్రీవీధి అనే ప్రదక్షిణ పథము దాని చుట్టూ ప్రాకారము ప్రాకారంలో నాల్గు దిక్కులా నాల్గు ద్వారాలు ఉంటాయి. ఒక అధిష్ఠానం మీద స్తంభాలు నిలిపి మూడు వరుసల అడ్డ కమ్మీలతో వానిపైన మదురు వంటి ఉష్ణీషంతో ప్రాకారాన్ని అమర్చేవారు.

సాంచీ స్తూపానికి వేదిక మీద మరొక ప్రాకారము వేదికను చేరడానికి సోపాన పంక్తి ఉన్నాయి. ప్రాకార శిలపై కమలము, పూర్ణకలశము, బౌద్ధ జాతక కథలూ మనోహరంగా చెక్కేవారు.

ఉత్తరదేశ స్తూపాలకు ఆంధ్ర స్తూపాలకు కొన్ని అంశాలలో వ్యత్యాసం కన్పిస్తుంది. సాంచీ స్తూప ద్వారములు నాలుగూ శిలాతోరణాలతో నేర్పడినవే. వీనిపైనున్న శిల్ప సంపద చాల అద్భుతమైనది. ఆంధ్ర స్తూపాలలో తోరణాలు అరుదు. కాని ద్వార స్తంభముల మీద సింహము అధిష్టించి ఉంటాయి. 'సింహద్వారము' అనే మాటకు ఈ సంప్రదాయమే కారణమై ఉంటుంది. సింహద్వారముల కెదురుగా స్తూపవేదిక నంటియుండిన దిమ్మెపై బుద్ధుని జీవితములోని పంచ కల్యాణములను సూచించు ఐదేసి ఆయక స్తంభములను నెలకొల్పే వారు. ఆయక వేదికలు, ఆయక స్తంభములు ఆంధ్ర స్తూపములలోని ప్రత్యేక విశిష్ట లక్షణము.

స్తూపముల ప్రమాణంలో సైతము చాల వ్యత్యాసములున్నాయి. గోలిస్తూపము ఎత్తు ఎన్మిది అడుగులు మాత్రమే. సారనాత్‌లోని ధర్మరాజ స్తూపము నూరడుగుల ఎత్తున్న కట్టడము. భారతదేశ స్తూపములన్నింటిలోనూ పెద్దది అమరావతీ స్తూపము. ఆరువందల అడుగుల ప్రాకారంతో 138 అడుగుల వ్యాసంపై నూరడుగుల ఎత్తునకు నిర్మింపబడి అపార శిల్ప సంపదతో విరాజిల్లిన అమరావతీ స్తూపం బౌద్ధ ధర్మ మహోన్నతికి తార్కాణమై దేశ దేశాంతర తైర్థిక హృదయాలలో చెరగని ముద్ర వేసింది.

ఏకశిలా స్తూపాలు చాలా వరకు ఉద్దేశిక స్తూపాలే. ఇట్టివి భాజా, సంఘరములలో ఉన్నాయి. సంఘరంలో ఒక కొండను ఉద్దేశిక స్తూపాలుగా మలచివేసినారు. ఇదే జావాలోని బొరొబుదురుకు నమూనా అయిన లింగాలమెట్ట!

చైత్య గృహాలు: బౌద్ధుల పూజామందిరాలే చైత్య గృహాలు. వీనిలోని పూజా వస్తువ చైత్యమైనందున వీనికా పేరు వచ్చింది. వీనిలో కూడ కొండల్లో తొలిచినవి, ఇటుకలతో కట్టినవి రెండు రకాలు ఉన్నాయి.

మొట్టమొదటి ఇటుకల చైత్యగృహం, అశోకుని కాలం నాటిది, రాజస్థాన్‌లో బైరాట్ చెంత బయల్పడింది. ఇటుకల చైత్యగృహాలు ఆంధ్రదేశంలో పలుచోట్ల బయల్పడినాయి. కాని వాస్తు వైశిష్ట్యం ఉన్న కళాఖండాలుగా ప్రసిద్ధి చెందినవి గుహాలయాలే. వీనిలో చాలా భాగం మహారాష్ట్రలోనే ఉన్నాయి.

బుద్ధగయ చెంత బరాబర్ కొండల్లో అశోకుడు తొలిపించిన సుదామ లోమశఋషి గుహాలే మన దేశంలో మొదటి గుహలు. అదే కాలానికి చెందినవి గుంటుపల్లి గుహాలయాలు. క్రమంగా గుహాలయ వాస్తువు భాజా, బేడ్స, జన్నార్, పితల్‌కోరా, కన్‌హేరీ, కార్లాలలో వికసించి అజంతా ఎల్లోరాలలో పరిణతి పొందింది. గుహాలయాలన్నింటిలో తలమానికం వంటిది కార్లా చైత్యాలయం.

చైత్య గృహంలో మూడు భాగాలుంటాయి. మొదటిది ద్వారప్రవేష్టం; దాని వెనుక అంతరాళం వంటి దేహళి; ఆ తరువాత చైత్యాలయం. సాధారణంగా చైత్యగృహం దీర్ఘగోళాకృతిలో ఉంటుంది. పైకప్పు గూడువలె ఉండి కమ్ములు గలిగి ఉంటుంది. కొన్ని చోట్ల కప్పులో కొయ్యపలకలను అమర్చేవారు.

చైత్యగృహం నిడివిని స్తంభ పంక్తి మూడు విభాగాలుగా చేస్తుంది. మధ్యభాగము గర్భాలయ విభాగము; ఇరువైపుల స్తంభముల కావల వసారావంటి ప్రదక్షిణ పథము. కార్లా చైత్యాలయంలో ఈ స్తంభాలు మూలంలో కలశంతో శీర్షమున గజములు సింహములతో సర్వాంగ సుందరంగా ఆలయానికి ప్రత్యేక శోభను చేకూరుస్తున్నాయి దేహళి నుండి గర్భాలయంలోనికి మూడు ద్వారాలున్నాయి. మధ్య ద్వారము గర్భగుడిలోనికి పార్శ్వద్వారములు ప్రదక్షిణపథంలోకి దారితీస్తాయి. చైత్యాలయం మధ్యలో ఏకశిల నిర్మితమైన చైత్యం ప్రత్యేకంగా నిలిచి ఉంటుంది.

హీనయాన చైత్యాలు నిరాడంబరాలు. అయినప్పటికీ స్తూపంలో వేదిక, ప్రాకారము అండము, హర్మిక కన్పించేటట్లు మలచి హర్మికలో దారు ఛత్రాన్ని అమర్చేవారు మహాయానులు స్తూపముఖంలో బుద్ధుని ప్రతిమను రచించేవారు. అజంతాలో మహాయాన

గుహ లెక్కువ ఉన్నాయి.

చైత్యగృహంలో మిక్కిలి ఆకర్షణీయమైనది గుహ ముఖం. అందులోనూ ద్వారానికి పైభాగంలో గుర్రపునాడా లాగా ఉండే చైత్యవాతాయనం, చైత్యాలయంలోనికి గాలీ వెల్తురు ప్రసరించడానికిది చక్కగా ఏర్పాటు. వాతాయన ద్వారం మీద పడగవంటి చూరు ఉండటంచేత వానగానీ సూర్యరశ్మిగానీ లోపల ప్రవేశించదు. ఈ వాతాయనం అనేక పరిణామాలు పొంది 'కూడ' అనే ఆకారంలో హిందూ దేవాలయాలపై అలంకారంగా ప్రత్యక్షమయింది. కార్లా గుహాలయానికి ఎదురుగా రెండు సింహ స్తంభాలు మలచబడినాయి. నేటి ధ్వజస్తంభానికి మాతృకలై యుండవచ్చును.

విహారములు: విహారములు బౌద్ధ భిక్షువుల వర్షాకాల నివాసాలు. సాధారణంగా వీనిని మహానగరాలకు అనతి దూరంలోను శాశ్వతమైన నీటి వనరులకు సమీపంలోనూ నిర్మించే వారు. బుద్ధుని కాలంలో వర్షావాసాలు ఆరామాల మధ్య ఉండేవి. నాటి జేతవన, వేలువన విహారాలు చాల ప్రసిద్ధములు. క్రమంగా పర్వతాల మీదకు నదీ తీరాలలోను విహారాలు నిర్మించడం ప్రారంభమయింది. ఒకే ప్రాకారంలో పెక్కు నిర్మించడం ప్రారంభమయింది. ఒకే ప్రాకారంలో పెక్కు విహారాలున్నప్పుడు మహావిహారం అనేవారు. అమరావతి, శ్రీపర్వతం, నాలందాలలోనివి మహా విహారాలు. మహారాష్ట్రంలో నాసిక్, కన్హేరి, కార్లా అజంతా, ఎల్లోరాలలోనూ ఆంధ్రదేశంలో గుంటుపల్లి సంఘరములలోను గుహావిహారాలున్నాయి. వీనిలో హీనయాన విహారాలు చాల నిరాడంబరాలు. మధ్య విశాల ప్రాంగణమూ - దానికి మూడువైపులా భిక్షువుల నివాసములతో, ఆ విహారాలు హరప్పా ఇండ్లను గుర్తుకు తెస్తాయి. గదుల గోడలలోనే సెజ్జలు, తలగడలు, నీటికుండ్లు అమర్చేవారు. మహాయాన విహారాలలో మధ్య ప్రాంగణం స్తంభ మంటపంగా మారిపోయింది. రెండు మూడు అంతస్తుల విహారాలు కూడా ఉన్నాయి. ఎల్లోరాలోని దోతల్ తీన్‌తల్ విహారాలు చాల పెద్దవి.

ఇటుకల నిర్మాణాలైన విహారాలు దేశంలో అనేక ప్రాంతాల్లో బయల్పడినాయి. విహార నిర్మాణంలో సైతము ఉత్తర దక్షిణ దేశాల మధ్య భిన్నత్వం కన్పిస్తుంది. ఉత్తరాపథ

విహారాలలో స్తూపానికి దక్షిణంగా భిక్షు నివాసాలూ ఆ రెంటికీ మధ్య ఉద్దేశిక స్తూపాలూ, భిక్షు నివాసాలకు పశ్చిమంగా సభా మంటపమూ ఉండేవి. ఆంధ్రదేశ విహారాలలో ఒక మహాచైత్యము దానికి ముందు ఇరువైపులా చైత్యాలయాలు వీని ముందు స్తంభమంటపము లేదా చతుశ్శాల వీనికి మూడు వైపులా భిక్షకుల గదులు ఉండేవి. గదులకు ముందు వరండా, ప్రతిగదికి ముందు సోపానాలు చంద్రశిల అమర్చే వారు.

రమణీయమైన ప్రశాంతమైన ప్రకృతి ఒడిలోని ఈ విహారాలలో నివసిస్తూ ప్రపంచాన్ని శివంకరం చేసే సత్యాన్వేషణలో బౌద్ధులు సాధించిన ప్రతి అంశము సుందరతరమై భావి తరాలకు వెలుగుబాటలు దిద్దింది. వారి నిర్మాణాలే మధ్యయుగ హిందూ వాస్తువుకు నమూనాలు కావడం అందుకొక నిదర్శనం. అంతటిలోకోత్తర కళాప్రపంచాన్ని సృష్టించిన బౌద్ధ స్తపతులకు జోహార్లు.



# 6. ఆంధ్రదేశంలోని ప్రసిద్ధ బౌద్ధక్షేత్రాలు

ఆంధ్రదేశంలో అసంఖ్యాకంగా బయల్పడిన బయల్పడుతూ ఉన్న బౌద్ధ నిర్మాణ శిథిలావశేషాలు బౌద్ధమత చరిత్రలో ఆంధ్రుల విశిష్ట స్థానానికి నిదర్శనాలు. బుద్ధుని జీవిత కాలంలోనే బౌద్ధానికి నీరాజనాలిచ్చి ఆదరించిన వారు ఆంధ్రులు. అశోకునకు పూర్వమే మహాచైత్యాలు నిర్మించి మహాయాన సిద్ధాంతానికి మూలమైన చైత్యక వాదాన్ని సృష్టించినారు. బౌద్ధ ధర్మంగూడ ఆంధ్ర జాతిని సమైక్యమొనర్చి వారిలోని కళాదృష్టికీ సృజనా సామర్థ్యానికి నిర్మాణ నైపుణ్యానికి తాత్త్విక జిజ్ఞాసకు అపారమైన అవకాశం కల్పించింది. సుప్రసిద్ధ దార్శనికులైన నాగార్జునాచార్య ఆర్యదేవ భావవివేకులకు నివాస భూమి అయింది. థేరవాదులకు మగధవలె మహాయాన బౌద్ధులకు ఆంధ్రదేశం పవిత్ర యాత్రాస్థలమయింది.

బౌద్ధ భిక్షువులు దేశసంచారం చేస్తూ ధర్మ ప్రచారం సాగించినారు. వర్షాకాలంలో మాత్రం విహార సంఘారామాల్లో స్థిరనివాసులై సిద్ధాంత చర్చలు జరిపేవారు. ఆరాధన నిమిత్తమై విహార సంఘారామాల్లో స్తూపాలు చైత్యాలయాలు నిర్మించుకున్నారు. స్తూపాల్లో ధాతుగర్భ, పారిభోజక, ఉద్దేశిక అనే మూడు రకాలున్నాయి. బుద్ధునివి గానీ ప్రముఖ ఆచార్యులవి గానీ అవశేషాలపై నిర్మించినవి ధాతుగర్భములు. భిక్షాపాత్రాది వస్తు గర్భితములు పారిభోజకములు. ధాతు రహితములైన స్మారక చిహ్నాలు ఉద్దేశిక స్తూపాలు. మహాపురుషుల అవశేషాలపై నిర్మితములైన స్తూపాలు పుణ్యక్షేత్రాలయి దూరభూముల నుండి సైతము భక్తులను ఆకర్షించడంలో ఆశ్చర్యం లేదు. క్రమంగా అట్టి స్తూపాలతో కూడిన విహారాలు తాత్త్విక సిద్ధాంత చర్చలకు, ధర్మనిర్ణయానికి కేంద్రాలుగా విద్యాకళా పీఠాలుగా ప్రజాసేవకు దీక్షా సదనాలుగా ప్రసిద్ధి చెందినాయి.

అసంఖ్యాక చైత్యవిహారాలతో మౌర్యయుగం నాటికే ఆంధ్రదేశం బౌద్ధ ధర్మానికి

పట్టుగొమ్మ అయింది. ఆంధ్ర తీర్థాలలో అధిక భాగం కృష్ణానదీ ముఖద్వారంలోనే వెలసినాయి. అందుకాప్రాంత భూములు ఐశ్వర్యవంతాలు కావడమేగాక స్థానిక నాగ యక్షజాతి ప్రజల ఆదరాభిమానాలు కూడ కారణం. ఆ ప్రాంతంలో రాజ్యం చేసిన సాతవాహన ఇక్ష్వాకు చక్రవర్తులు బ్రాహ్మణ మతోద్ధారకులైనప్పటికీ వారి మహారాణులు మాత్రం బౌద్ధ ధర్మాన్నే పోషించినారు. బౌద్ధయుగంలో కృష్ణాతీర వర్తకులు విదేశ వాణిజ్యం సాగించి ఐశ్వర్యవంతులయి తమ ధనాన్ని బౌద్ధ ధర్మ ప్రచారానికి వినియోగించినారు. ఆంధ్రదేశంలోని బౌద్ధ నిర్మాణాలలో అధిక భాగం వర్తకులు పాటకజనము సామాన్య ప్రజానీకము ప్రదర్శించిన ధర్మాసక్తి ఫలితమేననడంలో సందేహము లేదు. సర్వజనాదరణీయమై బౌద్ధం మహోజ్జ్వల ప్రజా ఉద్యమంగా వర్ధిల్లింది.

## భట్టిప్రోలు

ఆంధ్ర బౌద్ధ క్షేత్రాలన్నింటిలో బహుశా మిక్కిలి ప్రాచీనమైనది భట్టిప్రోలు. జైనుల ధర్మామృత కావ్యంలోని ప్రతీపాలపురమే భట్టిప్రోలని చరిత్రకారుల నిర్ణయం. ఐనచో నిది 'ఇక్ష్వాకుల నాటి' మహానగరం. క్రీస్తు పూర్వం మూడో శతాబ్దిలో ఇచట కుబేరుడనే రాజప్రముఖుడు 'నిగమసభ' సింహగోష్ఠిల సలహా సహకారాలతో రాజ్యపాలన సాగించినాడు. అతని పోషణలోనే ఇచట మహాచైతన్యాన్ని నిర్మించినారు. 'బుద్ధశరీరరాణి నిక్షేప్తుం', 'బుద్ధశరీరాణి మహానీయాని శర్మణే' అనే శాసన వాక్యాలవల్ల ఈ మహాచైతన్యం బుద్ధ ధాతువు మీదనే నిర్మాణమైన దనడంలో సందేహం లేదు. ఇంత పవిత్రమైనప్పటికీ చీన యుగంలోనే భట్టిప్రోలు బౌద్ధుల స్మృతిపథం నుండి చెరిగిపోయినట్లు కన్పిస్తుంది. ందుకు ఏదో ప్రబలమైన కారణం ఉండి యుండవలెను.

## గుంటుపల్లి

భట్టిప్రోలుకు సమాకాలీనమైనదే గుంటుపల్లి. ఇది పశ్చిగోదావరి జిల్లా కామవరపు కోటకు సమీపంలో ఉంది. ఇచట కొండమీద చైత్య గృహము, ఆరామ మంటపాలు, స్తూపాలు ఉన్నాయి. ఇందొక స్తూపంలో ధాతుకరండం దొరికింది. గుంటుపల్లి చైత్యాలయం

బుద్ధగయ చెంత అశోకుడు తొలిపించిన లోమశరుషి, సుదామ గుహలను బోలి చాలా ప్రాచీనమైనది. ఈ తీర్థం భక్తులను విశేషంగా ఆకర్షించేది అనడానికి ఇచట కన్పించే పెక్కు ఉద్దేశిక స్తూపాలే నిదర్శనము.

## అమరావతి

దక్షిణాపథ బౌద్ధ క్షేత్రాలన్నింటికీ తలమానికము అమరావతి. అమరావతిని బౌద్ధ సారస్వతము, శాసనాలు, ధాన్యకటకం అని వ్యవహరిస్తాయి. శాతవాహనులకు రాజధానిగా భావింపబడే ధాన్యకటక నగరంలో స్తూప ఆరామ శోభితమైన ప్రాంతం 'అమరావతి'గా వ్యవహరింపబడి క్రమంగా అమరావతిగా రూపాంతరం చెంది స్థిరపడిందని భావించవచ్చు.

*శ్రీ ధాన్యకటకచైత్యే*
*జినధాతుర్ధరేభువి*

అనే మంజుశ్రీ మూలకల్ప వాక్యము, అమరావతిలో దొరికిన మౌర్యలిపిలోని శాసనాలు ఆధారంగా అశోకుడు నిర్మించిన అసంఖ్యాక స్తూపాలలో ధాన్యకటక మహాచైత్యం ఒకటి అని కొందరి అభిప్రాయం. అశోకునకు పూర్వమే ఇచట స్తూపం ఉండి ఉంటుందని మరికొందరు భావిస్తున్నారు. తృతీయ సంగీతి అనంతరం మహిష మండలంలో బౌద్ధ ధర్మ ప్రచారార్థమై అశోకుడు పంపిన మహాదేవభిక్షు అమరావతినే కేంద్రంగా చేసికొని ప్రచారం సాగించి ఉండవచ్చు. క్రమంగా అమరావతి మహా సాంఘిక శాఖయైన చైత్యకవాదానికి ప్రధాన కేంద్రమయింది. చైత్యకవాదంలో పూర్వశైల, అపరశైల లేక అపర మహావినశైల, ఉత్తర శైలశాఖ లేర్పడినాయి. ఆర్య మంజుశ్రీ నివాసంగా "గండవ్యూహ" పేర్కొన్న చిత్రమాలా ధ్వజవ్యూహ విహారమే పూర్వశైలమని అది అమరావతేనని కొందరి అభిప్రాయము.

చైత్యకవాదమే మహాయన సిద్ధాంతానికి పునాది అయింది. మాధ్యమిక వాదంపై మహాయానాన్ని సుప్రతిష్టితం చేసిన బోధసత్త్వ నాగార్జునాచార్యుడు అమరావతీ స్తూపానికి శిలాప్రాకారాన్ని నిర్మించినాడు. మహాయాన దశలోనే ఆంధ్రదేశంలో బౌద్ధం మూడు పూవులు ఆరుకాయలుగ వర్ధిల్లింది. అమరావతి బౌద్ధవిజ్ఞానానికి పీఠమై ప్రపంచ ఖ్యాతి నార్జించింది. చైనా యాత్రికుడైన హుయాన్‌సాంగ్ తాను ధాన్యకటక విహారంలో అభిధమ్మ

పిటకాన్ని అభ్యసించినట్లు వ్రాసుకున్నాడు. ధాన్యకటక విద్యాపీఠం నమూనాగా టిబెట్ రాజధాని లాసాలో డాపంగ్ విశ్వవిద్యాలయం నిర్మించినారని దానిలో సుమారు ఎనిమిది వేల మంది విద్యాభ్యాసం చేసే వారని లామాతారానాథుడు వ్రాసిన దాన్ని బట్టి తెలుస్తుంది.

కళాక్షేత్రంగా అమరావతి ఆర్జించిన కీర్తి అజరామరం. ఆ మహాచైత్యం ఆంధ్రుల నిర్మాణ కౌశల్యానికి గీటురాయి. స్తూప ఉపరితలాన్ని అలంకరించిన పాలరాతి పలకలు శిలా ప్రాకారంలోని సూచీ పట్టములు, ఉష్ణీషము మనోజ్ఞ శిల్ప సంశోభితాలు. పశుపక్షిలతాదులను, స్త్రీపురుష మూర్తులను దర్శించడంలో అమరావతీ శిల్పి సాధించిన చైతన్యయుత సౌందర్య భావన ఆ భావనను శిలలో సాక్షాత్కరింప చేయడంలో అతడలవరుచుకొన్న సామర్థ్యము అద్వితీయములు. విశిష్ట లక్షణములతో అమరావతీ రీతిని సృష్టించి భారతీయ శిల్ప చరిత్రలో ఆంధ్రశిల్పి సుస్థిరమైన ఉన్నత స్థానాన్ని పొందగలిగినాడు. అమరావతీ శిల్పరీతియే ఆంధ్ర రీతియై పల్లవ చాళుక్యాది దాక్షిణాత్య శిల్పులకు వరవడియై మలయా, జావా, సుమత్రా, సింహళాది దేశాలపై తన వైజయంతికలను ప్రసరింపజేసింది.

## జగ్గయ్యపేట

అమరావతికి ఇరవై మైళ్ళ ఎగువన పాలేరూ కృష్ణా నదుల సంగమ స్థలానికి సమీపంలో ఉన్న నేటి జగ్గయ్యపేట సుప్రసిద్ధ ప్రాచీన బౌద్ధక్షేత్రము. ఆ రోజుల్లో దీనిని ఎలగిరి అనే వారు. శాసనాలలోని ఉత్తరశైలం ఇదే అయివుండవచ్చు. క్రీస్తు పూర్వం రెండో శతాబ్దిలోనే ఇచట మహాచైత్య విహారాదులు వెలసినాయి. ఈ మహాచైత్యాన్ని అలంకరించిన శిల్పాలు అమరావతీ రీతికి చెందినవే. వీనిలో పుణ్య శాలాశిల్పము మహామల్లపుర రాతిరథాలను, స్త్రీ పురుష మూర్తులు అజంతాకుడ్య చిత్రాలను స్ఫురణకు తెస్తాయి.

## నాగార్జునకొండ

మహాయాన సిద్ధాంతకర్త బోధిసత్వ నాగార్జునునికై శ్రీయజ్ఞ శాతకర్ణి శ్రీపర్వత

మహాచైత్య విభారాలను నిర్మించినాడు. శ్రీపర్వత పశ్చిమ పాదంలోనే ఇక్ష్వాకుల రాజధానియైన విజయపురి విలసిల్లుతూ ఉండేది. శ్రీపర్వత విజయపురి ప్రాంతమే నేడు నాగార్జునకొండగా ప్రశస్తి వహించింది. ఇచటి మహాచైత్యం బుద్ధ ధాతువుపై నిర్మితమైనట్లు శాసనాధారం దొరికింది. శ్రీపర్వత విహారాన్నే 'పారావత' విహారమని చైనా యాత్రికుడు పాహియాన్ పేర్కొన్నాడు. ఇది పర్వతసానువులో తొలిచిన ఐదంతస్తుల భవనమనీ, ఇందు విశ్వవిద్యాలయాన్ని గ్రంథాలయాన్ని నాగార్జునాచార్యుడు నెలకొల్పినాడనీ వివరించినాడు. బౌద్ధ ధర్మంతో బాటు నాగార్జున విద్యాపీఠంలో ఆయుర్వేదము, రసాయనిక ఖగోళ శాస్త్రాలు బోధించేవారు. ఇందుకు నిదర్శనంగా ఇచటి త్రవ్వకాలలో రసాయనిక శాస్త్ర ప్రయోగాలకు ఉపకరించే పరికరాలు లభించినాయి.

శ్రీపర్వత విహారం ఇక్ష్వాకు చక్రవర్తి వీరపురుష దత్తుని కాలంలో మహాక్షేత్రమయింది. అతని అంతఃపురాంగనలు స్తూపవిహార చైత్యాలయ శిలామంటప చతుశ్శాలలనేకం నిర్మించి శ్రీపర్వత క్షేత్రానికి నూతన శోభను చేకూర్చినారు. ఈ స్తూపాలు అమరావతీ రీతిలో మలచిన శిల్పాలతో అలంకృతములై నాగార్జున కొండను అమరావతికి మించిన కళాక్షేత్రంగా మార్చినాయి. ఇచటి విహారాలలో మహాయాన శాఖలకేగాక థేరవాదులకు సైతం నివాస సౌకర్యాలుండేవి. సింహళ విహారం ప్రత్యేకించి సింహళ థేరవాదులకు ఉద్దేశించినది. బౌద్ధాంధ్రుల ఉదార మత సహిష్ణుతకు, ఇంతకు మించిన నిదర్శనమక్కరలేదు. శ్రీ పర్వత శిఖరాల నుండియే మహాయాన ధర్మజ్యోతులు చైనా, గాంధార, సింహళాది దూర దేశాలకు ప్రసరించినాయి.

## వేంగి

పశ్చిమగోదావరి జిల్లాలో వేంగి ఆంధ్రుల మరొక రాజధాని నగరం. వేంగినే హుయన్‌సాంగ్ పింగ్ - కీ - లో అని ఉచ్చరించినాడు. పింగ్ - కి - లో సమీపంలోనే అచల అర్హతుడు ఇరవై సంఘారామాలు నిర్మించినాడనీ వానిలో మూడు వేల మంది బౌద్ధ భిక్షువులు నివసించేవారనీ కూడా వ్రాసినాడు. ఈ ఆరామాలకు సమీపంలోనే ఒక

చైత్యగృహంలో నివసిస్తూ జనబోధిసత్త్వుడు తర్కశాస్త్రం రచించినాడట. ఈ బోధిసత్త్వుడే దిజ్ఞాగుడు అని చరిత్ర కారులు భావిస్తున్నారు. మహాయాన శాఖయైన విజ్ఞానవాదానికి రూపం సంతరించిన మహనీయుడు దిజ్ఞాగుడే.

## వజ్రయాన కేంద్రాలు

మహాయానంలో పూజాదికాలు క్రమంగా వెర్రితలలు వేసి వజ్రయానంగా పరిణామం చెందింది. శాక్తేయ సంబంధమైన వామాచారాన్ని పోలిన తంత్రాలు వజ్రయానంలో ప్రబలములయినాయి. ఆంధ్రదేశంలో రామతీర్థం, శాలిహుండం, సంఘరములలో వజ్రయాన చిహ్నాలు ఎక్కువగా కన్పిస్తాయి. వాస్తవానికి వజ్రయానానికి సయితం 'ధారణి కోట'గా ప్రసిద్ధమైన అమరావతియే జన్మస్థలం. పై క్షేత్రాలను దర్శించినప్పుడు వజ్రయాన దుష్టాచార ఫలితంగా ప్రజాజీవితం నుండి బౌద్ధం బహిష్కృతమై పర్వత శిఖరాల నాశ్రయించినదా అనిపిస్తుంది. అదే బౌద్ధమత పతనావస్థలో చరమాంకము.

'ఆరామతీర్థ'మే రామతీర్థమైనదని చెప్పవచ్చు. ఇది విశాఖపట్టణము జిల్లాలో విజయనగరానికి సమీపంలో ఉంది. ఇచటి గురుభక్తి కొండ, దుర్గకొండలపై స్తూపచైత్యాలయాలతో ఆరు విహారాలు, పెక్కు ఉద్దేశిక స్తూపాలు ఉన్నాయి. శాలిహుండం శ్రీకాకుళం జిల్లాలో వంశధారా నదిపై ఉంది. ఇచటి కొండపై స్తూపవిహారాదులు, తారా, మరీచీ మొదలైన వజ్రయాన దేవతా ప్రతిమలు బయల్పడినాయి. ఇచట విహారాన్ని 'కటహారామం' అనే వారని కొందరి అభిప్రాయం. సుమత్రా దీవిలోని విహారానికి గూడ కహా' లేక 'కేదహ' అని పేరు. ప్రాచీన కళింగ రేవు పట్టణానికి చేరువలో ఉన్న లిహుండం నుండియే బౌద్ధం సుమత్రాకు పయనించి ఉంటుంది.

సంఘరం అనే పేరు సంఘారామానికి భ్రష్టరూపమే. విశాఖపట్టణం జిల్లాలో అనకాపల్లికి రెండు మైళ్ళ దూరంలో బొజ్జన్నకొండ, లింగాలమెట్ట అనే రెండు కొండలమీద వెలసిన ఈ క్షేత్రంలో ఆంధ్ర బౌద్ధంలోని వివిధ పరిణామ దశలను గమనించవచ్చు. ఇచట గుహాలయాలు చాల ప్రాచీనమైనవి. కొండశిఖరాన్ని అధిష్ఠించి మహాచైత్యము, దాన్ని

పరివేష్టించి శిలాస్తూపాలు, చైత్యాలయాలు, బుద్ధాలయాలు విహారాలు నిర్మించినారు. ధ్యానసమాధి, భూమిస్పర్శ ముద్రలలోనున్న బుద్ధ ప్రతిమలున్న బుద్ధాలయాలు ఇచటి ప్రత్యేకత.

బొజ్జన్న కొండ నానుకొని యున్నదే లింగాల మెట్ట. భక్తి తత్పరులైన బౌద్ధభిక్షువులు కొండను వందలకొలది ఉద్దేశిక స్తూపాలుగా మలచి వేసినారు. ఈ లింగాలమెట్టయే జావాలోని బొరొబుదురు బౌద్ధక్షేత్రానికి నమూనా అయిందని ఒక విమర్శకుని అభిప్రాయం.

క్రమంగా బుద్ధన్న బొజ్జన్న అయినాడు. ఉద్దేశిక స్తూప పర్వతమే లింగాలమెట్టగా మారింది. ప్రజాదరణ కోల్పోయిన బౌద్ధక్షేత్రాలు ఎంత సులభంగా శైవపరం చేయబడినవో ఈ పరిణామం వల్ల స్పష్టమవుతుంది.

ఆంధ్రదేశంలో బౌద్ధం ప్రజా ఉద్యమంగా వర్ధిల్లినట్లు పైన పేర్కొన్నాము. అందుచేతనే పైన వర్ణించిన ప్రసిద్ధ క్షేత్రాలేగాక గుమ్మడిదుర్రు, గుడివాడ, ఘంటసాల, విద్యాధరపురం, బుద్ధాం, చినగంజాము, ఫణిగిరి, కొండాపూర్, మొదలైన తీర్థాలు అనేకం వెలయడంలో ఆశ్చర్యం లేదు. అమరావతితో సహా పంచారామాలు మొదట బౌద్ధక్షేత్రాలేనని ప్రసిద్ధి. మగధ విహార దేశం (బీహార్) అయినట్లే బౌద్ధయుగంలో ఆంధ్రదేశం ఆరామ దేశమయింది.



---

ఇటీవల పలనాడులో కేసానపల్లి దగ్గిర, ప్రకాశంజిల్లాలో చందవరం దగ్గిర, విశాఖపట్టణం సమీపంలో రెండు కొండలమీద స్తూప విహారాదులతో బౌద్ధక్షేత్రాలు బయల్పడినాయి. గుంటూరు సమీపంలో నాగార్జున విశ్వవిద్యాలయ ఆవరణను ఆనుకొని క్రీ.శ. రెండో శతాబ్దికి చెందిన స్తూపశిథిలాలు, బుద్ధ విగ్రహాలు దొరికినాయి.

---

ఆకాశవాణి విజయవాడ కేంద్ర సౌజన్యంతో

# 7. ప్రాచీన ఆంధ్ర నగరాలు - ధాన్యకటకము

ఆంధ్రదేశ చరిత్రలో ధాన్యకటకానికి ఒక విశిష్టత, పవిత్రత ఉన్నాయి. క్రీ॥ పూ॥ 3వ శతాబ్దం నాటి శాసనము ఈ ప్రదేశాన్ని 'ధమనకద' అని పేర్కొంది. ధాన్యకటక చరిత్ర విషయంలో ఇప్పటి వరకు లభించిన అతి ప్రాచీన శాసనాధారం అదే. ధమనకద పదానికి పరిణతి చెందిన ఇతర పర్యాయ పదాలు 'ధనకద' 'ధనకటక' 'ధాన్యకటక'. మధ్యయుగానికి చెందిన తాంత్రిక వాఙ్మయాలయిన (అ) 'శేకోద్దేశతి' 'ధాన్యకటకాన్ని' 'శ్రీధాన్య'గాను (ఆ) మంజుశ్రీ మూలతంత్ర 'శ్రీ ధాన్యకటక'గాను పేర్కొన్నాయి. టిబెట్టు వాఙ్మయము బ్లూ ఆనల్స్ (Blue Annals) ధాన్యకటకాన్ని 'శ్రీస్థాన' అని పేర్కొంది. గౌతమి బాలశ్రీ నాసిక్ శాసనము 'సిరిధాన' కొండ గౌతిమీ పుత్రుని సామ్రాజ్యానికి ఆభరణము అని పేర్కొంది. బహుశః టిబెట్టు వాఙ్మయము పేర్కొన్న శ్రీస్థానమే గౌతమీ పుత్రుని సామ్రాజ్యములోని సిరిధాన కావచ్చును. ప్రాచీన నగరమయిన ధాన్యకటకానికి పశ్చిమ సరిహద్దులో నేడు 'ధరణి కోట' గ్రామం ఉంది. దశబాల (బుద్ధుడు) ధరణులను (మంత్రాలను) నిక్షిప్తము చేసిన ప్రదేశము కనుక 'ధారణికోట' (Fort of Dharanis) గా ప్రసిద్ధి చెందినదని సంప్రదాయము. ధారణికోట క్రమంగా 'ధరణికోట'గా రూపాంతరం చెందింది.

సుప్రసిద్ధ బౌద్ధక్షేత్ర శిథిలాలపైన 18వ శతాబ్ది ఉత్తరార్ధంలో నిర్మింపబడిన చిన్న పట్టణమే 'అమరావతి' ధాన్యకటక నామం పూర్తిగా మరుగున పడటానికి కారణాలు తేటతెల్లమే. మహాస్తూపము స్తూపాన్ని అలంకరించిన మహోన్నత శిల్పసంపద కనుగొనబడినపుడు ఆ ప్రాంతము అమరావతిగా పిలువబడుతోంది. అందువలన పురాతత్త్వవేత్తల చరిత్రకారుల రచనలలో 'అమరావతి స్తూపము', 'అమరావతి శిల్పము' అని చోటుచేసికొని ప్రపంచ ప్రసిద్ధి గాంచినాయి. ధాన్యకటక నామము ప్రజాస్మృతి

నుండి దూరమయింది. ధాన్యకటకము వ్యవసాయ వాణిజ్య పారిశ్రామిక రంగాలలో ముందంజ వేసిన సంపన్నదేశము. బౌద్ధ పరివ్రాజకులు ఆరామాలను విహారాలను సంపన్న నగరాల సమీపంలో నిర్మించే వారు. కారణం, నగర వాసుల ఆదరాభిమానాలే వారికి అండదండలు. అనేక ఆరామాలతో మహోన్నతమయిన బౌద్ధక్షేత్రముగా ధాన్యకటకము విలసిల్లింది. 7700 విద్యార్థులతో విలసిల్లిన 'లాసా' విశ్వవిద్యాలయము ధాన్యకటక మహావిహార నమూనాపైననే నిర్మింపబడినదని లామా తారానాథుడు పేర్కొన్నాడు. ధాన్యకటకములోని ఒక భాగము అనేక ఆరామాలతో నిండియుండవచ్చుననీ, ఆ ప్రాంతాన్ని 'ఆరామవతి' అనిపిలిచే వారనీ, ఆరామవతి క్రమంగా అమరావతిగా రూపాంతరం చెందియుండవచ్చుననీ ఊహించటానికి అవకాశం లేకపోలేదు. కేవలము యిది ఊహాజనితమయిన అభిప్రాయము మాత్రమే.

ధాన్యకటకములోని శైవ కేంద్రాన్ని గురించిన అతిప్రాచీన శాసనాధారం క్రీ॥ శ॥ 10వ శతాబ్ది నాటి తూర్పు చాళుక్యులది. ఈ శాసనము దైవాన్ని (Lord) 'అమరావతేశ్వరుడ' ని పేర్కొంది. అమరావతేశ్వర నామము 'ఏకామ్రేశ్వర శబ్దాన్ని పోలి వుంది. విప్లవ శైవ తెగ కాలాముఖులు అమరావతేశ్వరములో సింహపరిషత్తును స్థాపించి మత ప్రచారం చేసినట్లు ఆధారాలున్నాయి. కానీ, దేవతా ప్రతిమ ఉన్న పట్టణము అమరావతిగా పిలువబడలేదు. క్రీ॥శ॥ 640లో ఈ ప్రదేశాన్ని దర్శించిన చీనా యాత్రికుడు హుయాన్ సాంగ్ బౌద్ధ విహారాలు నిర్మానుష్యముగా ఉన్నాయనీ, దేవునికి ఆలయాలు వెలుస్తున్నాయనీ వ్రాశాడు. ఈ ప్రదేశాన్ని (Te-na-ka-che-ka) ధాన్యకటకము అని పేర్కొన్నాడు. అమరావతి అని ఎక్కడా వ్రాయలేదు. అమరావతేశ్వరము క్రమంగా 'అమరేశ్వరము' అయింది. అది ఒక దేవస్థానము మాత్రమే కానీ, గ్రామ/ పట్టణ నామము కాదు. మధ్యయుగాల నాటి 'కోట' - 'రెడ్డి' రాజవంశీయుల శాసనాలలో అమరేశ్వర పదం తరచు కన్పడుతుంది కానీ 'అమరావతి' ఎక్కడా కన్పడదు. అమరేశ్వరుని భక్తులయిన కోట వంశస్థులు 'ధరణికోట - కోట వంశీయులు'గా చరిత్రకెక్కారు గానీ 'అమరావతి - కోట వంశీయులు'గా కాదు. (ధరణికోట అక్కడక్కడ 'దన్నలకోట'గా పేర్కొనబడింది) శ్రీలంక బౌద్ధ బిక్షువు ధర్మకీర్తి

ధాన్యకటకములోని ఒక విహారాన్ని పునరుద్ధరించినట్లు సిలోన్ కాండీ (Candy) లోని ఒక శాసనము ద్వారా తెలుస్తున్నది. కానీ ధర్మకీర్తి 'అమరావతి'ని ఎక్కడా ఉదహరించలేదు.

18వ వతాబ్ది ఉత్తరార్ధములో జమీందారయిన రాజావాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు అమరేశ్వరము ప్రక్కన రాజప్రాసాదాన్ని నిర్మించి 'వైజయంతీ మహల్' అని పేరు పెట్టాడు. ఇంద్రుని రాజప్రాసాదము వైజయంతి, ఇంద్రుని పట్టణము అమరావతి. అందుచేత తన రాజప్రాసాద పరిసరాల్లో అభివృద్ధి చెందిన పట్టణానికి వెంకటాద్రి నాయుడు 'అమరావతి' అని పేరు పెట్టాడు. అమరావతి నామచరిత్ర యిది. విశిష్ట చరిత్ర కలిగిన ధాన్యకటక నామానికి గ్రహణం పట్టించింది అమరావతి నామమే.

ఆంధ్రుల చరిత్ర జన్మస్థానంగా భట్టిప్రోలుతో సమానమయిన గౌరవ స్థానాన్ని ధాన్యకటకము పొందింది. 'తేలివాహ' నది ఒడ్డున 'ఆంధ్రపురి' ఉన్నట్లు శేరివనిజ జాతకకథ' ద్వారా తెలుస్తోంది. సుప్రసిద్ధ చరిత్ర కారుడు P.G.Roy Chaudhuri తేలివాహనది కృష్ణానదిగా గుర్తించాడు. (తేలివాహ = నూనెవలె నల్లగా ప్రవహించినది). ఈ ఆధారము దృష్ట్యా ఆంధ్రపురి ధాన్యకటకమేననేది స్పష్టము. అశోకునికి పూర్వమే ధాన్యకటకము బౌద్ధక్షేత్రముగా విలసిల్లినట్లు ఇటీవలి పురాతత్త్వ త్రవ్వకాలు రుజువు చేస్తున్నాయి. ఈ కారణముగ ఆంధ్రపురి నామములో ధాన్యకటకము ప్రాచీన బౌద్ధవాఙ్మయములో విశిష్ట స్థానాన్ని పొందటములో ఆశ్చర్యము లేదు. క్రీ॥శ॥ 300 నాటి ఒక శాసనము ఆంధ్ర పథానికి ప్రధాన కేంద్రముగా ధాన్యకటకాన్ని పేర్కొన్నది. ఈ విధముగా ధాన్యకటకము ఆంధ్రదేశానికి, ఆంధ్ర సంస్కృతికి కేంద్ర స్థానమయి విరాజిల్లింది.

క్రీ॥పూ॥ 3వ శతాబ్దము నాటి ప్రామాణిక రచయితలు ఆంధ్రులకు 30 దుర్గాలున్నట్లు పేర్కొన్నారు; మరికొందరు ఆంధ్రులకు 30 రాజ్యాలున్నట్లు వ్రాసారు. మహాభారత ఇతిహాసము ఆంధ్రాశ్చ బహువః (ఆంధ్రులు అనేకులు) అని పేర్కొంది. ఈ ఆధారాలు దృష్ట్యా, ఆంధ్రులు 30 తెగలుగా గణతంత్ర రాజ్యాలుగా ఉండేవారనీ ప్రతి గణతంత్ర దేశమూ ఒక దుర్గాన్ని (కోటను) పరివేష్టించి ఉండేదని స్పష్టమవుతోంది. దుర్గాలు

సంపదకు చిహ్నాలు. వ్యవసాయ పారిశ్రామిక వాణిజ్య రంగాలలో విశిష్ట కృషి ఫలితమే గణతంత్ర దేశాలు సిరిసంపదలతో తులతూగటానికి కారణము. అటువంటి దుర్గాలలో ధాన్యకటకము ఒకటిగా పురాతత్త్వ త్రవ్వకాలు, అనుమాన రహితంగా, స్పష్టంచేస్తున్నాయి. ధాన్యపు ఉనికి కీలకమయినది. సారవంతయయిన కృష్ణానదీ ఫరీవాహక డెల్టా ప్రాంతము; వరి ప్రత్తి మున్నగు అనేక ముఖ్య వ్యవసాయ వుత్పత్తులకు సుక్షేత్రం. సుదూర ప్రాంతాలను కలిపే ప్రధాన వాణిజ్య రహదారుల కూడలి. (i) పశ్చిమ దిశలోని పైదాన్, ఆపై ప్రాంతాలనుండి తెలంగాణా కుండా ధూళికట్ట, ఫణగిరి, నేలకొండపల్లి, జగ్గయ్యపేట (వేలగిరి) లను ఒక రహదారి కలుపుతుంది. (ii) కళింగనుండి తూర్పుకోస్తా గుండా శాలిహుండం, రామతీర్థం, బావికొండ, గుంటుపల్లి, రామిరెడ్డిపల్లి, అల్లూరు లను కలిపే రహదారి. (iii) & (iv) వనవాసి, కంభి మున్నగు దక్షణాపథములోని పట్టణముల నుండి వేయబడినవి. వీటి అన్నిటి కూడలిగా ధాన్యకటకము ప్రసిద్ధిగాంచింది. వాణిజ్య సంబారాలకే కాక సైన్యాలకు కూడా ధాన్యకటకము రేవు పట్టణముగా వుండేది. ఆనందగోత్రీకుడయ్యి ఒకరాజు ధాన్యకటక యుద్ధములో శత్రువును (బహుశః చాణుక్య రాజును) ఓడించి గజఘటాలను (గజదశాలను) వశపరచుకున్నట్లు చెప్పుకున్నాడు'' మధ్యయుగములో వేంగిపై దండెత్తిన చోళసైన్యము ధాన్యకటకము వద్దనే కృష్ణానదిని దాటింది. బహమనీ సుల్తాను అల్లావుద్దీన్ ధాన్యకటకము వద్దనే కృష్ణానదిని దాటి రెడ్డి రాజ్యముపై దండెత్తినాడు రెడ్డిరాజుల - వెలమరాజుల మధ్య అనేక యుద్ధాలను ధాన్యకటకము చవిచూసింది.

ఒకవైపున కృష్ణానది,వేరొకవైపున చిత్రమూలాధ్వజారణ్యము ధాన్యకటకానికి అమరిన సహజ జల వన దుర్గాలు. సహజ రక్షణ కవచాలతో సురక్షితమయి అతిసంపన్న గణతంత్ర రాజ్యముగా ప్రాచీనకాలములో ధాన్యకటకము విలసిల్లింది. మజేరిక (Mayenika) దేశములోని 'నాగగణతంత్ర రాజ్యముగా ధాన్యకటకాన్ని సింహళ చరిత్ర గ్రంథాలయిన 'మహావంశ' 'దలదవంశలు పేర్కొంటున్నాయి. భట్టిప్రోలు వలెనే ధాన్యకటకగణతంత్ర దేశము రాజు (Rajan) పాలనలో వుండేది. పరిపాలన విషయంలో 'నిగమ' లేక 'వర్తక

శ్రేణి' రాజుకు సహాయపడేది. ఇతర దేశాలతో ధాన్యకటక గణతంత్రము జరిపిన వాణిజ్య సంబంధాలే ఆదేశ సిరిసంపదలకు ప్రధానకారణము. వరి, ప్రత్తి, అరణ్యసంపద. జంతుసంపద ముఖ్య ఎగుమతులు. ధాన్యకటకానికి సమీపంలోనే మరొక బౌద్ధ క్షేత్రము ఉచ్ఛస్థితిలో వుండేది; అదే వడ్డమాను (శాలిపుర). వరిధాన్యానికి ముఖ్య వ్యాపార కేంద్రము వడ్డమాను అయివుండవచ్చును. క్రీస్తు పూర్వము 4వ శతాబ్దమునాటి నీటి మార్గపు అవశేషాలుపురాతత్త్వ త్రవ్వకాలలో బయల్పడినాయి. సముద్రము మీదుగా వచ్చే పెద్దపెద్ద ఓడలు నిలువటానికి అనువయిన స్థలము వరకు ధాన్యకటకము నుండి ఆ నీటిమార్గము వుండేది. ధాన్యకటకపు సిరిసంపదలు బౌద్ధ భిక్షువులను విశేషంగా ఆకర్షించాయి. మగధదేశము నుండి కూడ బౌద్ధశ్రమణులు ఇక్కడికి వచ్చినట్లు స్తూప పరిసరాలలో దొరికిన ఆధారాలు (NBP ware) రుజువుచేస్తున్నాయి. బౌద్ధపరివ్రాజకులు 'వందనామగోష్ఠి' ఏర్పాటు జేసి మేధాపరమయిన కార్యక్రమాలూ, మతప్రచారానికి సంబంధించిన కార్యక్రమాలూ నిర్వహించేవారు. ప్రజల శాంతి సౌభాగ్యము, నైతిక ఔన్నత్యము కొరకు రాజు, నిగమ, గోష్ఠి సుహృద్భావంతో కలసిమెలసి పాటు పడేవారు. ధాన్యకటక ఆరామాలలోనే 'ప్రజ్ఞా పారమిత' సూత్రాలు రూపు దిద్దుకొన్నాయి. ఆచార్యనాగార్జునుడు స్థానిక నాగవంశరాజు ద్వారా వాటిని పొంది యుండవచ్చును. ఆచార్య నాగార్జునుని మేధాసంపత్తి, చివరి శాతవాహనరాజుల పోషకాదరణల వలన అంతకు పూర్వము, ఆ తర్వాత పొందలేనంత మహోజ్జ్వల ఔన్నత్యము అసమాన గౌరవము విశిష్టతలను ధాన్యకటకము చవిచూసింది; వెలుగువెల్లువలతో ఓలలాడింది. ఆ ఘనతే ధాన్యకటకములోని స్తూపములో ప్రతిఫలించింది; సమకాలీన స్తూపములలో కెల్ల విశిష్టమయిన స్తూప విశేషముగా ధాన్యకటక స్తూపము కొనియాడబడింది. స్తూపాన్ని అలంకరించిన • సౌందర్యశోభితాలయిన చలువరాతి శిల్ప విశేషాలు భారతీయ చైతన్యకళారీతులలో (plastic art) ని ఉత్తమ కళాఖండాలుగా ప్రసిద్ధిగాంచినాయి.



# 8. ప్రాచీన ఆంధ్ర నగరాలు - భట్టిప్రోలు

భట్టిప్రోలుకు ఆంధ్రజాతి చరిత్రలో ఒకవైశిష్ట్యం వుంది. ఆంధ్రుల చరిత్ర భట్టిప్రోలులోనే ప్రారంభమైనదా అనే అభిప్రాయానికి మంచి అవకాశం వుంది. 'పట్టావళి' మొదలయిన జైనగ్రంథాలలో యదార్థ చారిత్రకాంశాలున్నాయని పండితుల అభిప్రాయము. ఆ చారిత్రకాంశాలు ఆధారంగా తరువాతే కవులు కావ్యాలు వ్రాసారు. క్రీ॥శ॥8వ శతాబ్దివాడయిన జైనకవి నయసేనాని 'ధర్మామృతకావ్యం' లో ప్రతీపాలపుర ప్రసక్తి కన్పిస్తుంది. ఆ వృత్తాంతాన్ని బట్టి యశోధరుడనే ఇక్ష్వాకు రాకుమారుడు దక్షిణదేశానికి వలస వచ్చి వేంగి రాజ్యంలోని ప్రతీపాలపురం రాజధానిగా రాజ్యపాలనసాగించినాడు. ఇది వసుపూజ్యాచార్యుని కాలంలో, అంటే క్రీస్తు పూర్వం ఐదోశతాబ్దంలో జరిగింది. ప్రతీపాలపురమే భట్టిప్రోలు అని చరిత్రకారులు గుర్తిస్తున్నారు. కళింగాధీశుడైన 'ఖారవేలుడు' (క్రీ.పూ. 170) తన 'హరిగుంఫ' శాసనంలో 'అవరాజ నిర్మితమైన ప్రిధుడనగరాన్ని' పేర్కొన్నాడు. టాలెమీ అనే గ్రీకు ఖగోళ శాస్త్రవేత్త (క్రీ.శ. 130) మైసోలియా ప్రాంతంలోని 'పిరింద్ర' నగరం వస్త్ర పరిశ్రమకు వాణిజ్యానికి కేంద్రం అని వర్ణించాడు. మైసోలియా అనేమాట కృష్ణాముఖద్వారానికి వర్తిస్తుంది. దీనినే సింహలగ్రంథాలయిన మహావంశ దలిదవంశాలు శుజెరికా అని వ్యవహరిస్తున్నాయి. నేటికీ భట్టిప్రోలులో వేయి కుటుంబాలకు పైగా వస్త్రపరిశ్రమపై ఆధారపడివున్నట్లు తెలుస్తోంది. అందుచే ప్రిధుధ, పిరింద్ర భట్టిప్రోలు అనేవి ప్రతీపాల పురానికి రూపాంతరాలని చెప్పటానికి సందేహించనక్కరలేదు. ఇక 'అవ' అనే మాటను పురాణాల్లో 'ఆంధ్ర' పర్యాయపదంగా వాడినట్లు తెలుస్తోంది. యశోధరుని కాలంలో వేంగిలేదు. కాని నయసేనుని కాలంలో ఈ ప్రాంతం అంతా వేంగి చాణక్య రాజ్యాంతర్భాగమయినందున ప్రతీపాలపురం వేంగి రాజ్యంలో నున్నట్లు అతడు వ్రాసాడు. ధాన్యకటకం ఆంధ్రజనపదానికి కేంద్రమని క్రీ॥శ॥ 3వ శతాబ్దానికి చెందిన శాసనాలు ఉదహరిస్తున్నాయి. జాతక కథల్లోని తేలివాహ నది దక్షిణ తీరంలో ఆంధ్రనగరం

ఉన్నట్లు పేర్కొన్నారు. ఆ ఆంధ్రనగరమే ధాన్యకటకము. ప్రతీపాలపుర ప్రాంతం కూడ ఆ రోజుల్లో ఆంధ్రాజనపదంలో భాగమైనందున ఖారవేలుడు ప్రతీపాలపురాన్ని ఆంధ్రరాజులు నిర్మించినారని పేర్కొని వుంటాడు.

భట్టిప్రోలు సారవంతమైన మైదానంలో కృష్ణా తీరంలో సముద్రతీరానికి సమీపంలో వుంది. పాడిపంటలు పుష్కలంగా పండే ప్రాంతం, వరిప్రత్తి విస్తారంగా పండుతూవుండేవి. ఇచట బయల్పడిన పెద్దపెద్ద ఇటుకలతో నిర్మించిన 'చైత్యశైలం' నాటి ప్రజలు భవన నిర్మాణ శాస్త్రంలో సాధించిన నైపుణ్యానికి నిదర్శనం. టాలెమీ ఇచటి వస్త్ర పరిశ్రమను పేర్కొన్నాడు గదా! ఇచటి స్తూపంలో దొరికిన స్ఫటిక కరండాలు, స్వర్ణపుష్పాలు, వెండిరేకుపై లేఖనం మొదలయిన వానివలన నాటి ప్రజలు పలురకాల చేతి పరిశ్రమల్లో ఆరితేరినట్లు కన్పిస్తున్నది. కృష్ణానదిలో అమరావతి వరకు నౌకాయానం జరిగిన నిదర్శనాలున్నాయి. భట్టిప్రోలు సమీపంలో కృష్ణానదిలో పోతవరలంక వుంది. 'పోతవరలంక' అంటే పెద్దపడవ అనీ, సముద్రం నుండి అంతవరకు పెద్దనౌకలు వచ్చేవని చరిత్రకారుల అభిప్రాయం. అందుచేత భట్టిప్రోలు నుండి వరిధాన్యం పాడి, దినుసులు, వస్త్రాలు విరివిగా ఎగుమతి అవుతుండేవి. పారిశ్రామిక, వాణిజ్య కేంద్రమయిన భట్టిప్రోలొక పెద్దనగరమై క్రీ॥పూ॥ నాలుగో శతాబ్దిలో మెగస్తనీస్ పేర్కొన్న 30 ఆంధ్రదుర్గాల్లో ఒకటిగా ప్రసిద్ధి చెందివుంటుంది.

ధర్మామృతకావ్యసమాచారప్రకారం యశోధరుని వంశంలో జన్మించిన ధనదుడు జైనమతాభిమాని. కాని, అతని భార్య కమలశ్రీ. ఆమె తండ్రి సంఘశ్రీ బౌద్ధమతం స్వీకరిస్తాడు. అందుచే చారణ రుషులు సంఘశ్రీని 'అంధుడవుకమ్మని' శపిస్తాడు. నాటినుండి ఆరాజ్యాన్ని 'అంధక విషయం'గా వ్యవహరించసాగినారు. ఆంధ్ర బౌద్ధులను బౌద్ధుల పాళీవాఙ్మయం 'అంధకులు' అని వ్యవహరించడం ఈ సందర్భంలో గమనార్హం. ప్రతీపాలపురంలో జైన బౌద్ధాలమధ్య సంఘర్షణ జరిగి అందులో బౌద్ధం విజయం పొందినట్లు ఈ వృత్తాంతం చూపిస్తున్నది.

ధనదుడు చారిత్రక వ్యక్తివలె కన్పిస్తున్నాడు. ధనదుడనే రాజు కృష్ణాముఖద్వారంలోని

దివి మొదలయిన ప్రాంతాలలో జనావాసం ప్రోత్సహించినాడని కాకతీయ గణపతిదేవుని గణపేశ్వర శాసనం వర్ణిస్తున్నది. భట్టిప్రోలుకు సుమారు 15 మైళ్ల దూరంలో ధనదపురం ప్రసిద్ధనగరంగా వర్ధిల్లింది. ఆ ధనదుడే తన పేర ఆ పురాన్ని నిర్మించి వుండవచ్చును. దనదపురం - సవరంపురం - సనదుప్రోలు అనే రూపాంతరాలుచెంది చివరకు 'చందోలు'గా మారి మధ్యయుగంలో వెలనాటి దుర్బయ రాజులకు రాజధాని అయింది. భట్టిప్రోలులో దొరికిన అతి ప్రాచీన శాసనాల్లో సవేరపుత్రుడైన కుభిరక రాజు ప్రసక్తి కన్పిస్తుంది. కుభిరక అనేది 'కుబేర' రూపాంతరమని సమ్మతిస్తే, కుబేరునకు ధనదుడనే నామాంతరం వున్నందున, అతడే గణపేశ్వర శాసనంలోని వ్యక్తి అని, ధనదపుర నిర్మాతయని భావించడం పూర్తిగా అశాస్త్రీయంకాదు.

భట్టిప్రోలు శాసనాలు కుభిరక రాజుతో బాటు సిహగోఠి (సంహగోష్టి) ని, నిగమ (సభ) ను పేర్కొంటున్నాయి. ధాన్యకటకంలో 'వందనామగోఠి' వుండేది. గోష్టి అనేది బౌద్ధసంఘ స్థానిక శాఖ అయివుంటుంది. 'నిగమ' అనేది వర్తకశ్రేణి. కుభిరకుని గోష్ఠి ప్రముఖుడని శాసనం వర్ణిస్తున్నది. దీన్నిబట్టి ఉపాసకులను సంఘంలో చేర్చుకొని వారిని నాయకులుగా బౌద్ధులు అంగీకరించేవారని తెలుస్తుంది. ఇది మహాసాంఘికుల సంప్రదాయం. గోష్టి, నిగమ సభల సహాయంతో కుభిరుడు భట్టిప్రోలు స్తూప విహారాలను నిర్మించి గొప్ప బౌద్ధ క్షేత్రాన్ని రూపొందించినట్లు స్పష్టమవుతున్నది.

కుభిరకుని అనంతరం అచిరకాలంలోనే కాలగర్భంలో కలిసిపోయిన భట్టిప్రోలు చారిత్రక ప్రాశస్త్యం క్రీ॥శ॥ 1870 నుండి వెలుగులోకి రాసాగింది. ఇంగ్లీషు వర్తక సంఘ ఉద్యోగులైన బాస్వెల్, సర్‌వాల్టర్ ఎవియట్ అనంతరం రాబర్ట్ సూయిల్ మొదలయిన వారీ చవిటి దిబ్బలలో బౌద్ధక్షేత్ర శిథిలాలు నిక్షిప్తములైవున్నట్లు గుర్తించారు. వీనికి చినలంజ దిబ్బ, పెదలంజదిబ్బ, విక్రమార్కుని కోట దిబ్బ అని పేర్లుండేవి. వజ్రయానం వల్ల బౌద్ధ భిక్షుకీ భిక్షుకులలో అవినీతి ప్రబలినందున ప్రజలాప్రదేశాలనా విధంగా పిలిచేవారని పండితలోకంలో ప్రచారంలో వున్న అభిప్రాయం. భట్టిప్రోలులో వజ్రయానం ప్రబలిన నిదర్శనాలు లేవు. కాని, బౌద్ధక్షేత్రాలకు లంజదిబ్బ పదం సర్వసామాన్యమైనందున

ఈ దిబ్బలకు కూడా ఆపదమే వర్తించింది. ఇక్కడ ప్రస్తుతం కాకపోయినా ఒక అంశం విచారించవలె. మధ్య యుగారంభంలో తంత్రం అఖిలభారతీయ మాధ్యమంగా విస్తరిల్లింది. హిందూమతంలో కూడా తాంత్రికాచారాలు ప్రబలినాయి. నేటికీ హిందువుల్లో వామాచార సంప్రదాయాలకు గౌరవమర్యాదలు లేకపోలేదు. నేటికి బయల్పడిన బౌద్ధక్షేత్రాలనుండి నాటి భిక్షుకీ భిక్షుకుల అవినీతి ప్రవర్తనకు ప్రత్యక్ష నిదర్శనాలు లభించవు. కాని, భువనేశ్వర్, కోణార్క, ఖజురహో దేవాలయాలు హిందూ తాంత్రికాచారాలకు ప్రత్యక్షసాక్షులు. వానిలో ఒక్కొక్క దేవాలయం ఒక్కొక్క 'బూతుమహాకావ్యం' అయినా అవి దర్శనీయాలు, ఆదరణీయాలు, పరమపవిత్రాలు. కానీ బౌద్ధక్షేత్రాలు మాత్రం లంజదిబ్బలు! ఈ వర్ణనకు కేవలం బౌద్ధంపట్ల హిందూమతోద్యమ నాయకుల్లో ప్రబలిన ఆగ్రహద్వేషాలే కారణం! అనారోగ్యకరమైన ద్వంద్వ నైతిక ప్రమాణాలకు నిదర్శనం!

రాబర్ట్‌సూయల్ దర్శించేనాటికే ఈ దిబ్బలనుండి పాలరాతి శిల్పఫలకాలు, ఇటుకలు త్రవ్వి తీసి రోడ్లు, వెల్లటూరు కాల్వపై తూములు నిర్మించడంలో వాడినారు. అలెగ్జాండరు రే 1892లో త్రవ్వడం ప్రారంభించేనాటికి స్తూపంలో అధికభాగం నష్టపడింది. అయినా త్రవ్వకాలలో చక్రాకార పునాదులపై నిర్మించిన బృహత్ స్తూపం బయల్పడింది. స్తూపవ్యాసం 132 అడుగులు. స్తూపం మధ్య ఆమూలాగ్రంగా ఇటుకలతో అమర్చిన రంధ్రం వుంది. రంధ్రం చుట్టూ ఇటుకలను పద్మాకారంలో అమర్చారు. ఇందులో స్తూపాగ్రాన వుండే భద్రపుకాడను నిలిపినారు. శిలాఛత్రశిథిలాలు స్తూపం ఆవరణలో దొరికినాయి. స్తూపంచుట్టూ ప్రదక్షిణ పథము దాని అంచున పాలరాతి ప్రాకారం వుండేది. ప్రాకారవ్యాసం 148 అడుగులు. ప్రాకారస్తంభాలు కొన్ని బయల్పడినాయి. స్తూపం ఆవరణ వైశాల్యం మొత్తం 1700 చ. అడుగులు.

స్తూపం మధ్యనున్న రంధ్రంనుండి మూడుశిలామంజూషికలు ఒకదాని దిగువన మరొకటి లభించినాయి. శిలామంజూషికలపైనా వానిలోని స్ఫటిక కరండాల మీద లేఖనాలున్నాయి. వీని లిపిని గురించి చాలతర్జన భర్జనలు జరిగినాయి, జరుగుతూవున్నాయి. లేఖనాలను మొట్టమొదట పరిశీలించిన బూలర్ పండితుడు ఇవి అశోకుని కాలానికి

చెందినట్లు, దాక్షిణాత్య బ్రాహ్మీలిపి యైనట్లు నిర్ణయించినాడు. ఇటీవలి పండితులు ఆ లేఖనాలలోని కొన్ని అక్షరాలలో అశోకుని తర్వాత లిపి లక్షణాలు కన్పిస్తున్నాయని, క్రీ॥పూ॥ 100 సంవత్సరాలకు చెందినట్లు సూచిస్తున్నవనీ, దాక్షిణాత్య బ్రాహ్మీలిపి అని ప్రత్యేకించి లేదని వాదిస్తున్నారు. వాస్తవానికి అశోకుని శాసనాల్లో ఒకే అక్షరంలో వ్యత్యాసాలు (ప్రాంతీయ భేదాలు) లేకపోలేదని, ఈ వ్యత్యాసాలు స్థానిక లేఖలవల్ల వచ్చినవని ఆ పండితులు అంగీకరిస్తూనే వున్నారు. భట్టిప్రోలు లేఖనాల్లో ప్రత్యేకంగా కన్పించే అక్షరాలు అశోకుని ఇతర శాసనాల్లో కన్పిస్తున్నాయని కూడా వారు ఒప్పుకుంటారు. అంతేకాక, లేఖనాలున్న శిలామంజూషికలపై అశోకుని యుగానికి చెందిన విలక్షణమైన మెరుగు (పోలిష్) ఉన్నట్లు పరిశీలించడం జరిగింది. లేఖనాల్లోని 'బుద్ధశరీరాణి నిక్షిప్తం' (శాసనంలోని ప్రాకృతానికి సంస్కృతం) అనే వాక్యాన్ని బట్టి భట్టిప్రోలు స్తూపం యధార్థమయిన బుద్ధధాతువుపై నిర్మించినట్లు స్పష్టంగా తెలుస్తుంది. చరిత్రకారుల్లో ఒక అభిప్రాయం బలంగా వుంది. అశోకుడు నిర్మించిన స్తూపాల్లో వున్నవే యధార్థమయిన బుద్ధధాతువులు; ఇతరత్రా లభించిన ధాతువులు బుద్ధునివికావు. శాసన వాక్యాన్ని బట్టి, లేఖనాల లిపిని బట్టి, శిలామంజూషికపైని మెరుగును బట్టి భట్టిప్రోలు స్తూపం అశోకుని కాలంలోనే నిర్మించటం జరిగింది అనడం సముచితమైన నిర్ణయం. పూర్తిగా ఇటుకలుపయోగించి నిర్మించిన పద్ధతి, ఇందు లభించిన విద్ధాంక (పంచోమార్క్) నాణేలు సయితం స్తూపం ప్రాచీనతను బలపరుస్తున్నాయి.

ప్రాచీన లేఖనాలతో బాటు మంజూషికలలో ఆసక్తిదాయకము, అమూల్యము, చారిత్రాత్మకమునైన పురావస్తు సంపద లభించింది. మొదటి మంజూషికలో రాతిబరిణ, అందులో స్ఫటిక కరండం వున్నాయి. ఈ కరండంలోనే ధాతువును నిక్షేపించినారు. ధాతువును పీతాంబరంలో భద్రపరచిన చిహ్నాలున్నాయి. ధాతువు చుట్టూరాగి, బంగారు పుష్పాలు, బంగారు రేకులో మలచిన త్రిరత్నచిహ్నాలు, ముత్యాలు, స్ఫటికమూ, స్వస్తిక్ ఆకారంలో పేర్చిన 24 వెండి విద్ధాంక నాణేలు వున్నాయి. స్ఫటికంపై రెండు పంక్తుల లేఖనం వుంది. ధాతువును భద్రపరచడంలో జాగరూకతతో బాటు ధాతువుపట్ల

భక్తిశ్రద్ధలు స్పష్టమవుతున్నాయి. రెండో మంజూషికలో స్తూపకారంలో వున్న స్ఫటికకరండం వుంది. ఇందు ధాతువు వున్న నిదర్శనాలు లేవు. కానీ, 164 స్వర్ణ పుష్పాలు, పూసలు, ముత్యాలు, లేఖనం వున్న పల్చని వెండి రేకు వున్నాయి. మూడో మంజూషికలో స్ఫటికపు బరిణ, అందులో పచ్చలో మలచిన ధాతుకరండం, అందులో మూడు శల్యశకలాలు వాని చుట్టూ బంగారుపూలు ముత్యాలు పూసలు వున్నాయి.

పవిత్రతలో ప్రాచీనతలో పరిమాణంలో ధాన్యకటక స్తూపంలో తుల్యతూగినది భట్టిప్రోలు బౌద్ధక్షేత్రం. భట్టిప్రోలు నగరం సముద్రతీరానికి సమీపంలో వుండి, విదేశవాణిజ్యానికి కేంద్రమై ఐశ్వర్యవంతమయింది. ఇంతటి పవిత్రము, ఐశ్వర్యవంతమూనైన ఈ క్షేత్రం ఆంధ్ర సంస్కృతీ చరిత్ర పుటలనుండి అదృశ్యంకావటానికి బలమైనకారణం వుండి వుండవలె. కళింగాధిపుడైన ఖారవేలుడు గొప్ప విజేత; జైనమతాభిమాని. అనేక పర్యాయములాతడు తీరాంధ్ర ప్రాంతాలపై దాడులు జరిపినట్లు హాథిగుంఫ శాసనం చాటుతోంది. రెండోరాజ్య సంవత్సరంలో అతని సైన్యాలు కణ్ణబెణ్ణా (కృష్ణవేణా) నది వరకు నడిచి ముషిక నగరాన్ని హడలగొట్టినాయి. పదకొండోరాజ్య సంవత్సరంలో ప్రిథుఢనగరంపై దండెత్తినాడు. ద్రవిడ కూటమిని కూడ ఓడించినట్లు ఖారవేలుడు చెప్పుకున్నాడు. బహుశా ఖారవేలుని ఎదిరించడానికి ప్రిథుఢ నగర పాలకులు పొరుగున వున్న ద్రవిడరాజుల సహాయం అర్థించినారని, వారందరిని ఖారవేలుడు ఓడించినాడని చెప్పవచ్చు. విజయం సాధించిన తరువాత, పూర్వం జైనమతానికి జరిగిన పరాజయ పరాభవాలకు ప్రతీకారంగా ఖారవేలుడు ప్రిథుఢ నగరాన్ని 'గార్దభలాంగ' లాలతో దున్నించి వేశాడు. ప్రతీపాలపురానికి, అచటి బౌద్ధ స్తూపవిహారాలకు పునరుద్ధరణకు గాని పునర్నిర్మాణానికి గాని అవకాశం లేని విధంగా తీవ్రనష్టం సంభవించింది. భట్టిప్రోలు ప్రశస్తి క్రమంగా కాలగర్భంలో జీర్ణించిపోయింది.



# 9. ప్రాచీనాంధ్ర నగరాలు - విజయపురి

ప్రాచీనకాలము నుండి నగరాలే నాగరికతా సంస్కృతులకు వికాస కేంద్రాలుగా ఉంటూ వచ్చినై, 'నాగరికత' అనే మాటకు నగర జీవితవిధాన మనియే అర్థం.

క్రీస్తు పూర్వం నాలుగో శతాబ్దిలోనే ఆంధ్రులకు ముప్పది నగరాలు ఉన్నవన్న మెగస్తనీస్ మాటలు ఆంధ్ర నాగరికతా ప్రాచీనతకు నిదర్శనము. ఈ నగరాలలోనివే ధాన్యకటకం, ప్రతీపాలపురం, తామ్రాస, కొండాపూర్ మొదలైనవి. ఆంధ్ర నగరాలలో అధికభాగం నదీ మైదానాలలో నదీతీరాలలోను ఉండడం గమనింపదగిన విశేషము. ఇందుకు ముఖ్యకారణం ప్రాచీరాంధ్రులు సాగించిన విదేశవాణిజ్యము. నదులే ప్రయాణ సాధనాలుగా నుండడం రెండో కారణం.

మెగస్తనీస్ పేర్కొన్న ప్రాచీన నగరాలలోనిది కాక పోయినప్పటికీ ఆంధ్రుల చరిత్రలో అద్వితీయ స్థానం ఆక్రమించింది విజయపురి. నాగార్జునకొండగా సుప్రసిద్ధమైన శ్రీపర్వత పశ్చిమపాదంలో ఉత్తరవామినియైన కృష్ణానదీ తీరాన వెలసినదీ నగరం. శ్రీపర్వతం సుప్రసిద్ధ బౌద్ధక్షేత్రమే గాక శిల్పకళాక్షేత్రము. ఇచటి మహాచైత్య సంఘారామాలను యజ్ఞశ్రీ శాతకర్ణి నిర్మించి నాగార్జునాచార్యులకు బహూకరించినట్లు ఐతిహ్యము. యజ్ఞశ్రీ అనంతరం విజయ శాతకర్ణి వైశాఖ పూర్ణిమనాడు తన పేరనే విజయపురిని నిర్మించి అచట తనకు సామంతులుగా ఇక్ష్వాకులను నెలకొల్పి ఉంటాడు. ఇది క్రీస్తుశకం రెండు వందల సంవత్సరాల ప్రాంతంలో జరిగింది. పశ్చిమ దిశలో కృష్ణానది తూర్పున శ్రీ పర్వతము, దాని నానుకొని మహారణ్యము ఉండి జలగిరి వనదుర్గాల సౌకర్యంతో దుర్భేద్యమైనమహానగరంగా రూపొంది ప్రశస్తమైన చరిత్రకు రంగస్థలమైనది విజయపురి. ఈ నగర చరిత్ర కేవలం ఐదారు పురుషాంతరాలకు మాత్రమే పరిమితమైన స్వల్ప చరిత్ర; కాని అది ఆంధ్ర సంస్కృతీ పరిణామంలో ముఖ్యమైన తొలిఘట్టాల చరిత్ర. ఆ

స్వల్పకాల వ్యవధిలోను దక్షిణాపథ రాజకీయ విప్లవాలలో కీలకపాత్రను నిర్వహించింది విజయపురి.

శాతకర్ణి పోషణలో విజయపురి బౌద్ధనగరంగా అవతరించింది. కాని అచిరకాలంలోనే ఇక్ష్వాకు వంశాధీశుడైన శ్రీ ఛాంతమూలుడు సాతవాహన వంశాన్ని నిర్మూలించి ఇక్ష్వాకు స్వాతంత్ర్య పతాకతోబాటు విజయపురిలో వైదిక మత విజయపతాకను గూడ ప్రతిష్ఠించినాడు. అశ్వమేధాది వైదిక క్రతువు లొనర్చినప్పటికీ ఛాంతమూలుడు మహాసేన విరూపాక్షపతి భక్తుడు, గోశతసహస్ర హలశతసహస్రములను దానంచేసి విజయపురి ఐశ్వర్యవైభవాలకు దోహదం చేసినాడు. మహాకారుణిక సిద్ధాంతానికి ప్రతీక అయిన బౌద్ధ స్తూపచ్ఛాయలో నీతడు నిర్మించిన అశ్వమేధ వేదిక మత సహనానికి నిదర్శనంగా చరిత్రకారులు పేర్కొంటారు.

శ్రీ ఛాంతమూలుని కుమారుడైన వీరపురుషదత్తుని అభిమానమతం ఏదో తెలియదుగాని అతని రాణివాసం వివిధ బౌద్ధమత శాఖలను పోషించినారు. తిరిగి శ్రీపర్వత ప్రాగ్భాగం విహారాలతో స్తూపచైత్యాలయాలతో దూరదేశాగత తైర్థికులతో కళకళ లాడింది. నాగార్జునాచార్యుల మహాయాన సందేశం దేశాంతరాలకు ప్రసరించింది. కాని వైదికమతంలో భక్తి ప్రవేశించి కర్మకాండలు వెనుకాడినట్లే బౌద్ధంలో శీల సమాధి ప్రజ్ఞల స్థానాన్ని భక్తి ఆక్రమించింది. ఉభయమతాలకు సమానధర్మమైన భక్తి హిందువుకు బౌద్ధులకు సాన్నిహిత్యం చేకూర్చే వారధి అయింది. ఇది భారత దేశ చరిత్రలోనే విశిష్టమైన పరిణామము.

వీరపురుషదత్తుడు పూర్వ ఆంధ్ర సామ్రాజ్య వైభవాన్ని పునరుద్ధరించడానికి ప్రయత్నించినాడు. ఉత్తరాన ఉజ్జయిని మొదలు దక్షిణాన బనవాసి వరకు ఉన్న రాజలోకం ఇక్ష్వాకులతో బంధుత్వం కలుపుకున్నారు. విష్ణుకుండిన చాళుక్యాదులు వారికి సామంతులైనారు. విష్ణుకుండినులు శ్రీపర్వత స్వామి పాదభక్తులు; చాళుక్యులు హారీతి పుత్రులు. హారీతి బౌద్ధుల సంతాన దేవత. నాగార్జున కొండ లోయ ప్రవేశంలోనే విజయపురిని తిలకిస్తూ హారీతి దేవాలయం ఉంది. ఈ ఆలయము ఇతర శాసనస్థ

సమాచారము చాళుక్యుల జన్మస్థలం విజయపురి ప్రాంతమేనని నిర్ధారణ చేస్తున్నది. దక్షిణాపథ ఆధిపత్యానికి సాతవాహన ఇక్ష్వాకువంశాలకు వారసులైనారు చాళుక్యులు.

హారీతిని చాళుక్యులు తమతోబాటు హిందూమతంలో కలిపినట్లు కనిపిస్తుంది. సంతానార్థులైన స్త్రీలు హారీతికి గాజులు సమర్పించేవారు. హారీతిని విస్మరించి ఆంధ్ర స్త్రీలోకం నేటికీ ఈ సంప్రదాయాన్ని పాటిస్తూనే ఉంది.

వీరపురుషుని కుమారుడైన ఎహువలుని కాలానికొక వైశిష్ట్యం ఉంది. అతని కాలంలో విజయపురిలో దేవాలయ నిర్మాణం విరివిగా సాగింది (క్రీ.శ. 275). వానిలో సర్వ దేవాధివాసం అనే పుష్పభద్రాలయం సుప్రసిద్ధము. ఈతని కాలంలోనే ఇక్ష్వాకులకు ఆభీరులతో మైత్రి ఏర్పడింది. ఆభీరులు వైష్ణవులు, ఆభీరవసుసేనుని సేనాపతి విజయపురిని దర్శించి అచట అష్టభుజనారాయణుని ప్రతిష్టించినాడు. విష్ణుమూర్తి విరాట్ స్వరూపమే అష్టభుజస్వామియని భాగవత పురాణం నుండి తెలుస్తున్నది. ఈ విధంగా ఆంధ్రుల రాజధాని అయిన విజయపురిలో భాగవతమతం సుప్రతిష్ఠితమయింది. హిందూబౌద్ధాలతో బాటు శైవవైష్ణవాలకు సహజీవన సూత్రాన్ని నేర్పింది విజయపురి.

ఎహువలుని కాలంలో ప్రారంభమైన ఇక్ష్వాకు పల్లవ సంఘర్షణ అతని కుమారులైన రుద్రపురుష, వీరపురుషుల కాలంలో తీవ్రరూపాన్ని దాల్చింది. తమకు ప్రత్యర్థులైన కదంబులకు సాయము చేశారనే సాకుతో పల్లవులు దండెత్తి వచ్చి ఇక్ష్వాకు వంశాన్ని తుదముట్టించి విజయపురిని పరశురామప్రీతి గావించినట్లు కన్పిస్తుంది. అంతటితో శ్రీపర్వత విజయపురి ప్రతిష్ట అంతరించింది.

క్రమంగా నామరూపాలులేక కాలగర్భంలో కలిసిన విజయపురి పేరు నాగార్జునకొండ శాసనాల ద్వారా 1970 ప్రాంతంలో చరిత్ర పుటలకు ఎక్కింది. నాగార్జున సాగర్ పథకంతో 1952నుండి సాగిన పురాతత్త్వఖననాల ఫలితంగా విస్తృతమైన శిథిలాల రూపంలో తిరిగి అవతరించింది విజయపురి. ఈ శిథిలాల నుండి ప్రాచీన విజయపురి స్వరూపాన్ని స్పష్టంగా గుర్తించడం కష్టం. ఐనప్పటికీ ఈ శిథిలాలను లౌకిక, మత

నిర్మాణాలుగా వర్గీకరణ చేయవచ్చు. లౌకిక నిర్మాణాలు చాలభాగం శ్రీపర్వత పశ్చిమ పాదంలోని దుర్గంలోనే ఉన్నాయి. దుర్గరక్షణలో నాగార్జునకొండ, పెద్దకుందేళ్ళగుట్ట కీలకములైనట్లు కనిపిస్తుంది. దుర్గప్రాకారంలో నాల్గువైపులా శిలాతోరణాలతో ద్వారాలు వానిని పరిరక్షిస్తూ కార్తికేయాలయాలు ఉండేవి. రాజప్రాసాదాలు శత్రుదాడులలో పూర్తిగా ధ్వంసమైనవని చెప్పవచ్చు. మిగిలిన నిర్మాణాలలో గమనింప దగింది రంగస్థలం లేక ప్రక్షాగారం. దుర్గానికి వెలుపల కృష్ణానదిపై గల రేవు ప్రాంతము, దాని సమీపంలోనే ఉన్న గోదాములు విజయపురి సాగించిన వాణిజ్యానికి నిదర్శనాలు.

మతసంబంధమైన నిర్మాణాలలో బౌద్ధహిందూ వర్గీకరణ కన్పిస్తుంది. బౌద్ధుల చైత్యవిహారాలను గురించి శిల్ప ప్రాభవాన్ని గురించి ప్రత్యేకించి చెప్పనక్కరలేదు. కాని వారి మహావిహారము, దానికి బహుశా అనుబంధంగా వెలసిన స్టేడియంవంటి స్నాతక సదస్సు, విశిష్టమైన నిర్మాణాలు.

బౌద్ధనిర్మాణాల నమూనాపైనే నిర్మింపబడినప్పటికీ హిందూ ఆలయాలలో ఆలయవాస్తువు పరిపక్వతనంది భావితరాలకు మార్గదర్శకమయింది.

ఈ విధంగా శిథిలాల రూపంలో నున్నప్పటికీ నాగార్జున కొండలోని నిర్మాణాలు విజయపురి రాజకీయ ఔన్నత్యాన్నే గాక లౌకిక ధార్మిక ఆధ్యాత్మిక రంగాలలో నాటి ఆంధ్రులు సాధించిన విజయపరంపరలను ప్రతిఫలింపజేస్తూ ఉన్నాయి. ఒక్కమాటలో ఆంధ్ర సంస్కృతి ఆటాపాటా నేర్చిన గురుకులమే విజయపురి.



---

ఆకాశవాణి విజయవాడ కేంద్రం సౌజన్యంతో

బుద్ధగయ చెంత అశోకుడు తొలిపించిన లోమశరుషి, సుదామ గుహలను బోలి చాలా ప్రాచీనమైనది. ఈ తీర్థం భక్తులను విశేషంగా ఆకర్షించేది అనడానికి ఇచట కన్పించే పెక్కు ఉద్దేశిక స్తూపాలే నిదర్శనము.

## అమరావతి

దక్షిణాపథ బౌద్ధ క్షేత్రాలన్నింటికీ తలమానికము అమరావతి. అమరావతిని బౌద్ధ సారస్వతము, శాసనాలు, ధాన్యకటకం అని వ్యవహరిస్తాయి. శాతవాహనులకు రాజధానిగా భావింపబడే ధాన్యకటక నగరంలో స్తూప ఆరామ శోభితమైన ప్రాంతం 'అమరావతి'గా వ్యవహరింపబడి క్రమంగా అమరావతిగా రూపాంతరం చెంది స్థిరపడిందని భావించవచ్చు.

*శ్రీ ధాన్యకటకచైత్యే*
*జినధాతుర్ధరేభువి*

అనే మంజుశ్రీ మూలకల్ప వాక్యము, అమరావతిలో దొరికిన మౌర్యలిపిలోని శాసనాలు ఆధారంగా అశోకుడు నిర్మించిన అసంఖ్యాక స్తూపాలలో ధాన్యకటక మహాచైత్యం ఒకటి అని కొందరి అభిప్రాయం. అశోకునకు పూర్వమే ఇచట స్తూపం ఉండి ఉంటుందని మరికొందరు భావిస్తున్నారు. తృతీయ సంగీతి అనంతరం మహిష మండలంలో బౌద్ధ ధర్మ ప్రచారార్థమై అశోకుడు పంపిన మహాదేవభిక్షు అమరావతినే కేంద్రంగా చేసికొని ప్రచారం సాగించి ఉండవచ్చు. క్రమంగా అమరావతి మహా సాంఘిక శాఖయైన చైత్యకవాదానికి ప్రధాన కేంద్రమయింది. చైత్యకవాదంలో పూర్వశైల, అపరశైల లేక అపర మహావినశైల, ఉత్తర శైలశాఖ లేర్పడినాయి. ఆర్య మంజుశ్రీ నివాసంగా "గండవ్యూహ" పేర్కొన్న చిత్రమాలా ధ్వజవ్యూహ విహారమే పూర్వశైలమని అది అమరావతేనని కొందరి అభిప్రాయము.

చైత్యకవాదమే మహాయన సిద్ధాంతానికి పునాది అయింది. మాధ్యమిక వాదంపై మహాయానాన్ని సుప్రతిష్ఠితం చేసిన బోధసత్త్వ నాగార్జునాచార్యుడు అమరావతీ స్తూపానికి శిలాప్రాకారాన్ని నిర్మించినాడు. మహాయాన దశలోనే ఆంధ్రదేశంలో బౌద్ధం మూడు పూవులు ఆరుకాయలుగ వర్ధిల్లింది. అమరావతి బౌద్ధవిజ్ఞానానికి పీఠమై ప్రపంచ ఖ్యాతి నార్జించింది. చైనా యాత్రికుడైన హుయాన్‌సాంగ్ తాను ధాన్యకటక విహారంలో అభిధమ్మ

నిదర్శనం అక్కరలేదు. ఈ చారిత్రక పరిణామాలవల్లనే భారతీయ సంస్కృతిలో వలెనే ఆంధ్ర సంస్కృతిలో సైతం భిన్నత్వంలో ఏకత్వం ముఖ్య లక్షణమైంది.

భౌగోళికంగా ఆంధ్రదేశం ఆర్యనాగరికతా ప్రసార కేంద్రమైన ఉత్తరాపథానికీ ద్రావిడ నాగరికతా పీఠమైన దక్షిణాపథానికీ మధ్య వారధిగా కీలకస్థానంలో ఉంది. ప్రాచీన కాలంలో ఉత్తర దక్షిణాపథాల మధ్య సుగమమైన మార్గం కూడా తూర్పు తీరప్రాంతంలోనే అంటే ఆంధ్రదేశం గుండానే ఏర్పడింది. ఉత్తరదేశ చక్రవర్తులు ఈ మార్గాన్నే దక్షిణ దిగ్విజయ యాత్రలు సాగించారు. ఇక మహారాష్ట్రం మీదుగా శకయవనాది జాతులు ఆంధ్రదేశంలో ప్రవేశించారు. అందుచే ఆంధ్రదేశం సాంస్కృతికంగా త్రివేణీ సంగమమై ఆంధ్రులలో సంకుచితత్వాన్ని నిర్మూలించింది. తాము ఆర్యులా ఆర్యేతరులా, అన్న సందేహం ఆంధ్రులలో ఉదయించడానికి బలవత్తరమైన వివిధ సాంస్కృతిక ప్రభావాల ఫలితమేననడంలో పొరబాటు లేదు.

ఆంధ్రదేశానికి సుదీర్ఘమైన తీరరేఖ ఉన్నందున ఆంధ్రులు అనాదిగా నౌకాయానంలో ఆరితేరి ప్రాక్పశ్చిమ దూరదేశాలతో వాణిజ్యం సాగించారు. నూతన భావాలతో నాగరికతలతో పరిచయ మేర్పరచి విదేశ వాణిజ్యం ఆంధ్రులలో మానసిక వికాసాన్ని సమతాభావాన్నీ కలిగించింది.

ఈ విభిన్న అనుభవాలనూ వివిధ సాంస్కృతిక ప్రభావాలనూ జీర్ణించుకొనటంలో ఆంధ్రులకు మరొక మహత్తరశక్తి తోడ్పడింది. అదే తథాగతుడు బోధించిన బౌద్ధసిద్ధాంతం. శాంతి అహింస సమతా సూత్రాలపై విశ్వ సౌందర్య నిర్మాణ ప్రణాళికయే బౌద్ధ దర్శనం. అట్టి బౌద్ధానికి ప్రప్రథమం నుండి ఆంధ్రులు నివాళి పట్టారు. తమ దేశాన్ని ఒక పెద్ద బౌద్ధ ధర్మ కేంద్రంగా చేశారు. బౌద్ధ ధర్మామృత సేచనతో ఆంధ్రులలో సంకుచితమైన అహంకారాలు పూర్తిగా సమసినాయి. ఉదారభావ ప్రబోధితులై సమన్వయ సూత్రంపై నూతన జీవిత విధానం రూపొందించుకొని సమైక్య జాతిగా తయారైనారు. నాడు ఆంధ్రజాతి సాధించిన ఆంతరంగిక సౌందర్యానికి ప్రతిబింబాలే అమరావతీ నార్జునకొండ శిల్పాలు.

సర్వాంగ సుందరమైన అమరావతీ శిల్పం వలెనే ఆంధ్ర భాష ఆంధ్రుల ఔదార్యానికీ, హృదయ మార్దవానికీ దర్పణమైంది. సంస్కృత భాషా పదాలనేగాక విదేశీ పదాలను సైతం స్వీయ ఛందస్సులలో మలచి తన సౌకుమార్యాన్ని అలవరచి శ్రవణపేయంగా రూపొందించగల మార్దవ గుణం తెనుగుభాష ప్రత్యేకత. అందుచేతనే బ్రౌన్ వంటి పాశ్చాత్య విద్వాంసులు ఆంధ్రభాషకు బ్రహ్మరథం పట్టారు. భారతదేశానికి జాతీయ భాష కాగల అర్హత తెనుగుభాషకే గలదంటూ జె.బి.ఎస్.హాల్డేన్ వంటి శాస్త్రకారులు చాటి చెప్పడానికి గూడ అదే కారణం.

చరిత్రోదయ కాలం నుండీ, ఆంధ్రదేశంలో అనేక మత సాంస్కృతిక ఉద్యమాలు జరిగినై. ప్రగతిశీలమైన ఆంధ్రుల సమరసభావమే ఆ ఉద్యమాలకు కారణమైంది. పలు రకాల సంకుచితతత్వాల నుండి జాతికి విముక్తి ప్రసాదించటమే వాని లక్ష్యం.

బౌద్ధ మతాన్ని పునరుజ్జీవితం చేసి విస్తృత ప్రజాదరణ చేకూర్చిన మహాయాన సిద్ధాంతానికి ఆంధ్రదేశమే జన్మ భూమి. "లోకాస్సమస్తాస్సుఖినోభవంతు" అనే ఉదాత్త ఆశయంతో విశ్వకల్యాణ సాధనకై శ్రమించాలనే దీక్షను ప్రబోధించే మహాకారుణిక సిద్ధాంతమే మహాయానం. భక్తికీ జ్ఞానానికీ, విశ్వాసానికీ - వివేచనకూ సమన్వయం సాధించింది మహాయానం.

అదేవిధంగా హిందూమతం పునాదులను విస్తృతమొనర్చి సర్వజనాంగీకృతం చేయగల మార్దవాన్ని చేకూర్చిన పౌరాణిక మతోదయం జరిగింది ఆంధ్ర సాతవాహన చక్రవర్తుల పోషణలోనే. వైదిక దేవతలైన ఇంద్రాది లోకపాలకులతో బాటు సంకర్షణ వాసుదేవాది ఆగమిక దేవతల ప్రార్థనతో ప్రారంభమైన నానాఘట్ శాసనంతోనే బ్రాహ్మణ మత సంస్కరణోద్యమానికి ప్రారంభోత్సవం జరిగింది. ఈ శాసనాన్ని వేయించిన నాగనికా అశ్వమేథ రాజసూయాది వైదిక క్రతువులొనర్చి దక్షిణాపథపతియైన శ్రీ శాతకర్ణి మహారాణి. శాతవాహనులకు వారసులైన ఇక్ష్వాకు చక్రవర్తులు యజ్ఞాదులొనర్చి వైదిక మతోద్ధరణ సంకల్పించారు. వారి మహారాణులు మహాయాన బౌద్ధాన్ని పోషించారు. తాము చేసిన పుణ్య కార్యాల ఫలం విశ్వమానవ సముద్ధరణకు తోడ్పడాలని ఆశించారీ మహారాణులు!

తత్ఫలితంగా నాగార్జున కొండలోయలో ఒకవైపు అష్టభుజ, పుష్పభద్ర, కార్తికేయ, సర్వదేవాది వాసములు, మరొకవైపున చైత్య విహార సంఘారామాలు, బుద్ధధాతు గర్భిత మహాచైత్యచ్ఛాయలోనే అశ్వమేథ వేదిక వెలసినాయి. ఆంధ్రజాతి జీర్ణించుకొన్న సహనానికీ, సహజీవన శీలానికీ నాగార్జునకొండ అపురూపమైన చిహ్నంగా చారిత్రకులు పేర్కొంటారు.

మధ్యయుగంలో వీరశైవ, వీరవైష్ణవ ఉద్యమాలకు ఆటపట్టు అయింది ఆంధ్రదేశం. మతంలోనూ, భాషలోనూ సమూలమైన మార్పులను ఉద్దేశించిన ఈ ఉద్యమాలు వీరవైష్ణవానికి నాయకుడైన పలనాటి బ్రహ్మన్న చాపకూడు. పంచమ దేవాలయ ప్రవేశము, వర్ణాంతర వివాహాలు మున్నగు విప్లవాత్మక సంస్కరణలు చేశాడు. పంచములకు 'దాసరు' లని నామకరణం చేసి గాంధీ మహాత్ముని 'హరిజన' పదాన్ని నాడే ఊహించాడు. బ్రహ్మన్న సంస్కరణలు యావద్భారతంలోనే నాటికి అపూర్వాలనడం నిర్వివాదాంశం. ఐతే ఈ సంస్కరణలు వైదిక భక్తి మార్గాల మధ్య సామరస్యం కూర్చే ఉద్యమ ప్రభావం వల్ల నీరసించినాయి.

భక్తిమీద వలపు బ్రహ్మంబుతో పొత్తు
బాయలేను నేను బసవలింగ।

అంటూ కర్ణాటక వీరశైవోద్యమ నాయకుడైన బసవేశ్వరునకు ఆంధ్రనాయకుడైన మల్లికార్జున పండితారాధ్యుని సమాధానము. అదే నాటి ఆంధ్ర ప్రజాభిప్రాయానికి దర్పణం. ఒకవైపు భక్తి బ్రాహ్మణ విధానాలకు, మరొకవైపు శైవ వైష్ణవాలకు సమన్వయం, సామరస్యం సాధింపబడినాయి. 'విష్ణురూపాయ నమశ్శివాయ' అంటూ కవిబ్రహ్మ తిక్కన ప్రచారం చేసిన హరిహరతత్వం ఆంధ్రదేశంలోనే గాక దూర ప్రాచ్యదేశాలలో సైతం వైదికధ్యాయతను వెలకొల్పింది.

సంఘర్షణ ఆంధ్రుల స్వభావానికే విరుద్ధం; సామరస్యం వారి నైజగుణం. తిరిగి అక్బర్ పాదుషా కాలానికి తారస్థాయి నందిన హిందూముస్లిం సామరస్య ఉద్యమం ఆంధ్రుల హృదయాల్లో సానుభూతి తంత్రులను మీటినదనడానికి జగన్నాథ పండితరాయల

'ఢిల్లీశ్వరోవా జగదీశ్వరోవా'

నినాదమే నిదర్శనము. తెనుగుల సహన సౌశీల్యమే, కుతుబ్ షాహీలకు పట్టుబడింది.

మాలిక్ ఇబ్రాహీం కుతుబ్ షాను తెనుగు కవులు 'మల్కి భరాం' అని కీర్తించారు. అతని వంశీయుడే ఐన తానీషా రామభక్తుడై భద్రాద్రీశునకు ముత్యాల 'తలంబ్రాలు' పోసే కట్టడి చేశాడు. ఇంతటి ఉదాత్త సహజీవన ఫలితంగానే తురకలను హిందూ సమాజంలో ఒక కులంగా పేర్కొన్నాడు హంస వింశతి కావ్యకర్త.

పందొమ్మిదో శతాబ్ది ఆరంభంలోనే దేశంలో నవచైతన్యానికి, విజ్ఞాన పునరుజ్జీవనం అవసరమని ప్రబోధించిన గాజుల లక్ష్మీనరసింహశెట్టిని 'మద్రాస్ రామమోహన్‌రాయలు' అని కీర్తించారు. ఆ తరువాత జాతీయ స్వాతంత్ర్య సంగ్రామంలోనూ, సంఘసంస్కరణోద్యమాలలోనూ, ఆంధ్రులదే అగ్రతాంబూలం! గాంధీజీ ఆదేశానుసారం, దేశస్వాతంత్ర్యంపై దృష్టిని కేంద్రీకరించి ఆంధ్రరాష్ట్ర సమస్యను వాయిదా వేయడంలో ఆంధ్రులు ఎంతో త్యాగాన్ని సౌజన్యాన్నీ ప్రదర్శించారు. స్వరాష్ట్ర సిద్ధికై శ్రీ పొట్టి శ్రీరాములొనర్చిన అపూర్వ ఆత్మార్పణం సత్యాగ్రహ సమర విధానానికి పరాకాష్ట. మద్రాసు, గంజాం, బళ్ళారి, సమస్యల పట్ల ఆంధ్రుల వైఖరి వారి శాంతి కాముకత్వానికి ఉదాత్త రాజకీయ చైతన్యానికీ గీటురాయి. ఇంతటి ఉదారగుణ సంపన్నమైనందునే దక్షిణ దేశవాసియైన అప్పయ్య దీక్షితులు సైతం

ఆంధ్రత్వమాంధ్ర భాషాచ<br>
ప్రాభాకర పరిశ్రమః<br>
తత్రాపియాజుషీశాభా<br>
నాల్పస్యతపసః ఫలమ్"

అంటూ ఆంధ్ర జాతీయతకు జోహారులను అర్పించినాడు.



---

ఆకాశవాణి విజయవాడ కేంద్ర సౌజన్యంతో

# 11. ఆంధ్ర సంస్కృతీ వికాసము - కాకతీయ యుగము

ఆంధ్రుల రాజకీయ జీవితంలో తెలుగు సంస్కృతీ పరిణామ చరిత్రలో కాకతీయ యుగానికి ఒక వైశిష్ట్యం ఉంది. అన్మకొండ - ఓరుగల్లు ప్రాంతంలో చిరకాలం సామంతులుగా ఉంటూ తమ సార్వభౌములైన చాళుక్యులు బలహీనులైనంతనే విజృంభించి ఆంధ్రదేశానికి కాకతీయులు ఏకచ్ఛత్రాధిపత్యం వహించినారు. ఈ వంశంలో ముఖ్యంగా గణనీయులైన రుద్రదేవ, గణపతిదేవ, రుద్రాంబ, ప్రతాపరుద్రులు పన్నెండో శతాబ్దం మధ్యనుండి పదునాల్గో శతాబ్దంలో రెండున్నర దశాబ్దాల వరకు పరిపాలించినారు. ఈ రెండు శతాబ్దాల కాలంలోనే తెలుగుజాతి సమైక్యమై తన సంస్కృతికి రూపురేఖలు దిద్దుకొన్నది.

నాటి వరకు ఆంధ్రేతర సామ్రాజ్య భాగాలుగా చిన్నాభిన్నమైయున్న తెలుగు మాగాణము లన్నింటిని జయించి మహదాంధ్ర సామ్రాజ్యాన్ని స్థాపించినారు కాకతీయులు. నాటితో వేగినాడు, వెలగనాడు, పలనాడు, రేనాడు, పాకనాడు అన్న ప్రాంతీయాభిమానాలతో స్థానిక యుద్ధాలు రెచ్చగొట్టి, ప్రజాజీవితాన్ని సంక్షుభితం చేస్తున్న మాండలిక ప్రభుయుగం అంతరించింది. కాకతీయులు సముద్రాలతో పోల్చదగిన మహాతటాకాలు నిర్మించి పీఠభూమి ప్రాంతాలను సస్యశ్యామలం చేశారు. గోలుకొండ వజ్రాల గనులు దేశానికి రత్నగర్భ నామాన్ని సార్థకం చేసినాయి. మోటుపల్లి రేవు పట్టణం సాగించిన విదేశ వాణిజ్యం ద్వారా దేశంలోకి బంగారు నదులు ప్రవహించినాయి. సిరిసంపదలతో తులతూగిన నాటి ఆంధ్రభూమి మార్కోపోలో వంటి విదేశ యాత్రికుల నోరు ఊరించింది.

కాకతీయులు సాధించిన రాజకీయ శాంతి సమైక్యాలు ఆర్థిక సౌభాగ్యముల ఫలితంగా

తెలుగు ప్రజానీకంలో వినూత్నమైన జాతీయ చైతన్యం వెల్లివిరిసింది. తమ జాతి, తమ భాష, తమ దేశముల పట్ల వారిలో అభిమానము ఆత్మీయతాభావము గలిగినాయి. కవిబ్రహ్మ తిక్కన తన మహాభారతాన్ని 'ఆంధ్రావళి మోదముం బొరయునట్లుగ' తెనిగించినానని చెప్పుకున్నాడు. కాకతీయ యుగానికి అనతి కాలంలోనే జీవించిన వల్లభామాత్యుడు

'దేశ భాషలందు తెలుగు తెస్స'

అంటూ మురిసిపోయినాడు.

'శ్రీశైల భీమకాళేశ
మహేంద్రగిరి'

సంయుతమైన తమ మాతృభూమి

'దేశాస్సహస్రం భరతస్య ఖండే
దీవ్యంత్య ఖండాఖిల వస్తుశస్త్రాః
తేషాం శిరోభూషణమేవ దేశ
స్త్రీలింగనామా జగదేకసీమా'

అంటూ ఆంధ్రులు గర్వించినారు. తమ చక్రవర్తులను 'ఆంధ్రాధీశ్వర' అనీ 'ఆంధ్ర సురత్రాణ' అనీ అభిమాన నామాలతో పిలుచుకున్నారు. కాకతీయుల రాజధానియైన ఓరుగల్లు 'ఆంధ్ర నగరి'గా భాసించింది. ఈ విధమైన ఆత్మవిశ్వాసంతో కూడిన జాతీయాభిమానం ఆ జాతి పురోగతికి అత్యవసరమైనదని వేరే చెప్పనక్కరలేదు.

జాతీయాభిమానానికి కాకతీయ యుగంలో మతాభిమానం మెరుగులు దిద్దింది. నాడు దేశంలో వీరశైవ, వీర వైష్ణవ, స్మార్తమతోద్యమాలు నడిచినాయి. శాతవాహన యుగంలో బౌద్ధ ధర్మంవలె, కాకతీయ యుగంలో హిందూ మతశాఖలు ఆంధ్రుల కళాదృష్టికి కారణాలయినాయి. తెలుగుభాషలో అపారమైన సారస్వత సృష్టి జరిగింది.

కాకతీయ యుగంలో పాల్కురికి సోమనాథుడు ద్విపదలో రచించిన వీరశైవ కావ్యాలు ప్రాచీన తెలుగు వాఙ్మయంలో నిజమైన స్వతంత్ర కావ్యాలనడంలో అతిశయోక్తి లేదు. శైవులననుకరించి కాబోలు వైష్ణవులు ద్విపదలో రంగనాథ రామాయణాన్ని తయారు చేసుకున్నారు. ఇక స్మార్తుల ఇతిహాస పురాణాలను తెలుగులోనికి అనువదించి వేదమత సారాన్ని ప్రజలకు అందించడానికి ప్రయత్నించారు. శైవవైష్ణవాలు భక్తి ప్రధానాలయి విగ్రహారాధనపై నాధారపడినందున దేవాలయాలు మతానికి కేంద్రాలయినాయి. కాకతీయ సామ్రాజ్య వైభవానికి దీటుగా పిల్లలమర్రి, పాలంపేట, ఓరుగల్లు, అనుమకొండ దేవాలయాల నిర్మాణం జరిగింది. బౌద్ధయుగానంతరం ఆంధ్రదేశంలో పెద్దఎత్తున రమణీయమైన శిల్పసృష్టి జరిగింది కాకతీయ యుగంలోనే. దేవాలయాలు వాస్తు శిల్పాలకేగాక నాట్యసంగీత శాస్త్రాలకు పట్టుగొమ్మలయినాయి. గణపతి దేవుని గజసాహిణియైన జాయప రచించిన 'నృత్తరత్నావళి'లోని నాట్యభంగిమలను పాలంపేట రామప్ప దేవాలయంలో శిల్పాలుగా రూపొందించినారని ప్రతీతి.

దేవాలయాలతోబాటు శైవులు దేశం నలుమూలలా మఠాలు స్థాపించి ప్రజాసేవ చేశారు. శైవమఠాలలో దాహళ దేశం నుండి వచ్చిన గోళకీమఠం సుప్రసిద్ధమైనది. ఈ మఠానికి గుంటూరు జిల్లాలోని మందడం ప్రధాన కేంద్రం. ఇచటి మఠానికి అనుబంధంగా వేదపాఠశాల సత్రాలు, దేవాలయాలతోబాటు 'ప్రసూతి ఆరోగ్యశాల' ఉండడం గమనింపదగిన విశేషము.

మతాభిమానంలో వీరశైవులకు వారేసాటి. పేరుకు తగినట్టు వీరశైవులనేక సాహస కృత్యాలు చేసేవారు. 'గాలంపు గొంకి కంకాళ చర్మము గ్రుచ్చి ఉడువీధి నుయ్యేల లూగువారు'. తమదైవం కోసం కండలు కోసి ఇచ్చేవారు. తలలు కత్తిరించుకొనేవారు. మతం పేర, దేశం పేర తనువులు చాలించిన వీరుల గాథలతో పల్లెలు పట్టణాలు ప్రతిధ్వనించినాయి. వారి గాథల చిత్రపటాలను ప్రజలు ఇండ్లలో అలంకరించుకొని ఉత్సాహ ఉద్రేకాలు పొందేవారు.

వీరశైవ వీరవైష్ణవ మతాలు వర్ణవ్యత్యాసాలు లేని సమాజ స్థాపనకు కృషి చేసినాయి. వీరవైష్ణవోద్యమ నాయకుడైన పలనాటి బ్రహ్మన్న చాపకూడు, పంచముల దేవాలయ

ప్రవేశం వంటి తీవ్రవాద సాంఘిక సంస్కరణలు ప్రవేశపెట్టాడు. కాని ఈ ఉద్యమాల విజృంభణ కేవలం తాత్కాలికమే. క్రమంగా సనాతనము వేదహితమునైన స్మార్త ధర్మ ప్రభావం బలపడింది. ప్రముఖ దేవతల మధ్య సామరస్యాన్ని సాధించింది స్మార్తమతం; భక్తి జ్ఞాన వైరాగ్య మార్గాలను సమన్వయం చేసింది. ఆంధ్ర దేశంలో వీరశైవోద్యమ నాయకుడైన మల్లికార్జున పండితారాధ్యుడే

'భక్తి మీద వలపు బ్రాహ్మంబుతో పొత్తు

బాయలేను నేను బసవలింగ ।''

అని ప్రకటించినాడట. పరమ మహేశ్వర బిరుదాంచితుడైన రుద్రదేవుడు అనుమకొండలో తాను నిర్మించిన 'రుద్రేశ్వరమ'నే 'త్రికూటాలయం'లో శివునితోబాటు సూర్యుని, విష్ణుమూర్తిని ప్రతిష్ఠించి పూజించినాడు. గోళకీ మఠాధిపతియై గణపతి దేవునకు శివదీక్షా గురువైన విశ్వేశ్వర శివదేశికులు బ్రాహ్మణోత్తములను వైదిక విద్యలను పోషించినాడు. అద్వైత ధర్మప్రచారకుడై మహాకవి తిక్కనను ఆదరించినాడు. వాస్తవానికి నాటి సాంస్కృతిక సమన్వయ ఉద్యమం తిక్కన మహాకవి జీవితంలో పారమ్యాన్ని పొందింది. భాషలో, శైలిలో, మతంలో సామరస్యాన్ని సాధించినాడు తిక్కన. సంస్కృత భాషా గాంభీర్యాన్ని తెలుగు నుడికారపు మార్దవాన్ని ఇంచుమించు సమపాళంలో మేళవించి మార్గదేశీ విధానాలకు రాజీకుదిర్చి ఉభయ కవిమిత్రుడయినాడు. ఈ బాణీనే ఈ యుగంలోని ఇతర కవులు అనుసరించినట్లు కన్పిస్తుంది. అదేవిధంగా 'విష్ణురూపాయ నమశ్శివాయ' అంటే శివకేశవులకు భేదం లేదని శైవవైష్ణవుల మధ్య వారధిగా హరిహర తత్వాన్ని ప్రచారం చేసి, ఆంధ్రజాతి ఐక్యతకు భంగం రాకుండా కృషి చేసి విజయం సాధించాడ

ఈ విధంగా సమైక్య జాతీయ భావము సమరస సమన్వయదృష్టి తన విశ్వాసానికీ సిద్ధాంతానికీ ఆత్మార్పణ సైతం చేయగల ధైర్యస్థయిర్యాలు ప్రజా జీవితంలో సాధించిన కాకతీయ యుగస్మృతులు ఏయుగంలోనైనా ఆంధ్రుల సాంస్కృతిక పురోగతికి వెలుగుబాటగా సహకరింపగలవు.

---

ఆకాశవాణి విజయవాడ కేంద్ర సౌజన్యంతో

# 12. ఆంధ్రదేశంలో సంస్కరణ - హేతువాద ఉద్యమాలు

ఋగ్వేదములోని ఐతరేయ బ్రాహ్మణము ప్రకారం ఆంధ్రుల మూలపురుషుడు విశ్వామిత్రుడు. విశ్వామిత్రుడు వేద ఋషులలో అగ్నిశలాక. విశ్వామిత్రుని వ్యక్తిత్వము చరిత్ర విద్యార్థులకు ఒక చిక్కు సమస్య. ఋగ్వేద కాలంలో ఆర్యులకు వ్యతిరేకంగా దాస దస్యగణాల నాయకుడు; రామాయణ కాలం నాటికి ఆర్యమత ప్రచారకులు దక్షిణా పథం ప్రవేశించారు. వారి రక్షణార్థం ఉత్తర భారతదేశంలో రాజులను ఆశ్రయించాడు; తరువాతి కాలంలో వైదికమత మౌఢ్యం, ఆర్యుల జాత్యహంకారం, పూజారిగణ ఆధిపత్యం, బలులు, కుల అసమానతలు మున్నగు వానికి వ్యతిరేకంగా పోరాడిన విప్లవకారుడు. ఈ విషయాలను వశిష్టునితో అతని వైరము, సునస్సెప - త్రిశంకు ఉపాఖ్యానాలు స్పష్టం చేస్తున్నాయి. ఇంతటి ప్రతిభా సంపన్నుని నుండి ఆంధ్రులు విప్లవ భావాలను పుణికి పుచ్చుకున్నారు. సునస్సెప ఉపాఖ్యానంలో ఆంధ్రులు విశ్వామిత్రుని పైననే తిరుగుబాటు ప్రకటించినట్లు తెలుస్తోంది. క్రూరమైన పైతృక దండనలకు తలఒగ్గక ప్రకృతి సిద్ధమైన హక్కులను త్యాగం చేయటానికి యిష్టపడక ఆంధ్రులు దేశాంతరవాసాన్నే ఎంచుకున్నారు. ఆంధ్రజాతి విలక్షణమైన తొలిదశ యిదే!

ఇతిహాస కాలంలో ఆంధ్రులు కంసుని ఆస్థానంలో ఉన్నట్లు తెలుస్తోంది. ఆర్యరాజులలో, అర్థరహితమైన, నిందలకు తీవ్ర దుష్ప్రచారానికి గురయినవాడు కంసుడు. నిజానికి కంసుడు. ఆర్య - అనార్య వైషమ్యాలను అరికట్టే ప్రయత్నం చేశాడు.

కంసుని ఆస్థాన మల్లయుద్ధ ప్రవీణుడైన చాణూరుడు ఆంధ్రుడు. ఆర్యులకు అది కన్నెర్ర అయింది. వారి నాయకుడైన వాసుదేవుడు చాణూరుని, అతన్ని ఆదరించిన

కంసుని హతమార్చాడు. వాసుదేవుని ప్రియమైన బిరుదనామము "చాణూర ఆంధ్ర నిషుదన" సహస్రనామాలలో ఒకటి. ఈ చర్య ఆంధ్రులలో తీవ్ర ప్రతీకారాగ్నిని ప్రజ్వరిల్ల చేసింది. కురుక్షేత్ర సంగ్రామములో వాసుదేవునికి వ్యతిరేకంగా ఆంధ్రులు కౌరవ పక్షం వహించారు. ప్రజల్లో ఉన్న అభిప్రాయం ప్రకారం, పాండవులు భారతదేశంపై కొత్తగా దండెత్తి వచ్చిన విదేశీయులు; అంతకు పూర్వమే వచ్చిన కౌరవులను అంతమొందించి తమ జాతి అయిన యాదవులకు పట్టం కట్టాలని వాసుదేవుడు పాండవ పక్షాన చేరాడు. కానీ వాసుదేవుని కోరిక నెరవేరలేదు. కారణం సహోదర కలహాలతో యాదవులంతా మరణించారు. అదే సమయంలో వాసుదేవుడు ఒక నిషాదుని బాణంతో చాలా హేయంగా హతుడయాడు. చాణూర హత్య ప్రతీకారానికి వేచియున్న ఆంధ్రుడే ఆ నిషాదుడయి ఉండవచ్చునేమో! మనువు ఆంధ్రులను 'నిషాదులు' అన్నాడు.

ఇతిహాస కాలంలో వైదికమతము ఆంధ్రదేశంలో ప్రబలంగా వుండేది. వైదిక మత విషయలోలతకు వ్యతిరేకంగా దేశమంతటా సన్యాసాశ్రమ విధానము అభివృద్ధి చెందింది. శ్రమణుల, పరివ్రాజకుల విధానము ఆర్యేతరమయినది. అపస్తంబుడు, బేధాయనుడు మున్నగు ఆర్యసూత్రకారులు ఆ విధానాన్ని నిరసించారు. దర్శనాల జిజ్ఞాస లోకాయత లౌకికతత్త్వము, దక్కనులో బహుళ ప్రజాదరణ పొందాయి. వైదిక వాఙ్మయం ప్రతిపాదించే కఠోర నియమాలకు విసుగుచెందిన ఔత్తరాహులు కోకాయత, ఇతర దర్శనాల అధ్యయనానికి దక్షిణాపథం వచ్చేవారు. శ్రమణులు పరివ్రాజకులు దేశమంతటా సంచరిస్తూ ప్రజల మధ్య నివశిస్తూ ఉండేవారు. కర్మకాండల నిరుపయోగాన్ని విశదం చేసేవారు; వ్యక్తిగత నైతికత, సాంఘిక సమానత - సౌహార్ద్రతల ఆవశ్యకతను వివరించేవారు. ఆ విధమైన మేథా సంపదతో కూడిన వాతావరణం బౌద్ధజైనాల వ్యాప్తికి అనుకూలం అయింది. ముఖ్యంగా బౌద్ధం గహపతుల, వణిక్ప్రముఖుల, చర్మకారులతో సహా యితర వృత్తి పనివారల ఆదరణ పొందింది. ఆంధ్రదేశంలో బౌద్ధము 'పామర జనుల మతము' అయింది.

బౌద్ధమత ఉదారభావం ఆంధ్రులను ఏకం చేసింది. సుఖసంతోషాలతో కూడిన

జీవితంపై ప్రేమనిచ్చింది; ఆశావాదాన్ని రేకెత్తించింది. సాహసించాలనే స్ఫూర్తినిచ్చింది; అమరావతి నాగార్జున కొండలలోని కళాత్మక శిల్ప సంపదను సృజింపచేసింది; క్రీస్తు శకారంభ శతాబ్దంలోనే నౌకావాణిజ్యాన్ని పెంపొందించింది.

గౌతమ బుద్ధుని హేతుబద్ధమైన 'ప్రతిత్య సముత్పాద' సిద్ధాంతము సమస్త మానవాళికి నిర్వాణము ప్రాతిపదికతో మహాయానముగా రూపొందింది. మహాయానాన్ని దర్శనంగా రూపొందించిన ఆచార్య నాగార్జునుడు శ్రీ పర్వతము (నాగార్జున కొండ)లో చాలా కాలం నివసించాడు. నాగార్జునాచార్యుడు తనను ఆదరించిన శాతవాహన రాజునకు సర్వమత సహనము, మరణశిక్ష రద్దు, అనాథులకు, వ్యాధిగ్రస్తులకు దరిద్ర నారాయణులకు ఉచిత ఆహార గృహవసతి సౌకర్యాలు మున్నగు సంస్కరణలను ప్రతిపాదించాడు. ఇవి శ్రేయోరాజ్య సిద్ధాంతానికి పునాదులయిన సంస్కరణలు. బౌద్ధ జైనమతాలు అవిద్యను, అజ్ఞానాన్ని తొలగించే ప్రయత్నం చేశాయి. అంధ విశ్వాసాలను ఖండించాయి. 10వ శతాబ్దంలో కరీంనగర్ జిల్లాలో నివసించిన జైన రచయిత ఈ క్రింది ఆచరణలను మూర్ఖమైనవిగాను, పనికిమాలినవి గాను వర్ణించాడు.

సూర్యగ్రహ్యో గ్రహణ స్నానం
సంక్రాంతౌద్ర వినవ్యయాః
సంధ్యాదేవాగ్ని సత్కారో
గౌహదేహార్చనో విధిః
నదీనద సముద్రేషు
మజ్జనం ధర్మచేతసం
తరుస్తూ పాగ్ర భక్తానాం
వందనం భృగు సంస్రయాః
గోపుస్తంతు నమస్కారం
తన్మూత్రస్య నిషేవనం

రత్నవహన భూయక్షా

శస్త్ర శైలాది సేవనం

ఇవి నేటికీ సజీవంగానే ఉన్నాయి. విద్యాధికులు (?) కూడా వీటిని పవిత్రంగా భావించి ఆచరించటం ఎంతటి దౌర్భాగ్యం?

బౌద్ధ జైనమతాల క్షీణత, వైదికమత పునరుద్ధరణ దాదాపు ఒకేసారి జరిగినాయి. సాంఘిక అసమానతలు, ఆధ్యాత్మిక, అరాచకత్వముతో కూడిన వైదికమత పునరుద్ధరణను ఆంధ్రదేశం తీవ్రంగా ప్రతిఘటించింది. వీరశైవ, వీరవైష్ణవ ఉద్యమాలు ఈ ప్రతిఘటనకు కారణం. వీరశైవ వీరవైష్ణవ ఉద్యమాలకు అవైదికమైన భక్తితత్వము, బౌద్ధ జైనమతాలలోని విప్లవభావాలు స్ఫూర్తినిచ్చాయి. శైవులు, వైష్ణవులు బలులను యితర కర్మకాండలను ఖండించారు; కులాలను నిరసించారు. సమానతా ప్రాతిపదికపై సంఘ పునర్నిర్మాణాన్ని వాంఛించారు. శైవకవి పాల్కురికి సోమన కులాన్ని గురించి అడిగిన వారి నాలుకను నరకమన్నాడు. అందరిదీ ఒకే కులమనీ - అదే 'భక్త కులము' అని చాటాడు. (ముఖ్యంగా శైవ) కవులు సాంప్రదాయకమైన మార్గ ఛందస్సును వీడి స్థానికమైన 'దేశి' ఛందస్సును అనుసరించారు. పల్నాటి రాజుల మంత్రి క్రీ॥శ. 12వ శతాబ్దం వాడు అయిన బ్రహ్మనాయుడు వీరవైష్ణవ ఉద్యమ నాయకుడు. చాపకూడు, కులాంతర వివాహాలు, పంచములకు దేవాలయ ప్రవేశము మున్నగు హేతుబద్ధమయిన సంస్కరణలు ప్రవేశపెట్టాడు. పంచములకు బ్రహ్మన్న '(హరి) దాసరులు' అని పేరు పెట్టాడు. (మహాత్ముని హరిజనుల నామాన్ని శతాబ్దాల పూర్వమే ఊహించాడు) బ్రహ్మనాయుడు ప్రవేశపెట్టిన సాంఘిక సంస్కరణలు మధ్యయుగ భారతదేశములో ఏ ఇతర ప్రాంతములోనూ ప్రవేశపెట్టబడలేదు. శైవుల - వైష్ణవుల మధ్య విభేదాలు అంతర్గత కుమ్ములాటలతో ఈ ఉద్యమం అంతరించింది. ఇదే సమయంలో భక్తితత్వానికి వైదిక మతకుల తత్వానికి మధ్య సయోధ్య ప్రయత్నాలు ఉధృతమయాయి. పండితారాధ్యుడు, తిక్కన సోమయాజి మున్నగు ప్రసిద్ధ కవులు ఆ ప్రయత్నాలకు మార్గ దర్శకత్వం వహించారు. ఫలితంగా విప్లవం విఫలం అయింది; ప్రతీపశక్తులు విజయం సాధించాయి.

హిందూ ప్రజ ఇస్లాముదాడికి తలవొగ్గటానికి వారి రాజకీయ అనైక్యత మాత్రమే కాదు. సాంఘిక, మత అనైక్యతలు కూడా ప్రధాన కారణాలే. మౌలిక ఐక్యత గురించి ఎంత చెప్పినా హిందూమతం సంఘటిత పరచే మతం కాదని, సంఘాన్ని విభజించటమే దాని సూత్రమనేది యదార్థం. ముస్లిముల ఉదారభావం వారి పాలనా కాలపు తొలిదినాలలోనే గ్రహింపునకు వచ్చి హిందూమతంలోని అసమగ్రత గుర్తింపబడింది. ఫలితంగా ఒక సాంఘిక ఉద్యమం రూపుదాల్చింది. శాఖాపరమైన, కులపరమైన శక్తులను తొలగించి మత సహనము, సుహృద్భావము, సాంస్కృతిక సమైక్యత పునాదులపైన హిందూమతాన్ని ఉద్ధరించే కార్యక్రమం మొదలయింది. పధ్నాలుగవ శతాబ్దపు తొలిదశ నుండి, ముస్లిం ఆధిపత్యపు దుష్ఫలితాలను ఆంధ్రదేశం చవిచూసింది. దేశవ్యాప్తంగా ప్రజ్వరిల్లిన సాంఘిక, మత విప్లవోద్యమాలకు స్పందించింది. ఆంధ్రదేశ సాంఘిక వాఙ్మయ చరిత్రలో విలక్షణ స్థానాన్ని పొందిన వేమన యోగిని ప్రసాదించింది. ఆంగ్ల పాలకుల దృష్టిని ఆకర్షించిన మొదటి యోగులలో వేమన ఒకడు. ఆంగ్లానువాదం పొందిన తొలి భారతీయ రచనలలో వేమన రచనలు చోటు చేసుకున్నాయి.

సంస్కరణ యోగిగా వేమన ఆ నాటి పరిస్థితులకు ఎంతో అవసరం అయిన వ్యక్తి. అతడు విద్యావేత్త కాడు; అనారోగ్యకరమైన పునరుజ్జీవన పోకడలకు దూరంగా ఉన్నాడు. మానవ స్థితిగతులను నిశితంగా పరిశీలించాడు; ఘాటయిన విమర్శలు చేశాడు. హిందూసమాజంలోని గర్హనీయ పరిస్థితులు అతనిని బాధించాయి. అంధవిశ్వాసాలు, నిరుపయోగమైన కర్మకాండలు, స్వార్థపూరిత దొంగ పూజారులు, శాఖాద్వేషాలు, కులాల కుమ్ములాటలు సమాజపు ప్రధాన అంగాలను విషపూరితం చేశాయి. సమకాలీన సాంఘిక, ఆధ్యాత్మిక సమస్యలకు అతని పరిష్కారాలు నీతితోనూ, మానవత్వపు విలువలతోనూ కూడియున్నాయి. వేమన హేతుబద్ధమైన నైతికవాది.

వేమన తన భావాలను చక్కని చిక్కని పామర జన భాషలో ప్రజల నాలుకపై ఆడే ఆట వెలది ఛందస్సులో చెప్పాడు. వందల కొలది పద్యాలను చెప్పాడు. అతని అనుయాయులెవరు? ఎందరు? అనేది తేలని సమస్య. వేమన పద్యాలను కొన్నిటినైనా

కంఠస్థంగా రాని ఆంధ్రుడుండడనటం అతిశయోక్తి కాదు. అతని సూక్తులను ఎన్నిటిని ఎందరు ఆచరించారనేది ప్రశ్నార్థకమే. 'భారతీయులు సిద్ధాంతకారులే కానీ ఆచరణ బద్ధులు' కారనేది కఠోరసత్యం. యోగి పుంగవులను, సంస్కర్తలను మాటల్లో గౌరవిస్తాము; చేతల్లో ఆచరించము.

17-18 శతాబ్దాలలో భారతదేశం కులమత విద్వేషాలకు ఆలవాలమయింది. రాజకీయ మేధావి వర్గాలలో అరాచకం ప్రబలింది. ఆంగ్ల రాజ్యస్థాపనకు మార్గం సుగమం అయింది. భారతీయులు అంతకు మునుపెన్నడూ అనుభవించని రాజకీయ అణచివేతకు, ఆర్థిక దోపిడీకి ఆంగ్ల పాలనా కాలంలో గురి అయినారు. కానీ కొంత మంచి జరిగింది; ఆంగ్లభాష, పాశ్చాత్య సంస్కృతి మన దేశంలో ప్రవేశించాయి. దీనితో మహోన్నతమైన మేధా వికాసము, సాంస్కృతిక పునరుజ్జీవనము జరిగింది. ఆధునిక భారతీయ సాంస్కృతిక పునరుజ్జీవనానికి 'ఉదయతార'గా రాజారామమోహనరాయ్‌ని ప్రపంచం కీర్తించింది. మద్రాసు నగరం దక్షిణ భారత దేశానికి 'మేధా రాజధాని'గా విలసిల్లింది. మద్రాసులో ఆంధ్రులు కీలకపాత్ర నిర్వహించారు. వారిలో ఇరువురు ప్రముఖులు చిరస్మరణీయులు. ఒకరు ఏనుగు విశ్వేశ్వరయ్య - మద్రాసు హైకోర్టులో అనువాదకుడు. దక్షిణదేశ రాజారామమోహనరాయ్‌గా ప్రసిద్ధి గాంచిన రెండవ వ్యక్తి గాజుల లక్ష్మీనరసింహశెట్టి, వణిక్ప్రముఖుడు. 1844లో 'క్రెసెంట్' పత్రిక స్థాపించాడు. పర (విదేశీ) ప్రభుత్వ అసమగ్రతలను క్రెసెంట్ పత్రిక ధైర్యంగా విమర్శించేది. స్థానిక ప్రజల అభిప్రాయాలను కోరికలను హేతుబద్ధంగా వెలిబుచ్చే 'వేదిక'గా ఆ పత్రిక ఉపకరించింది.

సంఘసంస్కరణలను ఆంగ్లేయులు హృదయ పూర్వకంగా చేపట్టలేదు. వారు చేపట్టిన సంస్కరణలను సైతం సనాతన హైందవులు వ్యతిరేకించారు. ఈ వ్యతిరేకత 1857 సిపాయి తిరుగుబాటుతో పతాక స్థాయిని చేరింది. ప్రగతికి, సంఘ సంస్కరణలకు వ్యతిరేకంగా ప్రభుత్వ మద్దతును 'విక్టోరియా మహారాణి ప్రకటన' వెలిబుచ్చింది. దీనితో సనాతన హైందవ ఛాందసులకు విజయం చేకూరింది. సంఘ సంస్కరణ ఉద్యమం సహృదయుల, నిస్వార్థపరుల వ్యక్తిగత సేవలకు మాత్రమే పరిమితం అయింది.

ఈ విధమైన నిరుత్సాహ పరిస్థితులలో కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావు, రఘుపతి వెంకటరత్నం నాయుడు మున్నగువారు అంకిత భావంతో సంస్కరణ ఉద్యమాన్ని చేపట్టారు. వీరిలో కందుకూరి వీరేశలింగం అగ్రస్థానాన్ని ఆక్రమిస్తాడు. వీరేశలింగం వృత్తిరీత్యా తెలుగు అధ్యాపకుడు; ధర్మశాస్త్రాలలో నిష్ణాతుడు; ఆర్థికంగా పేదవాడు. రాజారామమోహనరాయ్ జీవితము - ఆలోచనలు అతనికి స్ఫూర్తినిచ్చాయి. ఆంధ్రదేశములోని బాధాసర్పద్రష్టుల ఉద్ధరణకు జీవితాంతము అవిశ్రాంతంగా పోరాడాడు. సనాతన ఛాందసుల అవమానాలనెన్నింటినో భరించాడు. బాల్య వివాహము, ఆజన్మాంత వైధవ్యము. వేశ్యావృత్తి, కన్యాశుల్కము సాంఘిక దురాచారాల నిర్మూలన అతని లక్ష్యము. వీరేశలింగం తెలుగులో మంచి రచయిత. ప్రజలలో సాంఘిక చైతన్యాన్ని తీసుకురావటానికి సాహిత్యాన్ని శక్తివంతమైన ఆయుధంగా వాడుకున్నాడు. తన వాదనలకు ఋజువులను హైందవ ధర్మశాస్త్రాల నుండి విరివిగా ఉదహరించేవాడు. దీనిలో అన్ని తరగతుల ప్రజలను ఆకట్టుకుని వారిలో చైతన్యాన్ని తీసుకురాగలిగాడు. ఈ విధంగా మొదలైన సంఘ సంస్కరణోద్యమం క్రమంగా మహాత్మాగాంధీ నాయకత్వంలోని స్వాతంత్ర్యోద్యమ నిర్మాణాత్మక కార్యక్రమాలలో అంతర్భాగమయింది. అంటరాని తనం నిర్మూలన; హరిజనుల దేవాలయ ప్రవేశం; స్త్రీ విద్యలకు ఆంధ్రదేశంలో మంచి స్పందన లభించింది.

కవిరాజు త్రిపురనేని రామస్వామి శివకవుల విప్లవోద్వేగాన్ని కందుకూరి గురజాడల సంస్కరణోత్సాహాన్ని మానవత్వాన్ని పుణికి పుచ్చుకుని ఆంధ్రుల సాంఘిక చరిత్రలో భావవిప్లవ వైతాళికుడుగా, అభ్యుదయ తీర్థంకరుడుగా, విశిష్ట స్థానాన్ని ఆక్రమిస్తాడు. సాంఘిక సమస్యలను పరిష్కరించటంలో హేతుబద్ధమైన ఆలోచనలను, శాస్త్రీయ దృష్టిని ప్రవేశపెట్టిన ఘనత కవిరాజుకే దక్కుతుంది. మానవుడు మతాన్ని సృష్టించిన నాటి నుండి మతము మానవాళికి మంచికంటే హానినే ఎక్కువ చేసిందనే విషయాన్ని గ్రహించాడు. మతముపై విశ్వాసాన్ని మత సంస్థలపై భక్తిభావాన్ని వ్యంగ్యంగా (ఐరోపా పునరుజ్జీవన కాలం నాటి ఎరాస్మస్ వలె) విమర్శించాడు. భారతీయ సాంస్కృతిక

వారసత్వంలోని లొసుగులను గ్రహించి నేటి రాజకీయ సాంఘిక చైతన్యానికి ప్రాచీన రచనల నుండి స్ఫూర్తి పొందటం "వెనుక ముఖంతో ముందుకు నడవటం" అని వ్యంగీకరించాడు. అతని దృష్టిలో పురాణాలు, ధర్మశాస్త్రాలు చారిత్రిక విలువ కలిగినవి మాత్రమే. సంఘం చైతన్యవంతమై, ప్రగతి దిశలో పయనిస్తుంది. అధికార బలంతో సంప్రదాయాలపై భక్తి విశ్వాసాలతో సత్యావిష్కరణ జరగదని, స్వేచ్ఛా సమానత్వాలే సత్యావిష్కరణకు పునాదులని కవిరాజు వాదన. ఆతని సిద్ధాంతంలో కులమత వర్గ వ్యత్యాసాలకు తావులేదు. ఆతని 'సూతాశ్రమము' కవిరాజు భావపుంజాలను నలుదిశలా వెదజల్లింది. ఆవుల గోపాలకృష్ణమూర్తి వంటి యువ మేధావులెందరినో ఆకర్షించింది. వారు అతని ఆలోచనలు క్రియారూపం దాల్చటానికి కృషి చేశారు.

సంప్రదాయాలకు బానిస అయిన భారతదేశంలో హేతువాదం నత్తనడకే నడుస్తుంది. పారిశ్రామికీకరణతో మార్క్సిస్టు - సోషలిస్టు భావాలు భారతదేశంలో ప్రవేశించాయి; హేతువాదము అభివృద్ధికి తోడ్పడినాయి; కానీ రెండు ప్రపంచ యుద్ధాల మధ్యకాలంలో భారత రాజకీయ వాతావరణము కులమతాలతో నిండి ప్రతీపశక్తులు విజృంభించటానికి దోహదపడింది. ఈ పరిస్థితులలోనే యం.యన్.రాయ్ రాడికల్ డెమోక్రటిక్ పార్టీని స్థాపించాడు. తరువాత ఆ పార్టీ రాడికల్ హ్యూమనిస్టు ఉద్యమంగా రూపొందింది. హేతుతత్వము, లౌకికతత్వము, ప్రజాస్వామ్యపు విలువలతో నిండిన నాయకత్వాన్ని భారతదేశానికి అందించటం రాయ్ ఉద్యమ లక్ష్యం. భారత జాతీయ కాంగ్రెస్‌కు దీటయిన వికల్పం కావాలని రాయ్ ఆకాంక్ష. మతాన్ని రాజకీయాన్ని కలపటం, రామ రాజ్య ప్రతిపాదన, రాట్నం ద్వారా ఆర్థిక ప్రగతి, యువకులలో చట్టవ్యతిరేక భావాన్ని ప్రేరేపించటం మున్నగు విధానాలకు రాయ్ విముఖుడు. నూతన భావ విప్లవం ద్వారా భూతకాలపు సంకెళ్ళను త్రెంచి భారత జాతిని విముక్తం చేయటం అతని ధ్యేయం. మానవుడు ఏ 'ఇజానికి' బందీ కాకూడదనీ, సంఘ నిర్మాణానికి మానవుడే పునాది కావాలని అతని వాదన. అతని 'శాస్త్రీయ రాజకీయాలు' 'కుడి-ఎడమ'ల దాడి నుండి ప్రజాస్వామ్యానికి కొత్త ఊపిరినిచ్చి ఉత్తేజాన్ని కలిగించాయి. ఇతర ప్రాంతాలలో వలెనే

ఆంధ్రదేశంలో కూడా రాడికల్ ఉద్యమం కొంత మంది మేధావులకు మాత్రమే పరిమితం అయింది. అది సాధించిన విజయాలు గొప్పవి కాకపోవచ్చుకానీ స్వల్పమయినవి మాత్రం కావు. అధ్యయన సదస్సులు, శిక్షణా శిబిరాలు వేసవి పాఠశాలలు ద్వారా ఉద్యమం ప్రజలను కొంత వరకు జ్ఞానవంతులను చేసింది. ఒక వైపున మత మౌఢ్యం నుండి రెండవ వైపున కమ్యూనిస్టు నిరంకుశత్వం నుండి ప్రజలను దూరంగా ఉంచగలిగింది.

స్వాతంత్ర్యానంతరం 'ఇండియన్ రేషనలిస్టు అసోసియేషన్' అంధ విశ్వాసాలను ఖండించి హేతుబద్ధమైన దృక్పథాన్ని పెంపొందిస్తోంది. సాంఘిక సమానత్వము, ఐక్యమత్యముల ప్రాధాన్యత వివరిస్తోంది. వరంగల్లు, నల్గొండ, చీరాల, హైదరాబాదు పట్టణాల నుండి 'నాస్తిక', 'మూఢవిశ్వాసలు', 'హేతువాది', 'చార్వాక' మున్నగు పత్రికలు కృషి చేస్తున్నాయి. 'గోరా'గా బహుళ ప్రాచుర్యం పొందిన గోపరాజు రామచంద్రరావు హేతుదృష్టి విశ్వఉదార స్ఫూర్తికై సుమారు నలభై సంవత్సరాల పాటు కృషి చేశారు. వారు స్థాపించిన 'నాస్తిక కేంద్రము' ప్రపంచ హేతువాదుల దృష్టిని ఆకర్షించింది. వారి జీవితము, విశిష్ట వ్యక్తిత్వము ఎందరికో స్ఫూర్తిదాయకమయింది.

మార్పు ఒక రాత్రిలో రాదు. మార్పును కోరే ఉద్యమాలు ఎంత చిన్నవైనా మానవుడు తనను తాను తెలుసుకునే ప్రయత్నంలో కీలక పాత్రను తప్పక నిర్వహిస్తాయి. మానవుడు 'హేతుబద్ధుడైన జీవి' అనే గ్రహింపే ఉద్యమాల అంతిమ లక్ష్యం.



---

In Quest of Freedom - AGK Commomarative volume - 1968.

# 13. ఆంధ్రదేశంలో కులాల పుట్టుక - పెరుగుదల

క్రీ.శ. 300 వరకు, అనగా శాతవాహనరాజ్యం చివరిరోజుల వరకు, వృత్తుల ప్రస్తావనే తప్ప కులం-ప్రస్తావన దాదాపు లేదు. ధాన్యకటక బౌద్ధస్తూపానికి 'విధిక' పేరుగల చెప్పులు కుట్టే వ్యక్తి కానుకలు సమర్పించినట్లు శాసనాధారం ఉంది. ఇతని తండ్రి ఉపాధ్యాయ. (బౌద్ధ భిక్షువుకు ఒక పేరు) వీరిద్దరూ బౌద్ధులు. వైదిక, బౌద్ధమతాలు పక్కపక్కనే సాగిన కాలమదే. మతద్వేషాలు లేవు. కులాల పేర్లుకూడా లేవు. బ్రాహ్మణ అనే పేరుమాత్రం ఉంది. వారు వైదిక మతానుయాయులు.

3వ శతాబ్ది మధ్యనుంచి ఆంధ్రదేశంలో ఆర్థిక విప్లవం ఒకటి మొదలయింది. విదేశీ వ్యాపారం దాదాపు అంతమయింది. (రోమన్ సామ్రాజ్య పతనం ఇందుకు ముఖ్య కారణం) పరిశ్రమలు మూలపడ్డాయి. ఇక్ష్వాకుల రాజధాని విజయపురిలో సైతం ఆనాటి పారిశ్రామిక అవశేషాలు కనపడవు. వ్యవసాయంవైపు దృష్టిమళ్లింది. వాశిష్టిపుత్ర ఛాంతమూల అను ఇక్ష్వాకురాజు వేలాది నాగళ్లను, పశువులను రైతులకు దానంచేసినట్లు శాసనాలు తెలుపుతున్నాయి. ఆ పిమ్మట కృష్ణానదికి దిగువన ఉన్న పల్నాడు, వెలనాడు ప్రాంతం అంతా కంచి పల్లవరాజుల పాలనకు లోనయింది. వారి పేరుతోనే పలనాడు అనే పేరు వచ్చింది. (పల్లవనాడు అని మొదటిపేరు)ఆ రాజులలో ఒకరు 'కడువెట్టి' అనే బిరుదుకలవాడు. అనగా అడవులను నరికివేసినవాడు అని అర్థం- వ్యవసాయాన్ని ప్రోత్సహించాడు అని స్పష్టమవుతుంది.

చేతివృత్తులు, వ్యాపారం సన్నగిల్లటంతో మారకం అవసరం తగ్గిపోయింది. ఏ గ్రామానికి ఆ గ్రామం ఏకాంతవాసంచేసే తత్వం ఆరంభమయింది. లోహ పరిశ్రమ

మూతపడ్డది. ఇక్ష్వాకు రాజులు రాగినాణేలు విడుదలచేశారు. ఆ తర్వాత రెండు శతాబ్దాలకు (5-6 శతాబ్దాలు) కోస్తా జిల్లాలను పరిపాలించిన విష్ణుకుండిన రాజులు, రాగి లభించక ఇనుపనాణేలు జారీచేశారు. రాగి పూత కొద్దిగా ఉండేది. మతపరమైన మార్పులు మొదలయ్యాయి. బౌద్ధం వెనుకపడింది. భక్తి ప్రధానమైన భాగవత ధోరణితో కూడిన వైదికమతం లేక బ్రాహ్మణ మతం పైచేయి సంపాదించింది (బ్రాహ్మణ మతం అంటే బ్రాహ్మణులకే పరిమితమైనదని కాదు. వారి ఆచార్యత్వంలో విస్తరించిన వైదికమతం అని అర్థం. చాతుర్వర్ణ వ్యవస్థ ఇందులోని ముఖ్యాంశము)

పల్లవరాజులు గాఢ బ్రాహ్మణ మతాభిమానులు. కృష్ణకు దిగువ జిల్లాలో ఈ రాజులు పెద్ద ఎత్తున దేవాలయాలు నిర్మించారు. (వానిలో కొన్ని ఈనాటికీ ఉన్నాయి. చేబ్రోలు అలాంటి వాటిలో ఒకటి) బ్రహ్మదేయం, దేవభోగం పేర్లతో బ్రాహ్మణులకు అగ్రహారాలు, దేవాలయాలకు భూములు ఇవ్వటంకూడా అప్పుడే మొదలయింది. వెలనాడు అంతటా ఇలాంటి దానధర్మాలతో నిండి ఉంది. ప్రస్తుతం తెనాలి, రేపల్లె, బాపట్ల తాలూకాలను వెలనాడు అనేవారు. అంతవరకు వేరు వేరు వృత్తులు చేసే వారందరూ ఈ బ్రాహ్మణాగ్రహారాలలో వ్యవసాయదారులుగా స్థిరపడసాగారు. వీరందరికీ ఆనాటినుంచీ శూద్రులు అనే పేరు వాడుకలోకి వచ్చింది. వీరే నాలుగో వర్ణం.

ఈ కాలంలో బ్రాహ్మణులు పౌర, సైనిక వృత్తులు కూడా స్వీకరించేవారు. ఇక్ష్వాకుల ఆస్థానంలో 'బోధిసిరి' 'భద్రబోధిశర్మ' అనే బ్రాహ్మణులు కోశాధికారులుగా ఉండేవారు. (బౌద్ధమత చిహ్నమైన బోధి బ్రాహ్మణమత చిహ్నమైన శర్మ కలిసి ఈ పేర్లు ఏర్పడిన విషయం గమనించాలి) అభీర రాజు ఆస్థానంలో (అభిరులు పశ్చిమ తెలంగాణా. ప్రాంతంలోని స్థానిక పాలకులు)

భరద్వాజ గోత్రానికిచెందిన శివశర్మ 'మహాశ్రామిక', 'మహాతలవరి' 'మహాదండనాయక' బిరుదు ధరించి విజయపురిపై దండెత్తిన సేనలకు నాయకత్వం వహించాడు. ఇదే గోత్రానికి చెందిన తిష్యశర్మ, మంత్రిగా ఉండేవాడు. ధర్మశర్మ, ఆర్యభూతి, అని మరికొందరి పేర్లుకూడా కన్పిస్తాయి. ధర్మశర్మ యుద్ధంలో చనిపోగా అతని స్మృత్యర్థం 'ఛాయాస్తూపం' (సమాధిస్తూపం) నిర్మించబడ్డది.

బ్రాహ్మణులు 3 వృత్తులలోకి విభజితులైనారు. ఒకటి వైదిక పండితులు, రెండు- దేవాలయ పూజారులు, మూడు ప్రభుత్వోద్యోగులు.

## సామాజిక ఊర్ధ్వ చలనం:

క్రీ॥శ. 250, 500 మధ్య కృష్ణకు ఎగువ భాగాన విష్ణుకుండినులు పరిపాలించారు. వీరు దేవాలయ నిర్మాణంకంటే మౌలికమైన యజ్ఞయాగాదులు నిర్వహించసాగారు (యజ్ఞాలు వైదికకర్మలకు దేవాలయ నిర్మాణం భాగవత భక్తిధోరణికి చిహ్నాలు. వీరి రాజధాని నగరాలు విజయవాడ, నల్గొండ జిల్లాలలోని ఇంద్రపాల నగరం. వీరు తొలుత ఆటవిక తెగల వారై ఉండి, సంస్కృతీకరణ క్రమంలో వైదికులరాజులై క్షత్రియ చిహ్నామైన 'వర్మ' బిరుదు ధరించారు. సామాజిక ఆరోహణక్రమానికి బ్రాహ్మణత్వంచే ఆమోదం పొందేందుకుగాను, యజ్ఞయాగాలు విపరీతంగా చేశారు. ఈ రాజులలో మాధవవర్మ నరమేధంకూడా చేశాడని చెప్తారు. వీరింటిపేరు పూసపాటి. విజయనగరం పాలకులైన పూసపాటివారు మాధవవర్మను తమ వంశకర్తగా చెప్పుకుంటారు. తెగలకు చెందినవారిని వర్ణవ్యవస్థలో భాగంగా చేసేందుకు 'వ్రాత్యస్తోమం', హిరణ్యగోగర్భవ్రతం' లాంటి కర్మకాండలు అప్పటికే రూపొందాయి. వైదిక బ్రాహ్మణులకు ఈ వ్రతాలద్వారా విస్తారంగా దానధర్మాలు చేసి అగ్రహారాలు ఇవ్వటం, వారు వీరికి క్షత్రియత్వం ఇచ్చి ద్విజులుగా గుర్తించటం అనాదిగా వస్తున్న ఆచారం. విష్ణుకుండినులేకాదు ఆ తర్వాత ఆంధ్రలో రాచరికం నిర్వహించిన వారందరూ ఇలాంటి క్షత్రియులే.

ఆటవిక తెగలవారందరూ మొదట బౌద్ధం స్వీకరించారు. ఒకటి రెండు తరాలవరకు సాత్విక సంస్కారం పొందారు. పిమ్మట వర్ణవ్యవస్థలో పై స్థాయికి చేరుకున్నారు.ఆటవిక తెగల సంస్కృతీకరణకు మొదట్లో బౌద్ధం, తర్వాత జైనం నిచ్చెన మెట్లుగా ఉపకరించాయి.

ఈవిధంగా సంస్కృతీకరణ పొందిన వారు కొందరు బ్రాహ్మణత్వం కూడా సాధించారు. కొండముడి శాసనాలతో గోగిరాజు, మైదవోలు శాసనంలో గోనమద్విజ, పికిరో శాసనంలో విలశర్మ వీరంతా ఆటవిక తెగలనుండి బ్రాహ్మణత్వం పొందిన వారని స్పష్టపడుతోంది.

వీరందరి గోత్రం కశ్యప గోత్రం సంకీర్ణనతో ద్వారా బ్రాహ్మణత్వం పొందిన వారికొరకు ప్రత్యేకంగా ఏర్పరిచిన గోత్రం ఇది. కొందరు బ్రాహ్మణులు తమ పేర్లచివరలో 'శర్మ', 'ఆర్య' అను రెండుపదాలు చేర్చుకున్నారు. భావశర్మార్య, భట్టి శర్మార్యయ పేర్లు అందుకు నిదర్శనాలు. తమ బ్రాహ్మణత్వాన్ని ఎవరూ ప్రశ్నించకుండా దృఢమైన సాక్ష్యాధారాలు ఏర్పరచుకున్నారు.

(దక్షిణాది బ్రాహ్మణులందరు దాదాపు ఈవిధంగా ద్రావిడ ఆటవిక పునాదులనుంచి పైకి ఎగబ్రాకినవారే. వీరంతా ఉత్తరాదినుండి వచ్చిన బ్రాహ్మణులు అనుకోవటం పొరపాటు. తొలిరోజులలో కొందరు అలా వచ్చినమాట నిజమే. వారు సైతంఉత్తరాదిన క్రింది శ్రేణినుండి పైకి ఎగబ్రాకినవారే. వేదకాలం నుండీ నేటివరకూ ఏ వర్ణమూ అవిచ్ఛిన్నంగా లేదు. ప్రతీదీ సంకర వర్ణమే. ఈ వాస్తవాన్ని అంగీకరించటానికి, తెచ్చిపెట్టుకున్న ఆధిక్యతా భావం ప్రతివర్ణానికి, కులానికి అడ్డువస్తున్నది. వర్ణ వ్యవస్థలోని మౌలికమైన విషబీజం ఇదే - సంపాదకుడు)

## వేంగీ చాళుక్యులు:

కోస్తా జిల్లాల్లో వేంగీ చాళుక్య రాజ్యం ఏర్పడడంతో నిజమైన మధ్యయుగాలు ఆరంభమైనాయి. (క్రీ॥శ॥ 600-1000) పశ్చిమ చాళుక్యుల సేనానులుగా వచ్చి కోస్తాజిల్లాలను ఆక్రమించుకుని తూర్పు చాళుక్యులు లేక వేంగీ చాళుక్యులు అని ప్రసిద్ధి చెందారు. వీరు మొదట్లో జైనులు. పిమ్మట శైవులైనారు. మొదట వీరి భాష కన్నడం. పిమ్మట తెలుగే తమ మాతృభాషగా భావించారు. ఆవిధంగా వీరు తెలుగు భాషకు గొప్ప సేవచేశారు.

మొదటి తెలుగు శాసనం, తెలంగాణాలోనుకాక, కోస్తాజిల్లాలలోనూ కాక రేనాటిసీమ అయిన కడప జిల్లాలో లభించింది. ప్రాకృత, సంస్కృత, బంధనాలనుండి బైటపడవలసిన అవస్థ ఆనాడు రేనాటిసీమకు లేకపోవడమే ఇందుకు కారణం. ఆర్థిక విధానంలో వ్యవసాయం అతి ప్రధానస్థానం ఆక్రమించి స్వయం సంపూర్ణ గ్రామవ్యవస్థ రూపొందసాగింది.

రాజులమధ్య నిరంతర యుద్ధాలు నిత్యకృత్యమైనాయి. పరిపాలనా యంత్రాంగమంతా సైనికావసరాల దృష్ట్యా రూపాంతరం చెందింది. మతంకొన్ని మూఢాచారాల పట్టింపుగా మారిపోయింది.భాష, విద్య, శిల్పం, అంతా మతంతో గాఢంగా పెనవేసుకుపోయింది. ఈ కాలంలోనే దాదాపు కోస్తాజిల్లాలోని ఆటవిక తెగలందరూ వర్ణవ్యవస్థలో ఏదో ఒకచోట తలదూర్చారు. సంస్కృతీకరణ, సామాజిక ఆరోహణ నిరాఘాటంగా సాగిపోయింది. వృత్తి విభజనతో మతంలో శాఖాభేదాలు విస్తరించాయి.

అగ్రహారాల సంఖ్య విపరీతంగా పెరిగింది. కర్మరాష్ట్రంలో అలుగురాజు , అటవి. దుర్జయ మొదలైనవారందరూ స్థానిక పాలకులు. కర్మరాష్ట్రం అంటే కృష్ణకు దిగువన ఉన్న నరసరావుపేట, గుంటూరు, సత్తెనపల్లి, వినుకొండ, పల్నాడు ప్రాంతం. క్రమంగా ఈ మాట కమ్మనాడుగా మారిపోయింది. అలుగురాజు వంశస్తుడే పల్నాటి యుద్ధంలో కీలకస్థానం వహించిన నలగామరాజు.

వేంగీ చాళుక్యులలో మొదటివాడు కుబ్జ విష్ణువర్ధనుడు. (ఇతనికి కొంచెం గూని ఉండేది. కనుక కుబ్జ అనే విశేషణం వచ్చింది) ఇతడు, ఇతని వంశస్థులు కంచిపల్లవులతో నిరంతరం యుద్ధాలు చేయవలసి వచ్చింది. వేంగి దేశానికి (ఏలూరు ప్రాంతం, గోదావరి, కృష్ణా, మధ్యస్థప్రాంతం అంతా వేంగీ మండలం) కంచికి మధ్య నెల్లూరు ప్రాంతంలో బోయలు రాజ్యం చేస్తుండేవారు. వీరు భయంకరమైన ఆటవిక పోరాట యోధులు. నాలుగు శతాబ్దాల క్రమంలో వీరు చాళుక్య రాజులచే ఓటమిచెంది వైదికమతం స్వీకరించి వర్ణవ్యవస్థలో భాగస్తులైనారు. బ్రాహ్మణ, వైశ్య శూద్ర వర్ణాలు మూడింటిలోనూ వీరు చేరిపోయారు. ఈ కాలంలోనే బోయ బ్రాహ్మణులు అనే మాట ఏర్పడ్డది. క్రమంగా బోయ అనేమాట అంతరించి బ్రాహ్మణులు అనే మాటే మిగిలిపోయింది. ఇదేవిధంగా పశ్చిమ తెలంగాణానుంచి రాష్ట్రకూటులు నిరంతరం వేంగీ చాళుక్యులపై యుద్ధాలు చేస్తుండేవారు. ఈ క్రమంలో వారు తెలంగాణాలోని పుళిందులు అను తెగవారిని వర్ణవ్యవస్థలో భాగస్వాములు చేశారు. సైనికదాడులు, సాంస్కృతికసమన్వయం పక్క పక్కనే సాగిన కాలమిది. ఈవిధంగా ఆంధ్రదేశంలో పెక్కు తెగలు వైదికమతంలో

భాగస్వాములైనారు. వీరిలో కొందరు (బోయలు, పులిందులు) సూటిగానూ మరికొందరు జైనం అనే నిచ్చెన మెట్లద్వారాను వర్ణవ్యవస్థలో చేరిపోయారు. మొధటజైనులై తరువాత హిందువులైనవారిలో ముఖ్యులు కోమట్లు. కోమటి అనే పేరు గోమతేశ్వరుని ద్వారా వచ్చింది. ఆనాడు మెదక్‌జిల్లా బోధన్‌లో బ్రహ్మాండమైన గోమతేశ్వర విగ్రహం ఉండేది. పిమ్మట అది ధ్వంసం అయింది. దాని నమూనాలో నిర్మితమైన గోమతేశ్వర విగ్రహం ఇప్పటికీ శ్రావణబెళగోళలో ఉంది. కోమట్లు మాత్రమేగాక చేతివృత్తులవారందరూ కంసాలి, కమ్మరి, కంచరి, కాశె, వడ్రంగి వీరిని పంచాసనంవారు అంటారు. అంటే ఐదురకాల చేతివృత్తులు చేసేవారు. వీరంతా మొదట్లో జైనులు. పిమ్మట వర్ణవ్యవస్థలో భాగమై హెచ్చుమంది శైవులైనారు.

పెనుగొండులోని కన్యకగాథ, కన్యకలగ్నిగుండంలో దూకి ఆత్మార్పణ చేసుకోవటం అంతా జైన సల్లేఖనాచారానికి దగ్గరగా ఉంది. రాజులే శైవులైతే ప్రజలూ శైవులుకాక తప్పదు. ఈ క్రమంలో అనేక కులనామాలు ఏర్పడ్డాయి. సెట్టి, నాయుడు, నీడు, నాయక, రెడ్డి మొదలైనవి. ఈ మాటలన్నీ పల్నాటి చరిత్రలో ప్రస్తావించబడిన విషయం తెలిసిందే. (బ్రహ్మానాయుడు, మల్నీడు)

మరొక పరిణామం జరిగింది. బ్రాహ్మణులకు మాత్రమే కాక చాలా సందర్భాలలో వారికంటే ఎక్కువగా కూడా సేనానాయకులకు, వీరులకు గ్రామాలు గ్రామ సముదాయాలు దానంచేసే పద్ధతి మొదలైంది. ఆయుధోపజీవులకు సమాజంలో అగ్రస్థానం లభించింది. వీరు యుద్ధసమయంలో సైనికులు, శాంతియుత పరిస్థితులలో రైతులు.

## కమ్మ, వెలమ, రెడ్డి కులాలు:

ఈ చారిత్రక నేపథ్యంలోనే ఆంధ్రదేశంలో కమ్మ, వెలమ, రెడ్డికులాలు రూపొంది ప్రముఖస్థానం వహించసాగాయి.

వెలమలు అనుపేరు వెలనాడునుండి వచ్చింది (తెనాలి, రేపల్లె, బాపట్ల తాలూకాలు) ఆ ప్రాంతంలో వీరు రైతులుగా, భూస్వాములుగా, సామసికులైన వీరులుగా రూపొందారు.

దక్షిణాదిన అప్పటికే ప్రారంభమైన వైష్ణవ ఆళ్వారుల భక్తి ఉద్యమ ప్రభావం వీరిపై పడ్డది. వెలనాటి గొంకరాజు నాటి పాలకుడు. ఇలా ఉండగా కన్నడంలో మొదలైన వీరశైవ ఉద్యమ ప్రభావం కోస్తాజిల్లాలపై పడింది. గోదావరి జిల్లాకు చెందిన మల్లికార్జున పండితారాధ్యుడు వెలనాడు వచ్చి బౌద్ధులను ఓడించినట్లు చరిత్రలో ఋజువులున్నాయి. బౌద్ధులు పారిపోయారు. శైవం పైచేయి సంపాదించింది. శైవులు అవలంబించిన కుటిల పద్ధతులతో వెలనాడు అంతా మతకలహాలు మొదలయినాయి. వ్యవసాయం మూలపడ్డది. అగ్రహారాలు పాడుపడ్డాయి. ఈ కల్లోలాన్ని తట్టుకోలేక ఆయుధోపజీవులైన వెలమలంతా మూకుమ్మడిగా తెలంగాణాకు తరలిపోయారు. దేవరకొండ, రాచకొండలాంటి ప్రాంతాలకు పాలకులైనారు. బ్రాహ్మణులు కృష్ణను దాటి గోదావరిని దాటి తూర్పు ప్రాంతాలకు తరలివెళ్లారు. వెలనాటి బ్రాహ్మణులు హెచ్చుగా తూర్పుగోదావరి జిల్లాలో ఉండటానికి అదే కారణం. వేంగీ చాళుక్యులు ఈ పరిణామానికి దోహదంచేసి ఈ బ్రాహ్మణులకు విస్తారంగా అగ్రహారాలనిచ్చారు. తొమ్మిదవ శతాబ్దినుండి కోస్తా జిల్లాల్లో దేవాలయ నిర్మాణం తిరిగి పుంజుకుంది. చాళుక్య విజయాదిత్యుడు (క్రీ.శ.850) ఉభయ గోదావరి జిల్లాల్లో 108 శివాలయాలు నిర్మించినట్లు శాసనాలు చెబుతున్నాయి. ద్రాక్షారామం, క్షీరారామం, అమరారామం, ఇత్యాది శైవ క్షేత్రాలన్నీ అలా రూపొందినవే. వీటిలో హెచ్చుభాగం అంతకుముందున్న బౌద్ధ స్థూప శిథిలాలపై నిర్మింపబడ్డాయి. మత విద్వేషం ఆ స్థాయిలో ఉండేది.

జైనం ప్రజామతం. జైనసారస్వతం హెచ్చుగా ఉండేది. అక్షరాలు చెక్కేవారందరూ జైనులైన విశ్వబ్రాహ్మణులు. అక్షరాభ్యాస సమయంలో 'ఓం నమః శివాయ సిద్ధం నమః' లో సిద్ధుడు జైన గురువు. శివాయ అనుమాట తరువాత చేరింది.

జైనమత ప్రభావాన్ని ఎదుర్కొనేందుకు సంస్కృత పురాణాలను తెలుగులో అనువదించే కృషి మొదలయింది. రాజరాజనరేంద్రుని ప్రోత్సాహంతో నన్నయ్య ఆంధ్ర మహాభారతావతరణ అలా జరిగింది. అంతకు ముందు ప్రజలు "గాసట బీసటే చదివి గాథలు తవ్వేవారని" నన్నయ్యగారే చెప్పారు. జైన గాథలు, గ్రంథాలు ప్రచారంలో ఉండేవన్నమాట అవన్నీ కాలగర్భంలో కలిసిపోయాయి.

శూద్రులలో కొందరు సంస్కృతం అభ్యసించి బ్రాహ్మణాచారాలు పాటిస్తూ 'సత్శూద్రులు' అనే గౌరవం పొందారు. 'విప్వర్ల వంశ ఇతి విప్రకులా సమానాత్' 'చతుర్ధవంశ చతురాననస్య' మొదలైన బిరుదులు ధరించారు. విప్వర్లవారు రెడ్లు. మతం బ్రాహ్మణేతరుల వద్దకు దిగివచ్చింది. బ్రాహ్మణేతరులు ఈ సంస్కృతీ ప్రభావానికి గురయి క్షత్రియత్వం పొందారు. రెడ్లు, వెలమలు, కమ్మవారు రాజులైన తీరు ఇది. ఈ మూడు మాటలు ఎలా వచ్చాయో కొంచెం పరిశీలించుదాం.

వెలమల గురించి ఇది వరకు చెప్పాను. పల్నాటియుద్ధం 'కులంపోరు' అంటారు. కేవలం కులం పోరు కాదు. మతం పోరు కూడ. ఈ రెండు పేర్లతో సాగిన అధికారం కొరకు పోరు. అలుగు రాజు వద్ద పెద్దినాయుడు, అతని కుమారుడు బ్రహ్మనాయుడు మంత్రులు. బ్రహ్మనాయుడిని మంత్రి పదవి నుండి తొలగించి నాగమ్మ మంత్రి అయింది. నాగమ్మ రెడ్డి వంశస్థురాలు. రెడ్లు అప్పటికే వీర శైవంను అభిమానించారు. బ్రహ్మనాయుడు 'వీరవైష్ణవం' అభిమానించాడు. కులాలన్నిటినీ చెరిపి చాపకూడు, వర్ణాంతర వివాహాలు, హరిజన పూజారిత్వం ఏర్పరచాడు. (మాచర్ల చెన్నకేశవ దేవాలయంలో హరిజనులు పూజారులు) ఈ తీవ్ర సంస్కరణలు శైవులకు ఇష్టం లేదు. శైవులు కూడా మొదట్లో బ్రాహ్మణమతంపై తిరుగుబాటు చేసినవారే. కానీ ఒక చోట ఆగిపోయారు. బ్రహ్మనాయుడు ఇంకా ముందుకు వెళ్లాడు. ఇవన్నీ పల్నాటి యుద్ధానికి కారణాలు. యుద్ధంలో బ్రహ్మనాయుడు ఓడిపోయాడు. అతని అనుచరులంతా వెలమకులంలో చేరిపోయారు. హెచ్చుమంది తెలంగాణాకు వెళ్లి కాకతీయుల ఆశ్రయం పొందారు.

రెడ్డి అనేమాట ఎలా పుట్టిందనేది చెప్పటం కష్టం. అదొక గౌరవపదంగా అధికార దర్పానికి సూచకంగా ఆనాటి నుండి వస్తున్నది. రాష్ట్ర కూటులు తెలుగు దేశం వచ్చి స్థిరపడి క్రమంగా రెడ్లుగా మారారని ఒక వాదన ఉంది.

కాకతీయుల కాలంలో గజసేనాధ్యక్షుడైన జాయపసేనాని కమ్మకులానికి మూలపురుషుడు. కమ్మ అంటే లేఖ. కాకతీయుల వద్ద వారు మొదట లేఖకులుగా ఉండి క్రమంగా పాలకులైనందున వీరికా పేరు వచ్చినట్లు కొందరంటారు. ఒక కమ్మ ద్వారా

జాయపసేనానికి గజసైన్యాధిపత్యం రావడంతో ఆ పేరు స్థిరపడి వుండవచ్చు. వీరి రాజ్యం కృష్ణానది దక్షిణ తీరాన రేపల్లె తాలుకా ప్రాంతం. జాయపసేనాని వంశస్థులు క్రమంగా విస్తరించిన మీదట ఇదంతా కమ్మనాడు అనే పేరు వచ్చింది. ఆ ప్రాంతంలో నివసించిన బ్రాహ్మణులకు కమ్మనాటి బ్రాహ్మణులు, కమ్మ బ్రాహ్మణులు అనే పేర్లుకూడా కొంతకాలం వ్యాప్తిలో ఉండేవి.

## కులవిద్వేషాలు:

కాకతీయుల ఆస్థానంలో వెలమలు రెడ్లు ప్రధానస్థానం ఆక్రమించారు. వీరు నిరంతరం అంత:కలహాలతో రాజ్యానికి అస్థిరత్వం చేకూర్చేవారు. గణపతి దేవుడు వెలమ, రెడ్డి, కమ్మ ఇత్యాదులందరినీ సమదృష్టితో చూసాడు. తన రెండవ కుమార్తెను బ్రాహ్మణ మంత్రికిచ్చి వివాహం చేసాడు. కులసామరస్యం అత్యవసరం అని గుర్తించాడు. ఆ పిమ్మట రాజ్యానికి వచ్చిన రుద్రమదేవి రెడ్లను, ఆమె కుమారుడు ప్రతాపరుద్రుడు వెలమలను ఎక్కువగా ఆదరించారు. ఈ అంత:కలహాలే కాకతీయ రాజ్య పతనానికి కారణం. అల్లాఉద్దీన్ దండయాత్రను ప్రతిఘటించటంలో వెలమలు ప్రధాన పాత్ర వహించారు. రెడ్లు పట్టీపట్టనట్లు ఉన్నారు. కాకతీయ రాజ్య పతనానంతరం రెడ్డిరాజులు కృష్ణనుదాటి కొండవీటి రెడ్డిరాజ్యం స్థాపించారు. నాటినుండే రెడ్డి, వెలమరాజుల ఘర్షణ సాగుతూనే వచ్చింది.

జాయపసేనాని తర్వాత చెప్పుకోదగిన కమ్మనాయకులు ముసునూరు నాయకులు. నూజివీడు ప్రాంతానికి చెందిన వీరు. కాకతీయ రాజ్య పతనానంతరం, ఢిల్లీ నవాబులను పారద్రోలి కొంతకాలం వరంగలులో పాలించారు. పోలయ, కాపయ నాయకుల వీరోచిత గాథలు స్వర్ణాక్షరాలతో లిఖించదగినవి. కానీ ఈ ప్రతిఘటన ఎక్కువ కాలం సాగలేదు. వెలమ, రెడ్డి ఘర్షణలు, ముస్లిం దాడులు. వీటికి తట్టుకోలేక ఆయుధోపజీవులైన కమ్మనాయకులు హంపీ విజయనగరం వెళ్లి సాళువ తుళువ రాజుల ఆశ్రయం పొందారు. కృష్ణదేవరాయల సేనానాయకులలో అత్యధికులు ముఖ్యులు కమ్మసేనానాయకులు. రాయలవారి ఆజ్ఞమేరకు మధుర రాజుపై దండెత్తి మధుర

రాజ్యాన్ని స్థాపించిన నాగమ నాయకుడు కమ్మ ప్రముఖుడు. వీరితో పాటు వేల సంఖ్యలో సైనికులు దక్షిణ దేశం వెళ్లారు. అక్కడ స్థిరపడ్డారు. మొదట సేనాధిపతులుగా పిమ్మట రైతులుగా భూస్వాములుగా రూపొందారు. మధుర తంజావురు రాజ్యాల పతనానంతరం వీరిలో హెచ్చుమంది తిరిగి ఆంధ్రదేశానికి వచ్చి కోస్తా జిల్లాల్లో స్థిరపడ్డారు.

కమ్మవారిలో ప్రముఖుడైన వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు పూర్వీకులు ఒంగోలు ప్రాంతము వారు. రెడ్డిరాజుల కాలంలో వారికి విశ్వాసపాత్రంగాను, వీరోచితంగాను సేవచేసినందున వాసిరెడ్డి బిరుదనామంతో అమరావతీ ప్రాంతానికి పాలకులైనారు. పిమ్మట వాసిరెడ్డి వారి ఇంటిపేరుగా మారింది.

వెలమ, రెడ్డి, కమ్మ కులాలకు చెందని ఇతర వ్యవసాయదారులంతా కాపులుగా వ్యవహరించబడ్డారు. 'కాపు' అంటే రైతు అనే సాధారణార్థం సుప్రసిద్ధం.

మత విభేదాలు, కుల విద్వేషాలు రాజుల ఆశ్రయనిరాశ్రయాల ఫలితంగా ఆయుధోపజీవులు, వ్యవసాయదారులు అయిన ఈ మూడు కులాల వారు కోస్తా, తెలంగాణా, రాయలసీమ జిల్లాలన్నీ తిరుగుతూనే వచ్చారు. దాదాపు అన్ని వృత్తులవారు ఈ విధంగా ఒక చోటినుండి మరొక చోటికి తరలినవారే.

గోల్కొండ నవాబుల కాలంలో బ్రాహ్మణులు తిరిగి కొంచెం ఆధిక్యత సంపాదించారు. ముస్లిం నవాబుల వద్ద మంత్రి పదవులు గ్రామాలలో కరణీకాలు వీరి వశమైనవి. కానీ అదే కాలంలో మహారాష్ట్రనుండి వచ్చిన దేశ్‌ముఖ్, దేశపాండేలతో వీరు పోటీ పడవలసి వచ్చింది. ఈ వచ్చినవారు మహారాష్ట్ర బ్రాహ్మణులు క్రమంగా వారు తెలుగువారిగా రూపాంతరం చెందారు.

ముస్లిం నవాబుల కాలంలో ఉత్తరాదినుండి కాయస్థులు వచ్చి ఎక్కువగా హైదరాబాదులో స్థిరపడ్డారు. ఢిల్లీ నవాబుల పాలన మొదలైనప్పటినుండీ వారివద్ద లేఖఖ ఉద్యోగాలలో ప్రావీణ్యం సంపాదించి ఉన్నత పదవులు పొందిన వారు కాయస్థులు. బీహార్ బెంగాల్ రాష్ట్రాలలో నేటికీ వీరి సంఖ్య హెచ్చు.

ముగింపుగా ఒక మాట చెప్పనివ్వండి. బ్రిటీషు వారి రాకతో మనం వలస వ్యవస్థల భాగస్వాములైనాము. 19వ శతాబ్ది ఆఖరు భాగంలో వ్యవసాయ, వర్తక, వ్యాపారాలు, ప్రభుత్వ యంత్రాంగం, బాగా విస్తరించాయి. తమకు గల సాంస్కృతిక వారసత్వం దృష్ట్యా ఇంగ్లీషు విద్యను నేర్చి ప్రభుత్వ పదవులు ఆక్రమించటంలో కోస్తా జిల్లాల్లోని బ్రాహ్మణులు అగ్రస్థానం పొందారు. బ్రాహ్మణేతర వర్గాలు తమకు తగు న్యాయం లభించలేదని సహజంగానే అభిప్రాయపడ్డారు. ఈ అసంతృప్తిని ఆనాటి బ్రిటీషు పాలకులు ఆసరాగా తీసుకుని విభజించి పాలించు నీతితో జస్టిస్ పార్టీని ప్రోత్సహించారు.

జాతీయతా భావ వ్యాప్తి కొరకు తిలక్, అనిబీసెంట్ ఇత్యాదులు వైదిక సంస్కృతిని విస్తారంగా కీర్తించారు. వైదిక సంస్కృతి కేవలం ఆర్యసంస్కృతి లేక బ్రాహ్మణ సంస్కృతి అనే దురభిప్రాయాన్ని బ్రిటన్ చరిత్రకారులు అంతకు పూర్వమే కలిగించి ఉంచారు. ఈ నేపథ్యంలో బ్రాహ్మణతర ఉద్యమం అనేక వికృత రూపాలు ధరించింది.

ఈ నాటికి మన సాంస్కృతిక జీవితాన్ని విషపూరితం చేస్తున్న వేయిపడగల విషసర్పమైన కులతత్వం పుట్టిన తీరు యిది.



---

1989 జనవరి 4,5 తేదీలలో శ్రీశైలంలో జరిగిన ఆంధ్రప్రదేశ్ హిస్టరీ కాంగ్రెస్ అధ్యక్షోపన్యాస సంక్షిప్తరూపం. విశాలాంధ్ర 1989 సంక్రాంతి ప్రత్యేకానుబంధం.

# 14. గాథ

భారతదేశంలో అనాదినుండి, విమర్శలకు గురియగుచూ వచ్చిన సంస్థలలో వర్ణవ్యవస్థ ఒకటి. హైందవసంస్కృతికి, సమాజ స్వరూపమునకు, వర్ణములు విశిష్టమైన స్థిరత్వాన్ని చేకూర్చినవి. కాని కులములు భారతదేశము గుత్తకొన్న సొత్తుమాత్రము కాదు. అతి ప్రాచీన కాలమున, నాగరికతా కేంద్రములైన ఈజిప్టు, బాబిలోనియా, చైనాలలోకూడ పూజారులు ((Priests), పాలకులు (Rulers), వర్తకులు (Artisans or Marchants), బానిసలు (Slaves), అని వృత్తు లాధారముగ సామాజిక విభజన జరిగినట్లు చరిత్రలో చదువుచున్నాము. "గుణకర్మ విభాగస:" అను గీతావాక్యమును బట్టి మన దేశమునసైతము, గుణము (స్వభావము), కర్మ (వృత్తి), అనుసరించియే నాల్గువర్ణము లేర్పడినట్లు తెలియుచున్నది. ఇతర ప్రాంతములందు, సమాజ పరిణామక్రమంలో నీ వృత్తి విభజన ఎప్పుడో అంతర్ధానమైనది. కాని ఇండియాలోని పూజారులు (Brahmins) వర్ణవ్యవస్థకు దివ్యత్వాన్ని ఆపాదించి కాపాడుకుంటూ వచ్చారు. అంతేగాక, భారతసమాజానికి బాహ్యాప్రపంచ ప్రభావాలు సోకకుండ హిమాలయపర్వతములు చల్లని రక్షణకల్పించినవి. తత్ఫలితముగా ఇండియాలో వర్ణవ్యవస్థకు శాశ్వతత్వము సిద్ధించెను. దీని వలన ప్రజలలో కృత్రిమవిభేదాలేర్పడి, జాతీయజీవనమునకు జరుగుచున్న అపకారాన్ని గుర్తించి మహావీరుడు, గౌతమబుద్ధుడు, బసవేశ్వరుడు మొదలైన దార్శనికులు, సంస్కర్తలు, కులాలమీద దండయాత్రలు చేసిరి. ఐనన్కూ, వర్ణవిభేదములు, వాని వలన కలిగే వైమనస్యములూ, ఈనాటికీ మన దేశమున ప్రధాన సాంఘిక సమస్యగా నిలచియుండుట, భారతజాతీయ సంస్కృతిలోని వైశిష్ట్యమో, దౌర్బల్యమో, దౌర్భాగ్యమో పరిశీలించవలసిన అవసరము నేడెక్కువగా కన్పించుచున్నది. అంతేగాదు; ప్రజాస్వామ్య సూత్రములపై సమతాసమాజమును (Egalitarian Society) సాధింప సంకల్పించిన నేటి భారతీయులు, జన్మహక్కుల తత్వముపై రూపొందిన వర్ణవ్యవస్థను పున:పరిశీలించి,

వర్ణవిభేదములలోని జాతీయ విద్రోహకరశక్తులను గుర్తించి వానికి శాశ్వతసమాధి నిర్మించుట గూడ నేటి జరూరు సమస్యలలో నొకటి.

క్రీస్తుశకారంభమున దక్షిణాపథము నేకచ్ఛత్రముగా నేలిన గౌతమీపుత్రశాతకర్ణికి (క్రీ. త. 78-102) "వినివర్తిత చాతుర్వర్ణ సంకరస్య" అను బిరుదమున్నట్లాతని మాతృదేవి గౌతమీబాలశ్రీ నాసికలో వేయించిన శాసనమువలన తెలియుచున్నది. గౌతమీ పుత్రునకు ధాన్యకటకము (గుంటూరు జి.) ప్రధాన రాజధాని. కాబట్టి క్రీస్తుశకారంభమునాటికే ఆంధ్ర దేశమున వర్ణములు పాదుకొనినట్లును, ఏవో అవాంతరములవలన వర్ణసాంకర్య మేర్పడుటచే గౌతమీపుత్రుడు నివారించినట్లును స్పష్టమగుచున్నది. గౌతమీపుత్రుడు "ఆగమానాం నిలయస్య" అని కూడా సంబోధింపబడినాడు. అందుచేత వైదికధర్మమునకు, వర్ణవ్యవస్థకు అవినాభావసంబంధము కూడా నాటికే కల్పింపబడినట్లు గ్రహించవచ్చును. ఈ పరిణామముల ఫలితముగ వైదికకర్మలకు అర్హతగల అగ్రవర్ణములవారు ఆర్యులనియు, అనర్హులు ఆర్యేతరులనియు అభిప్రాయము నెలకొనెను. కాని వర్ణవ్యవస్థ ఆర్యనిర్మాణమను విషయము అనుమానాస్పదము.

ఆర్యులు ఇండియాలో ప్రవేశించినప్పుడు పశుపాలకులుగా నున్న సంచారజీవనులు; గుడారములే వారి గృహములు. ఇట్టి ప్రజలలో వర్ణవ్యవస్థవంటి సుస్థిర సాంఘిక సాంప్రదాయములుగాని సంస్థలుగాని యేర్పడగల అవకాశములు చాలతక్కువ. ఆర్యులు ఇండియాపై దండెత్తి, స్థానికులైన ప్రజలతో పోరాడి, వారినోడించి దేశము నాక్రమించిరి. ఈ ఆదిమభారతీయులే మహోజ్జ్వల హరప్పా సంస్కృతీ నిర్మాతలైన సింధుప్రజలు. సురక్షితమైన కోటలను నిర్మించుకొని ప్రశాంతజీవితము గడుపుచున్న సింధుప్రజలలో గూడ ఈజిప్టు, బాబిలోనియాలలో వలె వృత్తివిభజన జరిగినట్లు నిదర్శనములున్నవి. కాబట్టి విజేతలై భారతదేశము నాక్రమించిన ఆర్యులు స్థానికముగనున్న వృత్తివిభజనతో జాతీయాధిక్యతను, (శ్వేత, కృష్ణ) వర్ణప్రాశస్త్యమును చేర్చి కులములను రూపొందించిరి.

ఆర్యుల అధికారము, వైదిక మతములతో బాటు నూతన వర్ణవ్యవస్థ సైతము

దక్షిణాపథమునకు విస్తరించినది. కాని, దక్షిణదేశమునందలి బ్రాహ్మణులు, క్షత్రియులు, కేవలము ఆర్యావర్తము నుండి వలస వచ్చిన వైదిక సంస్కృతి నిర్మాతలనుకొనుట చారిత్రక సత్యము కాజాలదు. ఆర్యసంస్కృతి నవలంబించిన దాక్షిణాత్యజాతులలోని పూజారులే బ్రాహ్మణులైరి; ఆ జాతుల నాయకులే క్షత్రియులైరి. కాలక్రమమున వైదిక సంస్కృతి నారాధించు వీరందరును తాము ఆర్యులమని భావించుటలో విచిత్రములేదు. అందుచేతనే దాక్షిణాత్యబ్రాహ్మణులు వైదిక ఋషిగోత్రములను ధరించిరి; దక్షిణ దేశ రాజవంశములు, కురు కోసల రాజ్యములనేలిన ఐతిహాసిక చంద్రసూర్యవంశ క్షత్రియులతో తమకు సంబంధమును సూచించు కథలు, గాథలు కల్పించుకొనిరి. క్రీస్తుశకారంభకాలమున, విదేశీయులైన పహ్లవులుసైతము భారద్వాజగోత్రజులైన పల్లవులుగా మారిపోయి దక్షిణాపథము నేలిరిగదా!

ఆంధ్ర దేశములో పెక్కు రాజకీయ సాంఘిక పరిణామములు జరిగినవి. వీటిని సమన్వయపరచి నిర్వివాదమైన చరిత్రను రచించుటకు ఉపలభ్యములగు ఆధారములు చాలతక్కువ. అవికూడ అసంబద్ధములై, పరస్పరవిరుద్ధములై చరిత్ర కారులను తలపట్టులు పట్టించునవిగా నున్నవి. వీనికితోడుగా స్థానిక దురభిమానములు చేరుచున్నవి. ఇక, చరిత్రకుపట్టగల దుర్గతి వేరే చెప్పవలయునా? ఈ సందర్భమున మన దేశమున వర్ణములకు సంబంధించిన కొన్ని విరుద్ధ ఆధారములను పరిశీలింతము:

(1) సాతవాహన చక్రవర్తులు బ్రాహ్మణులుగా పరిగణింపబడుచున్నారు. అందులకు, గౌతమీపుత్రుని 'ఏక బ్రాహ్మణస్య' అను బిరుదమువినా యోగ్యముగ మరొక ఆధారము గన్పింపదు. గౌతమీపుత్రుడు వర్ణ సాంకర్యమును మాన్పినట్లు చెప్పబడినది. కాని అతని కుమారుడు వాసిష్ఠీపుత్ర శివశ్రీ శాతకర్ణి శక రాకుమారియైన రుద్రదమనికను వివాహమాడినట్లు తెలియుచున్నది. శ్రీ పర్వత ఇక్ష్వాకు వంశస్థాపకుడైన శ్రీ శాంతమూల మహారాజు అశ్వమేధాది యజ్ఞములొనర్చిన వైదిక మతోద్ధారి. అతని కుమారుడైన వీరపురీషదత్తుడు ఉజ్జయిని (శక) రాకుమార్తె రుద్రధరభట్టారికను భార్యగా స్వీకరించినాడు. ఇట్టి వివాహమువలన వర్ణసాంకర్యమెట్లు నివారింపబడును? ఇక, శక రాజవంశముకూడ

తనవైదేశిక స్వభావమును గోల్పోయి, స్థానిక సూర్య, చంద్ర వంశములలో నొకదానియందు లీనమైపోయి యుండును. కాబట్టి ఏవి ప్రాచీన క్షత్రియరాజవంశములో, కానివేవో పరిశోధింపబూనుట కేవలము ఎండమావుల వేటవంటిది.

(2) పై అంశము చాళుక్యుల విషయమున మరింత స్పష్టము కాగలదు. చాళుక్యులు బ్రహ్మచుళుకమునుండి ఉద్భవించిన వీరా వతంసుని సంతతివారని యొకగాథలో నున్నది. కాని వేంగి చాళుక్యులు తాము చంద్ర వంశజులమని వర్ణించుకొన్నారు. నన్నయభట్టారకుని ఆంధ్రమహాభారతావతారికయే అందుకు నిదర్శనము. మరియొక గాథలో అయోధ్యాధిపుడైన జయసింహుడు దక్షిణాపథమునకు వలసవచ్చి చాళుక్యుల మూలపురుషుడైనట్లు చెప్పబడినది. ఐనచో, చంద్రవంశస్థులైన చాళుక్యులు సూర్యవంశస్థుల రాజ్యమైన అయోధ్యనుండి వలస వచ్చుటయేమి? అను సందేహము రాకమానదు. ఇదియిట్లుండ, సౌరాష్ట్రము నేలిన చాళుక్యులు తాము అగ్నికుల క్షత్రియులమని చెప్పుకున్నారు. వీరినే సోలంకీలు అని అంటారు. అగ్నికుల ప్రశస్తి చందుకవి రచించిన "పృథ్వీ రాజ రాసో" అను హిందీ కావ్యములో కన్పించును. పరశురాముడు సర్వక్షత్రాంతకుడై, యజ్ఞమొనర్చి, హోమాగ్ని నుండి ఉద్భవించిన మహాపురుషునకు భూమిని దత్తమొనర్చి తపోవనమున కేగెనట. అతని సంతతివారైన ప్రతీహార, పారమార, చౌహాన, చాళుక్య రాజవంశములవారు తాము అగ్నికుల క్షత్రియులమని చెప్పుకొనిరి. ఐనచో చాళుక్యులు బ్రహ్మజులా? చంద్రవంశజులా? అగ్నికులజులా? నిజానికి చాళుక్యులు దక్షిణాపథమునకు స్థానికులై, అతి ప్రాచీనులైన 'చలికి' వంశమునకు చెంధినవారు; 'చలికి' వంశస్థులు హిరణ్య రాష్ట్రాధిపతులైనట్లు నాగార్జునకొండ శాసనములు చాటు చున్నవి. చలికియే చాళుక్యగా మారి కాలక్రమమున పై గాథలన్నియు కల్పింపబడినవి.

(3) ఇదేవిధముగ కాకతీయులేవర్ణజులు? అను సమస్య. విద్యా నాథుని ప్రతాపరుద్రయశోభూషణ కావ్యములోని "అత్యర్కేందుకుల ప్రశస్తి మభిజద్యమ్ కాకతీయాన్వయమ్" అను శ్లోకపాదాన్ని ఆధారముగా చేసికొని కొందరు పండితులు "అత్యర్కేందుకులము" అనేది ఒకటి ఉన్నట్లు నిర్ణయించుచున్నారు. చందుకవి సృష్టించిన

అగ్నికులము వంటిదే ఈ "అత్యర్కేందుకులము." సూర్య చంద్ర వంశములలో దేనికిగాని చెందని రాజులకొరకై వారి పోషణలో కావ్యముల నల్లిన వందిమాగధ కవుల శ్రమఫలితముగా ఇటువంటి గాథ లుత్పన్నమై పురాణములలో గూడ ప్రవేశించినవి. ఇట్టి ప్రక్షిప్తముల వలననే చారిత్రక ఆధారములుగా పురాణముల విలువ నశించిపోయినది. పైన పేర్కొన్న అత్యర్కేందు కులానికి చెందిన "క్రము" డను రాజు సంతానములోని చాళుక్య, కాకతి, రాయ అను వారలా యా పేర్లుగల రాజవంశములకు మూలపురుషులైనారు. అని ఒక పురాణ గాథ. ఈగాథాస్రష్ట ఇందలి అసందర్భమును గ్రహించలేదనుట స్పష్టము! చాళుక్య, కాకతి అనునవి వంశనామములే; కాని 'రాయ' అనునది వంశనామము కాదు. రెడ్డి, రాజు, నాయక, పదములవలె గౌరవనామము; రాజశబ్దమునకు పర్యాయ పదము. విజయనగర సామ్రాజ్యాధీశులు రాయశబ్దాన్ని ధరించారు. వీరు సంగమ, సాళువ, తుళువ, ఆరవీటి వంశముల వారు. వీరెవరును తాము 'రాయ' వంశస్థులమని చెప్పుకొన లేదు. ఇది యిలా ఉండగా, పై గాథలనుబట్టి వీరందరును అత్యర్కేందు కులజులగుచున్నారు. కాని శ్రీకృష్ణదేవరాయలు చంద్రవంశస్థుడని అల్లసాని పెద్దన పేర్కొన్నాడు. ఐనచో పౌరాణిక గాథ సత్యమా? రాయలి సమకాలికుడైన ఆంధ్రకవితా పితామహుని సృష్టి సత్యమా? మరొక విశేషము. అసలు శ్రీకృష్ణరాయలు ఆంధ్రుడుకాడుగదా? కన్నడిగుడు! కాబట్టి పై గాథలన్నియు క్రీ॥ శ॥ 15, 16 శతాబ్దములలోనో, తరువాతనో కల్పింపబడెనని తేలుచున్నది. ఇట్టి గాథలను గురించి సుప్రసిద్ధ చరిత్రకారుల అభిప్రాయమును పరిశీలింపుడు. "The Rajputs no doubt ranked as Kshatriyas, but they had no glorious traditions behind them, and their recent origin obliged them to look upto Brahmins for the social prestige and status which was in the power of the Brahmins alone to give" (Dr. R. C. Majumdar). మాన్యము అనుభవించుచు విశ్వాసపాత్రులైన పూజారి కవులు కల్పించిన గాథలవలన చారిత్రక సత్యములను కనుగొనుట ఎంతటి కష్టసాధ్యమో తెలియుచున్నది గదా!

మరియొక విషయము. వృత్తులనుబట్టియే వర్ణము లేర్పడినట్లు అందరు

సంగీకరింతురు. చిరకాలమువరకును వృత్తులనుబట్టి వర్ణముల మార్పుకూడ జరుగుచుండెననుటకు నిదర్శనములున్నవి. "భారద్వాజ గోత్రానామ్ పల్లవానామ్" అని చాటుకొన్న పల్లవులు కాలక్రమమున క్షత్రియులుగా పరిగణింపబడినారు. అందులకు వారు చిరకాల మనుసరించిన క్షాత్రధర్మమే కారణము. కర్ణాటరాజ్యము నేలిన కదంబవంశస్థాపకుడైన మయూరశర్మ బ్రాహ్మణవీరుడు. అతని సంతతివారు రాజ్యపాలకులై వర్మలైనారు! ఇదేవిధమున చతుర్థాన్వయులైయుండియు క్షాత్రధర్మము ననుసరించి ప్రజారంజకులైన వారిని క్షత్రియులుగా పరిగణించుటలో వైపరీత్యము కన్పింపదు; అది ధర్మవిరుద్ధముకాదు. విద్యానాథుడు కాకతీయులను "సూర్య చంద్ర వంశముల ప్రశస్తిని మించిన ప్రశస్తికల వంశమువారు" అని ప్రస్తుతించుటలోని ఆంతర్యముకూడ అదియే! మరియు సమాజము విస్తరించినకొలది, నాలుగు వర్ణములవారును తమతమ ఆదిమవృత్తులనే అంటిపెట్టుకొని యుండుటకు పరిస్థితులనుకూలింపలేదు. ఉపవృత్తులేర్పడి వర్ణములు శాఖోపశాఖలైనవి. పెక్కు బ్రాహ్మణ కుటుంబములవారు రాజాస్థానములందు మంత్రి, సేనాపతి, దుర్గాధ్యక్షాది పదవులలో నియుక్తులైరి. ఆంధ్రదేశములో నియోగులని వ్యవహరింపబడుచున్న బ్రాహ్మణులట్టివారే! తామనుసరించుచున్న ధర్మమును సూచించుటకు గాబోలు కొందరు నియోగులు కొమ్మరాజు, మాచిరాజు, అన్నంరాజు మొదలైన వంశనామములను ధరించిరి. అంతమాత్రమున వీరిని రాజులనిగాని, బ్రాహ్మణేతరులనిగాని నిర్ణయించుట పొరబాటు.*

క్రీ.శ. 14, 15 శతాబ్దములనాటికి ఆంధ్రదేశమున వృత్తులు నశించిపోయినవి. బ్రాహ్మణులుసైతము నీచవృత్తులకు బాల్పడి అపహాస్యములకు గురియైనట్లు, భట్టుమూర్తి దని ప్రచారములోనున్న ఈ క్రింది చాటువు ద్వారా తెలియుచున్నది.

*గుత్తిన్ బుల్లెలుగుట్టి, చంద్రగిరిలో*
*గూడెత్తి, పెన్గొండలో*
*హత్తిన్ సత్రమునందు వేడి, బలు*
*దుర్గాధీశ తాంబూలపున్*

విత్తుల్ మోసి, పదస్థులైన ఘనులన్...."

వర్ణములన్నిటికి ఇంచుమించు ఇట్టిగతియే ప్రాప్తించియుండును.

కాకతీయ (క్రీ.త. 13వ శతాబ్ది), కుతుబ్‌షాహీల (15వ శ.) యుగములందువినా, ఆంధ్రదేశమునకు మరెప్పుడునూ రాజకీయ సమైక్యత లభింపలేదు . సాతవాహన పతనకాలము నుండియు (క్రీ.త.200 ప్రాంతము) ఆంధ్ర దేశమును పెక్కు రాజవంశముల వారు పరిపాలించిరి. వీరు అంత:కలహములలో మునిగియుండిరని వేరుగ చెప్పనక్కరలేదు. దీనికి తోడు, కళింగమునుండి గాంగ, గజపతి వంశజులు, మహారాష్ట్రమునుండి రాష్ట్ర కూట, యాదవ చక్రవర్తులు, కర్ణాటకమునుండి చాళుక్యులు, ద్రావిడ దేశమునుండి పల్లవ, చోళ, పాండ్యప్రభువులు తరచు ఆంధ్రదేశముపై దండయాత్రలు సాగించిరి. తెలంగాణము, రాయలసీమ ప్రాంతములు చాలకాలము ఆంధ్రేతర రాజవంశముల పరిపాలనలోమ్రగ్గుచుండెడివి. అంత:కలహముల వలన, దండయాత్రల వలన రాజులకు పెద్దపెద్ద సైన్యములు అవసరమైనవి. తత్ఫలితముగ మధ్యయుగ ఐరోపారాజ్యములలో నేర్పడిన భూస్వామ్యవిధానము (Feudalism) అనగా భూస్వాములే సేనానాయకులై, రాజులకు తోడ్పడుచుండె సాంఘిక రాజకీయపద్ధతి ఆంధ్రదేశములో నేర్పడెనని చెప్పవచ్చును. నాటి సైన్యములు క్షత్రియ వర్ణమునకే పరిమితమైయుండగల అవకాశము క్షీణించినది. అధిక సంఖ్యాకులుగా చతుర్థకులజులు సైన్యములో చేర్చుకొనబడిరి. వీరు శాంతి సమయములలో వ్యవసాయముచేయుచు, అవసరమైనపుడు యుద్ధభూమికి నడచుచుండెడివారు. అనగా, మధ్యయుగయున ఆంధ్రదేశములో ఆయుధధారణ ఉపవృత్తిగానున్న పాలముకాపువర్ణమేర్పడినది. ఆంధ్రబ్రాహ్మణులలో రాష్ట్రముల ననుసరించి "నాడీభేదము"లేర్పడినట్టులే నీ కాపు క్షత్రియ - వర్ణములో గూడ ప్రాంతీయ విభేదము లేర్పడినవి. తెలంగాణములోని వారు తెలగలు, కమ్మనాటి వారు కమ్మవారు, వెలనాటివారు వెలమలు - ఐనారు. తెలగాలలో కొందరు బలిజలైనారు. అనగా బలి చక్రవర్తి సంతానమని ఒక ఊహ.కాని వాణిజ్యవృత్తి ననుసరించిన తెలగలే (వణిజ) బలిజలైనారనుట సమంజసముగా కన్పించుచున్నది. ఈ మూడువర్ణములతో రెడ్లు చేరినారు. రెడ్లది ఒక ప్రత్యేక చరిత్ర. 'రెడ్డి' అనునది ఉద్యోగనామమనియు, దానికి 'రాష్ట

కూట' పదము మూలమనియు చరిత్ర కారులు నిర్ణయించుచున్నారు. రాష్ట్రకూటరాజులు మాన్య ఖేటము రాజధానిగా దక్షిణాపథమున గొప్ప సామ్రాజ్యమును స్థాపించి పాలించిరి. (క్రీ.శ.8,9 శ.) పశ్చిమ, దక్షిణ ఆంధ్రదేశ భాగములను రాష్ట్రకూటులు జయించి తమ సామ్రాజ్యములో కలుపుకొనిరి. ఆయా ప్రాంతములలో రాష్ట్రకూటులు తమవారినే భూస్వాములుగను, పన్నులు వసూలు చేయు ఉద్యోగులుగను నియమించియుందురు. వీరే క్రమమున రెడ్లు అని ప్రసిద్దిచెందిరి. నేటికిని తెలంగాణము, రాయలసీమ ప్రాంతములలోనే అనగా ఒకప్పుడు రాష్ట్రకూటులచే నాక్రమింపబడిన ప్రాంతములోనే రెడ్లు అధిక సంఖ్యాకులుగ నున్నారు. క్రమముగా నియోగి అను పదమువలెనే రెడ్డి కూడా వర్ణనామముగా స్థిరపడిపోయినది. చిరకాలము వరకును అ నాల్గువర్ణములును ఒకేవర్ణము. కాపు - క్షత్రియ వర్ణము శాఖలుగా భావింపబడిరి.

క్రీ.శ. 11,12 శతాబ్దముల నుండియు నీ నాల్గు వర్ణములు ఆంధ్రదేశమున కన్పించుచున్నవి. ఆంధ్రరాజకీయములు అల్లకల్లోలముగ నున్న యుగముకూడ నదియే. చాళుక్య, కోట, చాగి, తెలుగు చోడ, హైహయాది మాండలిక వంశముల వారు నిరంతరము యుద్ధములలో మునిగి తేలుచుండిరి. అట్టి పరిస్థితులలో, తమ అధికారమును పటిష్ఠమొనర్చుకొనుటకై, మాండలిక ప్రభువులు స్థానికులై బలవంతులై యున్న తమ సేనాపతుల కుటుంబములతో వైవాహికాది సంబంధము లొనర్చుకొని, వారి విశ్వాస సహకారములను బడయుటకు ప్రయత్నించిరి. ఇట్టి పరిణామములు కారణముగా, యుద్ధము వృత్తిగానున్న వర్ణములన్నియు సమ్మిశ్రితములైనవి; ప్రాచీన క్షత్రియ వంశములు అంతర్ధానమైనవి. కాపు - క్షత్రియ వర్ణమున ముఖ్యముగ కమ్మవారిలో సూర్యచంద్ర వంశముల వారుభయులు కన్పించుటకు కారణముకూడ నదియే!

ఆంధ్రుల దురదృష్టమో అన్నట్లు క్రీ.త. 11వ శతాబ్దినుండియు నీవర్ణములమధ్య రాజకీయాధికారమునకై స్పర్ధ ప్రారంభమైనది. పల్నాటి యుద్ధమే ఇందలి ప్రథమాంకము. తరువాత రెడ్డి, వెలమల స్పర్ధఫలలితముగనే క్రీ.శ.15 శతాబ్దము నాటికి తెలంగాణామును బహమనీసుల్తాను లాక్రమించిరి. వీరితో సమకాలికులేయైనను కమ్మవారు విజయనగర యుగముననే పూర్తిగ విజృంభించిరి. పెమ్మసాని, రావెళ్ల, సూర్యదేవర, సాయపనేని కుటుంబములవారు విజయనగర రాజ్యచరిత్రలో శ్లాఘ్యమైన పాత్రను నిర్వహించిరి. ఈ

యుగమున కమ్మవారి విజృంభణ కొక ప్రత్యేక కారణముకూడా లేకపోలేదు. విజయనగరాధీశుల కొకవైపున వెలమలు, మరియొక వైపున రెడ్లు విరోధులైరి. అందుచే వారు కమ్మ, తెలగ వర్ణములను నాదరించి సేనాధిపతులుగా అమర నాయకులుగా, దుర్గాధీశులుగా నియమించిరి తరువాత కుతుబ్‌షాహీల కాలములో ఆంధ్రదేశములో చాలా భాగమునకు కమ్మవారు పాలకులై (క్రీ.శ. 1580) 'చౌదరి' బిరుదము ధరింపసాగినారు. 'చౌదరి' అనగా పన్ను వసూలు చేయునధికారి. రెడ్లు, బ్రాహ్మణులు మొదలైన వారు కూడా చౌదరి పదవులలో నియుక్తులైనారు గానీ ఈ గౌరవనామము కమ్మవారికే రూఢియైనది. కుంఫినీ యుగములో కూడా కమ్మవారు ముఖ్యముగా సర్కారు జిల్లాలలో జమీందారీలను బడసి పరిపాలన సాగించిరి. కానీ వీరు విజృంభించు నాటికి దేశము అన్యాక్రాంతమగుట కారణముగ రెడ్లవలె, కమ్మవారు ఆంధ్రదేశ చరిత్రలో "కమ్మయుగమును" సృష్టింపలేకపోయిరి.

గడచిన వేయి సంవత్సరాలుగా ఆంధ్రదేశ రాజకీయ సాంస్కృతిక పరిణామ వికాసములతో సన్నిహిత సంబంధముగల కమ్మవారి చరిత్రయగుటచే నీ గ్రంథము చరిత్ర ప్రియులందరి ఆదరణను పొందగలదని నా నమ్మకము.

---

* ఇటీవల ప్రచురింపబడిన ఒక తెలుగునవలలోఒక నియోగితోజరిగిన సంభాషణ సారాంశము:

నియోగిని అడిగిన ప్రశ్న: మీరు బ్రాహ్మణులా?

నియోగి ఇచ్చిన సమాధానము : కాదు, నేను నియోగిని

ఇట్టి రచనకు కారణము సమాజ పరిణామచరిత్రను గురించిన పూర్తి అజ్ఞానము, లేదా, కరడుగట్టిన శాఖాద్వేషము వలన సంభవించిన వక్రదృష్టి. వర్ణవిద్వేషములను రెచ్చగొట్టు నిట్టివిపరీతరచనలు సామాజిక శాంతికిగాని, ప్రజాస్వామ్య సిద్ధాంత ఆచరణకుగాని, జాతీయభావ సమైక్యతకుగాని గర్భశత్రువులు. సంస్కారముగల ప్రతియొక్కరు నిట్టి రచనలను బహిష్కరింపవలసియున్నది. కాగా పై నవల పారితోషికమును పొందుటే గాక విద్యార్థులకు పాఠ్యగ్రంథముగా కూడ నిర్ణయింపబడినది. ఇది చాల శోచనీయము.

---

శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలి ప్రచురించిన శ్రీ కొత్తభావయ్య చౌదరిగారు రచించిన "కమ్మవారి చరిత్ర" గ్రంథమునకు వ్రాసిన పీఠికా వ్యాసం. - 1962.

# 15. ఆంధ్రులలో విశిష్ట వ్యక్తిత్వాలు - త్రిపురనేని కవిరాజు

'కవులు సమాజానికి శాసన నిర్మాతలు' అనే అర్థాన్నిచ్చే సామెత ఇంగ్లీషులో ఉంది. మహాత్మా గాంధీ, రవీంద్రనాథ్ టాగూరుల నుద్దేశించి ఒక సందర్భంలో "ప్రవక్తలను పరిహసిద్దాం; కవుల సందేశాన్ని గౌరవిద్దాం" అన్నాడు యమ్.యన్.రాయ్. మన ప్రాచీన ఆలంకారికులు సైతం, కీర్తి, ధనము, వ్యవహారజ్ఞానము, కాంతాసమ్మిత తయోపదేశ సామర్థ్యము- కావ్య ప్రయోజనాలుగా గుర్తించారు. కవులు సమాజంలో భాగస్వాములేగాని, అతీతులుకాదు. సమాజంలోని మంచి చెడుల ప్రభావానికి వారు కూడా లోనౌతూనే ఉంటారు. సమాజంలోని చెడును నిరసించి నిర్మూలించటానికీ, మంచిని అభినందించి పెంపొందించటానికీ ప్రయత్నమొసరించటం వారి సాంఘిక ధర్మాలలోని భాగమే. ఆలోచనాపరులు, ఆవేశపరులునై నందున కవులు తమకుగల సాంఘిక బాధ్యతలను సులభంగా గుర్తింపగలుగుతారు. అందుచే తమ రచనల ప్రబోధంతో ప్రజలను చైతన్యవంతులను గావించి ప్రగతిపథంలో పురోగమించుటకు అవసరమైన మానసిక వాతావరణాన్ని సృష్టించి చరితార్థులౌతూ ఉంటారు, బాధ్యతనెరిగిన కవిరాజులు. జీవితంలోని ఏ రంగంలోనైనా మార్పుకు భావాలలో మార్పు అవసరం; భావాలు కార్యరూపం ధరించటమే ఆచరణ; ఆచరణకు స్థిరమైన రూపకల్పనయే సంస్థగా మారుతుంది. కాబట్టి సమాజ పురోగతికి నూతన భావ చైతన్యం అవసరం; ఆలంబనం. అట్టి చైతన్యాన్ని సృష్టించే వాడు కవి. అందుచేతనే కవులను మానవజాతికి శాసన నిర్మాతలనటం సముచితమైన వర్ణన.

ఆంధ్రుల సాంఘిక- సాంస్కృతిక జీవితంలో కవులు ప్రధాన భూమికలు ధరించి సమకాలీక అవసరాలను గుర్తించి తమ రచనల ద్వారా సమాజాన్ని తీర్చి దిద్దటానికి

ప్రయత్నించిన ఘట్టాలు నాలుగైదు స్పష్టంగా కన్పిస్తై. అట్టి వారిలో శివకవులు, తిక్కన, శ్రీనాథుడు, వేమన, కందుకూరి, గురజాడ, త్రిపురనేని రామస్వామి గణనీయులు. సమాజం పరిణామ శీలమైనది. పరిణామక్రమంలో ప్రతి భావానికి, సంప్రదాయానికి, సంస్థకు ఒక చారిత్రక ప్రాధాన్యమున్నది. సమకాలికంగా ప్రతి సిద్ధాంతము అభ్యుదయకర పాత్రనే నిర్వహించింది. ఒక భావంగానీ, సంస్థగానీ ప్రయోజనాన్ని కోల్పోయిన తరువాత సమాజానికి భారంగా అభివృద్ధికి నిరోధంగా పరిణమిస్తూ ఉంటుంది. ఇట్టి చరమదశలో వానిని సమర్థించటం, సంరక్షించటానికి పూనుకొనటం అవివేకం. ఇట్టి అవివేకులే సమాజంలోని ప్రతీపగామిశక్తులు. కానీ, వాని వాని చారిత్రక ప్రాశస్త్యాన్ని గుర్తింపక, నేడు అభ్యుదయానికీయ బడుచున్న నిర్వచనాల పరిభాషలో ప్రతి ప్రాచీన సంస్థను, భావాన్ని, సంప్రదాయాన్ని తెగనాడటం సముచిత మార్గం కాదు. అట్టి విధానం వల్ల ద్వేషాలు, కావేషాలు ప్రబలమై విప్లవ వ్యతిరేకశక్తుల సంఖ్య, బలము పెరిగి ఆశించిన సమాజ ప్రగతి కుంటుపడుతుంది. సంఘర్షణ కాక అభివృద్ధికి స్థిరమైన మార్గం సమన్వయమే. ఈ దృష్టితో పరిశీలించినప్పుడు పైన పేర్కొన్న కవులు తమ తమ కాలాలలో సమాజపరంగా ప్రయోజనకరమైన పాత్రనే నిర్వహించినట్లు స్పష్టమౌతుంది. తిక్కన్న వేమన్నల తెలుగుదనాన్ని, సమరదసదృష్టిని, నుడికారాన్నీ; శ్రీనాథుని స్వాతంత్ర్యేచ్ఛ, ధిక్కారభావము, వాదనాపటిమలను; శివకవుల విప్లవోద్వేగాన్నీ; కందుకూరి, గురజాడల సంస్కరణోత్సాహాన్ని, మానవత్వాన్నీ పుణికి పుచ్చుకొన్నాడు త్రిపురనేని రామస్వామి. వాస్తవానికి వారందరికీ అతడు వారసుడేగదా! ఐతే, సుసంపన్నమైన ఈ వారసత్వంలో, మరుగునపడిపోకుండా తన వ్యక్తిత్వాన్ని రక్షించుకొని, ఆంధ్రుల సాంఘిక చరిత్రలో భావవిప్లవ వైతాళికుడుగా, అభ్యుదయ తీర్థంకరుడుగా సముచితస్థానాన్ని ఆర్జించుకొన్నాడు త్రిపురనేని కవిరాజు.

కవిరాజు వ్యక్తిత్వం చాలా చిత్రమైనది. సర్వసమభావాన్ని ప్రచారంచేసిన మానవతావాది అతడు. కానీ భారతజాతీయత మూర్తీభవించి స్వాతంత్ర్యాన్ని కాంక్షించిన దేశభక్తుడు, ఐనప్పటికీ స్వరాష్ట్రాభిమాని; 'కాదని వాదుకువస్తే కటకందాకా మనదేరా' అని ప్రబోధించి,

వీరగంధం పూసి ఆంధ్రులను విశాలాంధ్ర రాష్ట్ర ఉద్యమానికి పురికొల్పినవాడు. జస్టిస్ పార్టీ నాయకుడు; ఆ రోజుల్లో జస్టిస్ పార్టీని బ్రిటిష్ ప్రభుత్వానికి విశ్వాసపాత్రుల పార్టీగా పరిగణించేవారు; కానీ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సమ్మెలు ప్రోత్సహించాడు; స్వదేశ ఉద్యమాన్ని బలపరిచాడు. ఆంగ్లభాషలో ఉన్నత పట్టాలు పొందాడు; చిక్కని నుడికారం ఉట్టిపడే తేట తెనుగులో మహాకవులు తలలూపేటట్లు కవిత్వం చెప్పాడు. పరిణామవాదంలో గాఢమైన విశ్వాసంకలవాడు; కానీ గ్రాంథిక భాషావాదివలె కన్పిస్తాడు. త్రిపురనేని పేరుకు దగినట్లు లయకారుడు; తమ బరువుతో సమాజాన్ని అణగారుస్తున్న చివికిపోయిన సంస్థల నిర్మూలనకు కంకణం కట్టినవాడు; అంతమాత్రమేకాదు. ప్రగతిశీలమైన సమాజానికి, శాస్త్రబద్ధమైన నూతన సిద్ధాంతాలపై క్రొత్త పునాదులు నిర్మించటానికై జీవితం ధారపోశాడు కవిరాజు.అందుచేతనే వేరు వేరు కోణాలనుండి వేరు వేరు రంగులు కన్పించే దుర్భిణి అతని జీవితం. ఈ కారణంచేతనే సమగ్రంగా అర్ధంచేసికొనకుండా సంప్రదాయ ప్రియులైన సనాతనులు కవిరాజును కువిమర్శలకు గురిచేశారు. ఇందులో అసహజం యేమీలేదు. చరిత్రలో సంస్కర్తలందరికీ పట్టిన దుర్గతియే అది. కానీ ధైర్యంగా అచంచల దీక్షతో మౌఢ్యాన్ని, కువిమర్శలను ఎదిరించి తన ఉద్యమాన్ని సాగించాడు కవిరాజు. సత్యాన్వేషణకు, సత్యస్థాపనకు ధైర్యము, త్యాగశీలము అవసరం. ధైర్యంతోకూడిన సత్యాన్వేషణాసక్తియే నాగరికతా పురోగతికి మూలమైనది. అట్టి మహనీయుల ఉదారత్యాగాలే నాగరికతకు పునాదులు. మౌఢ్యం మీద వివేకం సాధించిన విజయాలే నాగరికతా పురోగతి చరిత్ర.

మనదేశంలో ఆంగ్ల సార్వభౌమత్వం స్థాపింపబడిన అచిరకాలానికే పాశ్చాత్య విద్యాసంస్కృతుల ప్రభావం ఫలితంగా విజ్ఞాన పునరుజ్జీవనోద్యమం ప్రారంభమైంది. భారత చరిత్రలో సంస్కరణోద్యమాలుగానీ, స్వర్ణయుగాలుగానీ విదేశదండయాత్రల ఫలితంగానే జరగటం గమనింపదగిన విశేషం. నిన్నమొన్న జరిగిన చైనా దాడి సైతం భారతీయులలో ఐక్యతను సంఘటిత పరచి ప్రయోజనకారియైనదని చైనాకు కృతజ్ఞత చెప్పుకునే రాజకీయ నాయకులు లేకపోలేదు! స్వతంత్ర జాతిగా ఇంతకంటే సిగ్గుచేటు

మరొకటి కన్పింపదు. ఈ పరిస్థితివలన, మన జాతి, స్వయంగా పురోగమింపగల శక్తిని చేకూర్చగల చేవ మన సంస్కృతిలో కొరవడినదా? అందుకు కారణమేమి? అనే ప్రశ్నలు సహజంగా ఉత్పన్నమౌతై. 19వ శతాబ్దంలో విజ్ఞాన పునరుజ్జీవనోద్యను నాయకులు రాజా రామమోహన రాయలు, దయానంద సరస్వతి; బ్రహ్మసమాజ, ఆర్యసమాజ స్థాపకులు. ఈ రెండును కొంచెం హెచ్చుతగ్గుగా పునరుద్ధరణ వాదాలే. ఆర్యసమాజానిది కర్మమార్గం; స్మృతులను పురాణేతిహాసాలను, భగవద్గీతను తిరస్కరించి శృతులను మాత్రమే అంగీకరించి, ఆదిమ పూజా విధానమైన యజ్ఞాలను పునరుద్ధరించింది. దురదృష్టవశాత్తు ఆర్య సమాజం చాలావరకు వ్యతిరేక ఉద్యమంగా రూపొందింది; ఆంధ్రదేశాన్ని పరిశీలిస్తే తెలంగాణంలో ముస్లిం వ్యతిరేక ఉద్యమంగానూ, సర్కార్లలో బ్రాహ్మణ వ్యతిరేకుద్యమంగానూ పరిణమించినట్లు కన్పిస్తుంది. చిరకాలంగా తమకు వైదిక కర్మలకు అర్హతను నిరాకరించిన బ్రాహ్మణులపై ప్రతీకారం సాధించటానికి పనికిరాగలదని బ్రాహ్మణేతరులు ఆర్యసమాజాన్ని ఆదరించారా అనిపిస్తుంది. ఇంచుమించు ఈ ఉద్యమానికి అనుబంధంగానే "స్వసంఘ పౌరోహిత్య ఉద్యమం" ముమ్మరంగా సాగింది. ఈ ఉద్యమ ఉద్దేశ్యం పురోహితవర్గ దురాశను, నిరంకుశత్వాన్నీ రూపుమాపటమే. కానీ ఫలితం? దీనివల్ల కలిగిన వర్ణ వైషమ్యాల మాట అటుంచి, పురోహిత వర్గం సంఖ్యాబలంలో పెరిగి సమాజంలో విస్తరించి ఆశించిన దానికి వ్యతిరేక ఫలితాలను మాత్రమే ఇచ్చింది. ఇక, బ్రహ్మసమాజానిది జ్ఞానమార్గం. దీనికి ఉపనిషత్తులు ఆధారం; ఈ ఉద్యమంలో పాశ్చాత్య సంస్కృతీ ప్రభావం గోచరిస్తుంది. సమరస భావము, విశ్వజనీనత సమన్వయ పద్ధతిబ్రహ్మ సమాజ సిద్ధాంతాలలో స్పష్టం. కాని బ్రహ్మ సమాజంలోని ఈ వైదేశిక ప్రభావానికి నిరసనగా పూర్తి దేశీయ సంస్కృతీ పునరుద్ధరణ కాంక్షతో ఆర్యసమాజం ప్రారంభమైంది. ఐతే, ఉపనిషత్తులలోని బ్రహ్మ పదార్థమే బ్రహ్మ సమాజ సిద్ధాంతాలకు మూలసూత్రమైంది. ఈ బ్రహ్మ పదార్థం శాశ్వతం; ఆది మధ్యాంతరహితం; ఎన్నటికీ మారనిది; మార్పులేనిది. ప్రగతికి మూలమైన పరిణామ సిద్ధాంతానికీ, ఇట్టి బ్రహ్మ పదార్థంలోని విశ్వాసానికీ పొత్తుకుదరదు. కావున బ్రహ్మసమాజం సైతం మన దేశంలో పై పై సంస్కరణలకు మాత్రమే దోహదంచేసినదిగాని భారతీయుల మనస్తత్వంలో

మౌలికమైన మార్పులకు అవసరమైన తాత్విక బలాన్ని చేకూర్చలేకపోయింది. ఆంధ్రదేశంలో అపర రామమోహనరాయలనిపించుకున్న వాడు కందుకూరివీరేశలింగం. అనేక కష్టనిష్ఠూరాల నోర్చి సనాతనుల కువిమర్శలను ధైర్యంతో ఎదిరించి నిలిచి సాంఘిక సంస్కరణలు సాగించాడు. కాని, తాను సూచించే సాంఘిక సంస్కరణలు, హిందూ ధర్మశాస్త్రాలు ఒకయుగంలో తయారైనవి కావు. నేటి హిందువులకంటె వారి ప్రాచీనులే వివేకవంతులు; ఏ యుగానికి అనుకూలమైన ధర్మాన్ని ఆ యుగంలో రూపొందించుకొన్నారు; మార్పుకు వారు సర్వదాసుముఖులే. అందుచేతనే మన ధర్మశాస్త్రాలలోను, పురాణాలలోను పరస్పర విరుద్ధ విషయాలుకన్పిస్తై. క్రమంగా ఆయా ధర్మశాస్త్రాల చారిత్రకనేపథ్యాలు మరుగునపడిపోయి, అవి అన్నీ అపౌరుషేయాలేనని, దైవశాసనాలని, అందుచే శిరోధార్యాలనీ వాదించే అవివేకం ప్రబలింది. ఈ కారణంచేతనే మన ధర్మ శాస్త్రాలు ఆధారంగా జరిపే సంస్కరణలు తాత్కాలిక ప్రయోజనాన్ని పొందుతై; అందుచే సమాజం ప్రతి యుగంలోనూ గానుగెద్దువలె తయారై, ఒక్క అడుగుకూడా ముందుకు కదలలేకపోయింది. సంస్కరణలకు, పురోగతికి విదేశ దండయాత్రలవసరం కావటానికి ఇట్టి మనస్తత్వము, సంప్రదాయములే కారణం.

ఈ లోపాన్ని కవిరాజు గుర్తించినట్లు కన్పిస్తుంది. మొదట్లో అతడు ఆర్యసమాజం వైపు మొగ్గుచూపిస్తాడు; స్మృతులను తిరస్కరించి శృతుల నంగీకరిస్తాడు. శంబుకవధలో శంబుకునిచేత "చతురామ్నాయములం దలంచుచు నమస్కారంబులన్ జేయుచున్ స్మృతిధిక్కారము సల్పబూనితిమి మా క్షేమాభిలాషం బుచే" అనిపిస్తాడు. సూతునిచేతనే పురాణాలు "పిట్టకథలకు నివియెల్ల బుట్టి నిండ్లు" అనిపించాడు. క్రమంగా కవిరాజు బ్రహ్మసమాజంవైపు పురోగమించాడు; "ఏది చరాచరంబయిన సృష్టికి సర్వము మూలకారణంబేది...నిత్య సత్య పరతత్వ మహత్వము నాశ్రయించెదన్", "జగన్నాటక సూత్రధారియయినాడెవడో అతనిందలంచెదన్" అనే ప్రార్థనలకు కారణము బ్రహ్మ లేక పరమాత్మలో విశ్వాసమే. "ఇది జ్ఞానమార్గానికి లక్షణం. జ్ఞానవాదానికి పరాకాష్ఠయే హేతువాదం. దానికి నిదర్శనం మతంలో విశ్వాసం సడలటమే! కవిరాజు నాస్తిక వాదిగా

పరిణామం పొందాడనే వారు లేకపోలేదు. ఏమైనా మతాన్ని తిరస్కరించాడనేది యదార్థం. మతాల వల్ల మానవ జాతికి మేలుకంటే కీడే అధికం జరిగిందని స్పష్టంగా చాటాడు. 'మతమనుమాట మోసముసుమా అదె మూలము ధర్మపీడకున్' అనీ, 'మతములె పుట్టకున్నయెడ మారణ కర్మములిన్ని సాగునే' అనీ బోధించాడు. ఐరోపాలో మధ్యయుగాంతంలో విజృంభించిన విజ్ఞానోద్యమ వైతాళికుడైన ఎరాస్మన్ లక్షణాలు త్రిపురనేనిలో కన్పిస్తై. ఎరాస్మన్ మానవతావాద ఉద్యమనాయకుడు. రాజా రామమోహన రాయలును ఇండియన్ ఎరాస్మన్ అన్నారు. త్రిపురనేని ఆంధ్ర ఎరాస్మన్. తన గ్రంథాలలో (Praise of Folly) మతవాదులను తూర్పార బట్టాడు ఎరాస్మన్. సునిశిత హాస్యంతో మతసంస్థల పునాదులను కదలించి వేశాడు. మార్టిన్‌లూథర్ ఆగ్రహం కంటె ఎరాస్మన్ హాస్యమే చర్చి అధికారానికి గర్భ శత్రువైనది అన్నారు. మతంలో, మతసంస్థలలో ప్రజల విశ్వాసాన్ని సడలించటానికి త్రిపురనేని ప్రయోగించిన ఆయుధంకూడా అదే. ఇంద్రుని గురించి వర్ణిస్తూ:

వేయిగన్నులు నాకు గన్పింపలేదు
పొడలు మాత్రము గన్పించె నొడలినిండ

అంటాడు. అదే ధోరణిలోస్వర్గాన్ని 'బాగు! శివశివా! అది వట్టి భోగభూమి, యుండరాదిందు మావంటి యోగులకును' అంటూ తిరస్కరిస్తాడు బహుశా త్రిపురనేని ప్రభావం ఫలితమే కావచ్చు! తరువాతియొక కవి స్వర్గాన్నీవిధంగా వర్ణించాడు:

వలపు పస్తులు కడుపు కొందలముగన్న
చెనటి కవిగాడు దీని సృజించియుండు.

ఇక దేవతలంతా కేవలం లంచగొండులట!

ముడుపుగట్టిన గాని సమ్మోదపడరు
వేటతల జూచి కాని మోమోటపడరు.

అట్టి దేవతలకు లంచాలిచ్చి మానవులు అవినీతి పరులగుట యెందుకు? పోనీ

లంచమిచ్చినా, మానవులనాదుకొంటారా అంటే అదీ అనుమానమే. కారణం?

ఇల్లును వాకిలింగలిగి
ఇద్దరొ ముగ్గురొ యాండ్రుగల్గి పై
బిల్లలుజల్లలుంగలిగి
వెక్కసమైన కుటుంబభారమున్
వెల్లువనీద లేక పల
వించెడి దైవతకోటి నామొఱల్

ఆలకించి రక్షిస్తారనే విశ్వాసం కుదరటానికి అవకాశమే కన్పింపదు గదా!

ఇక పితృదేవతల తృప్తికై హిందువుల సంప్రదాయాన్ని గురించి కవిరాజు అంటాడు.

పుడమి తలంబు నందు బడ
బోసిన దోసెడు మంచినీళ్లగు
ప్పెడు మెదుకుల్ తమంతట నె
యేపగిదిం బితృలోకమందునుం
డెడు పితరుల్ గ్రహింపగ వ
డిన్ జను దారినినిల్వకుండ నే
జడమతులైన నీనుడులు
సత్యములంచును విశ్వసింతురే?

జడమతులే విశ్వసింపని యీ మూఢాచారములను ఆలోచనాపరు లాచరించుటలోని ఆంతర్యమేమి?

మత మౌఢ్యంనుండి విముక్తి సాధించి, శాస్త్రీయదృక్పథాన్ని అలవరచుకోవాలనీ, హేతుత్వంతో బుద్ధి నుపయోగించి, మంచిచెడులను పరామర్శించాలని కవిరాజు

ఉద్భోధ. శాస్త్రీయమైన పరిణామ సిద్ధాంతాన్నాతడు సమాజానికి వర్తింపచేశాడు. సమాజం ప్రగతి శీలమైనది. ప్రగతిపథంలో ఏ యుగానికి ఆ యుగం ఒకసోపానం; కాబట్టి ఒక్కొక్క యుగంలో, ప్రాతబడి నిష్ప్రయోజనములైన ఆచారాలను త్యజించి, క్రొత్తవానిని నిర్మించుకొనటం సహజమైన మానవధర్మం. ఇందుకు విరుద్ధంగా వేదాలలో, ఉపనిషత్తులలో, భగవద్గీతలో నేటి సాంఘిక సమస్యలకు పరిష్కార మార్గాలు, పురోగమన సాధనాలు వెదకటం వెఱ్ఱితనం; వెనుకజూపుతో ముందుకు నడవటం వలె ప్రమాదకరం! కాబట్టి వానికి కేవలం చారిత్రక ప్రాధాన్యమును మాత్రమే అంగీకరించి సమకాలిక మానవ ప్రగతి అంతస్తుకు అనుకూలమైన ధర్మాన్ని, సంస్థలు నిర్మించుకోవాలి. అందుకు సమాజంలో భావ విప్లవం అవసరం. అంటే ప్రాతను తిరస్కరించి క్రొత్తను నిర్మించుకొనగల ధైర్యం, ఆత్మవిశ్వాసం అవసరం. అట్టి భావ విప్లవం సాధించే ఆశయంతోనే కవిరాజు సూతపురాణం, భగవద్గీత వ్రాశాడు.

సూతపురాణంలోని అంశం మన ప్రాచీన పురాణాలలోని కథలే! కాని వానినుండి శాస్త్రీయమైన చారిత్రక అర్థాన్ని వెలికిదీశాడు కవిరాజు. వాస్తవానికి, మన ఇతిహాసాలు, పురాణాలు- ఆర్య విజేతలు తమ్ము ప్రతిఘటించిన దేశభక్తులను, స్వాతంత్ర్య ప్రియులను నీచంగా వర్ణిస్తూ, దేశద్రోహులను, జాతి ద్రోహులను శ్లాఘిస్తూ వ్రాసిన మన ప్రాచీన చరిత్రయే! సమాజ పురోగతి సూత్రాలను గ్రహించటానికి చారిత్రక జ్ఞానం అవసరం; శాస్త్రీయ దృక్పథంతో చరిత్రను పరిశీలించినప్పుడే చరిత్ర అధ్యయనంవల్ల ప్రయోజనం ఉంటుంది. సత్యశోధనగాక, ఏదో ప్రయోజనానికి కొరముట్టుగా చరిత్రను మలచటంవల్ల దారుణ ఫలితాలు కలుగుతై. చారిత్రక సత్యాలను- సత్యం సాధారణంగా వికృతంగానే కన్పిస్తుంది- యథాతథంగా అంగీకరింపగల ధైర్యం, ఆ గుణపాఠాలు మార్గదర్శకంగా భవిష్యత్తును నిర్మించుకొనగల సామర్థ్యం అలవరచుకొనటంలోనే మానవత్వం సఫలీకృతమౌతుంది. మసి బూసి మారేడుకాయచేసే ప్రయత్నాల వలన ముందు ముందు తీవ్ర ప్రమాదాల నెదుర్కొనవలసివస్తుంది. వాస్తవానికి భారతీయులకు పెద్దగా చారిత్రక దృష్టిగాని, చరిత్ర గుణపాఠాలపట్ల లక్ష్యంగానీ ఉన్నట్లు కన్పింపదు. చరిత్ర

అంటే అసత్యాల పుట్ట అని మనవారి విశ్వాసం. ఈ తత్వమే నేటి "హిందూ" దేశభక్తులలో విపరీతంగా కన్పిస్తున్నది. పురాతత్వ పరిశోధనలన్నా, వాని ఫలితాలన్నా వారికి విపరీతమైన ద్వేషం అనటానికి ఇటీవల వెలువడిన "శాతవాహనుని రాచిప్ప" అనే కథ చక్కని తార్కాణం. ఇందుకు కారణం, కేవల అహంకార పూరితమైన తమ సిద్ధాంతాల గాలిమేడలకుపునాదులు లేవని పురాతత్వ సత్యాలు నిరూపించుననే భయమేగాని మరొండుకాదు. ఈ మనస్తత్వాన్ని తొలగించి పౌరాణిక ఆధారాలను సవిమర్శకంగా పరిశీలించి వానినుండి చారిత్రకాంశల నుద్ధరించాడు కవిరాజు. ఆ ప్రయత్నమే సూతపురాణం. మన పురాణాల్లో దేవరాక్షస యుద్ధాలు ఆర్య అనార్య సంఘర్షణలేననీ రావణాదులను వికృతంగా ఆర్యకవులు వర్ణించటానికి వారు ఆర్యవిస్తరణ నరికట్టటమేననీ నిరూపించాడు. నేటికీ మధ్య యిండియాలోని 'గదబులు' తాము రావణ వంశీయులమని చెప్పుకొంటారు; వారిలోని సిడుల వంటి ఒక మతాచారానికి మేఘనాదమని పేరు! ఇదేవిధంగా బలి, ప్రహ్లాదాదుల యదార్థ చరిత్రలు వెలువరించాడు. ఋజుచారిత్రక పరిజ్ఞానం కలిగినప్పుడే "ప్రాతదైనంత మాత్ర భవ్యంబు కాదు, నవ్యమైనంతమాత్ర నింద్యంబుకాదు" అనే దృష్టి కలుగుతుంది; సమాజానికిగల ప్రగతి శీలాన్ని గ్రహింపగలుగుతాం; ప్రాతను పరిత్యజించి క్రొత్త సమాజాన్ని నిర్మించుకునే నైతిక బలం లభిస్తుంది.

ఈ నూతన సమాజానికి కేవలం మానవత్వాన్ని పరిగణించే సిద్ధాంతమే పునాది కావాలని ప్రబోధించాడు కవిరాజు భగవద్గీతలో! వర్ణము జాతి, భాష అనే అడ్డుగోడలు తొలగి మానవజాతిలోని ఏకత గుర్తింపబడాలి! దాన్ని మించిన ధర్మంలేదు. భగవద్గీతలో నాయునిచేత యీ మాటలనిపిస్తాడు:

"స్వపరపక్ష భేదభావంబునీవంటివానికుండు"

(నాకు లేదు)

"ఒక్క భాషప్రియంబు కొండొక్క భాష

విప్రియమ్ము నాకనుమాట వెగటుమాట".

ఇక విశ్వరూపసందర్శన యోగంలో, భగవంతుడనే వాడుంటే అతనికి మానవులందరూ సమమే అనే భావం స్పష్టపడునట్లు బాలచంద్రునిచేత అనిపిస్తాడు:

యవన పహ్లావ బర్బరద్రవిడ...

హూణ, నీగ్రో,చీన... నిఖిలజాతు

లన్ని నీ యందె కులకులలాడుచుండె.

కొందరు ముఖం నుండి పుట్టటం గాని, మరికొందరు పాదాల్లో పుట్టటం గానీ లేదు!

ఆ చార యవనికాభ్యంతరమున మ్లేచ్ఛబుద్ధితో దాగుచు,

స్పర్శదోషంబు, దృష్టి దోషంబటంచు

బతితమై పోవుచున్న

జాతిని పై సిద్ధాంతాలమీద పునస్సృష్టి చేయటమే కవిరాజు సంకల్పం! ఆ ఆదర్శంతోనే కలంపట్టి, అభివృద్ధినిరోధకశక్తులపై యుద్ధం ప్రకటించి వాని పునాదులను కదలించి 'సిద్ధార్థుడు' కాగలిగాడు.

దయానందుని, గాంధీని నాస్తికులుగా మతద్రోహులుగా, దేశద్రోహులుగా పరిగణించి హత్యచేసిన ఛాందసులు కవిరాజును గౌరవిస్తారని ఆశించటం కంటె పొరబాటు మరొక టుండదు. చివికిన భావాలతో సంప్రదాయాలతో జన్మహక్కులతో వర్ణ వైషమ్యాలతో ప్రగతికి ప్రతిబంధకమైన హిందూ సామాజిక వ్యవస్థపై విప్లవ ధ్వజమెత్తాడు కవిరాజు. ఆ వ్యవస్థతోనే తమ మనుగడ ముడిపడియున్నదనీ, అది నశిస్తే తమ సంస్కృతికే ముప్పురాగలదనీ పొరబాటుగా భావించారు అగ్రవర్ణాలు. ఆ పొరబాటే కారణంగా, కవిరాజును బ్రహ్మద్వేషిగా చిత్రించి దూషించారు. సమాజ అభ్యున్నతి నాశించి ప్రారంభించిన ఈ మహోద్యమానికి నాయకత్వం వహించి విజయం సాధించవలసిన విద్యావంతులైన అగ్రవర్ణాలు ఉద్యమ అవరోధకులగుట శోచనీయం!

కవిరాజు ఉద్యమం విజయవంతం కావడానికి పలువురు కవిరాజులు అవసరం. ఆంధ్రదేశంలో కవులకు కొదువలేదు. కానీ వీరిలో "నరమేధం చేయాలనీ నరరక్తం త్రాగాలనే" ఆటవిక ప్రవృత్తితో ఆనందించే వారేగాని ప్రజలలో మానవత్వం ప్రబోధించి అభ్యుదయ పథాన నడిపింపగల సమర్థులు తక్కువ. కవిరాజే అన్నాడు:

"కవుల స్వాతంత్ర్యమో మంటగలిసిపోయె
బొట్టకూటికి వలువట్లు పుట్టినపుడె;
అడ్డమైన దేవురు గొట్టు నాశ్రయించు"

కవులు సమాజానికి ప్రగతిశీలమైన శాసన నిర్మాతలెట్లు కాగలరు? మన కవులు తమ బాధ్యతను గుర్తించి, శివకవులు, వేమన, కవిరాజుల సంప్రదాయాలను నిలబెట్టి నూతన సమాజ నిర్మాణంలో భాగస్వాములు కాగలరని ఆశిద్దాం!



---

In Quest of freedom — A.G.K. Commomerative Volume - 1968.

# 16. ఆంధ్రులలో విశిష్ట వ్యక్తిత్వాలు
# మల్లంపల్లి సోమశేఖరశర్మ

కీర్తిశేషులైన మల్లంపల్లి సోమశేఖరశర్మగారు డిగ్రీలు లేని పండితులే అయినా నాటికీ నేటికీ ఆంధ్ర చరిత్రకారుల్లో అగ్ర తాంబూలానికి అర్హతసాధించిన పరిశోధక శిరోమణి. పశ్చిమ గోదావరిజిల్లా మినుమించిపల్లిపాడులో 1891లో జన్మించిన శర్మగారు బాల్యంలోనే రాజమహేంద్రవరం చేరి మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణులై పాత్రికేయుడుగా సారస్వత జీవితం ప్రారంభించారు. నాడు సంఘసంస్కరణోద్యమాలకు సారస్వతోద్యమాలకు ఆంధ్రదేశంలో రాజమహేంద్రవరం కేంద్రంగా ఉండేది. అచటి భాషాపరమైన సాంస్కృతిక పునరుజ్జీవన వాతావరణ ప్రభావంతో శర్మగారు కథలు, నాటకాలు, నవలలు, పద్యాలు రచించి వివిధ పత్రికల్లో ప్రచురించి పండితలోకం దృష్టినాకర్షించడమే గాక తెలుగుసాహిత్య రంగంలో సముచితమైన శాశ్వత స్థానం సంపాదించినారు.

యావద్భారతంలో నాడు సాంస్కృతపునరుజ్జీవనానికి రాజకీయ చైతన్యానికీ చరిత్ర ఆలంబనగా ఉండేది. దేశభక్తికి చారిత్రక పరిజ్ఞానం ఆధారమనడం సర్వజనవేద్యమే. ప్రాచీనకాలంలో భారతదేశం సాధించిన మహోన్నత సాంస్కృతిక శిఖరాలను తిరిగి అధిరోహించడానికి రాజకీయ స్వాతంత్ర్యం తప్పనిసరా అనే దృష్టితో మేధావివర్గం జాతీయోద్యమంలో చేగుతున్న రోజులు అవి. యువకులు ఉత్సాహవంతులైన శర్మగారిని చరిత్రపరిశోధన ఆకర్షించడంలో ఆశ్చర్యంలేదు. అచిరకాలంలో శర్మగారు చరిత్ర పరిశోధనే తన జీవిత లక్ష్యంగా చేసుకొన్నట్లు కన్పిస్తుంది. శర్మగారిలో దేశభక్తి ఆంధ్రాభిమానమూ అపారం. వారి స్వరూపం ఆంధ్రత్వం మూర్తీభవించినట్లు ఉండేది. దేశాభిమానంతోనే యువతరంలో దేశభక్తిని స్వాతంత్ర్య దీక్షను ఉత్తేజితం చేసే ఉద్దేశంతోనే బహుశా శర్మగారు అనంతర కాలంలో 'తెలుగు వీరుల'ను గురించి వ్రాశారు. శర్మగారి

కార్యాచరణ స్థానం రాజమహేంద్ర వరంనుండి రాష్ట్ర రాజధానియైన మద్రాస్ నగరానికి మారింది.

ఆరోజుల్లో 'చరిత్ర చతురానను'లైన చిలుకూరి వీరభద్రరావుగారు ఆంధ్రుల చరిత్రను రచిస్తుండేవారు. వారితో శర్మగారికి పరిచయం ఏర్పడి వారికి సాయంగా ప్రాచీన కావ్యాలకు శాసనాలకు ప్రతులు వ్రాయడం జరిగింది. అనంతరం కొమర్రాజు వెంటకలక్ష్మణరావు గారితోను కాశీనాథుని నాగేశ్వరరావుగారితోను విజ్ఞానసర్వస్వంలో కృషిచేశారు. ఈ పరిశ్రమతో శర్మగారికి చరిత్ర పరిశోధనలోను శాసనపరిశీలనలోను శ్రద్ధాసక్తులు బలపడడమేగాక మంచి శిక్షణ లభించింది.

నాటికి ఆంధ్రదేశంలో చరిత్ర పరిశోధన ప్రాథమిక దశలోనే ఉంది.చరిత్ర రచనకు మౌలిక పురావస్తు సాక్ష్య ఆధారమైన తామ్ర శిలాశాసనాలు ప్రజల అజ్ఞానానికి బలియై నష్టమవుతూ ఉండేవి. ఆ శాసనాల లిపిగాని భాషగాని మనకు సన్నిహితమైనవి కానందున సామాన్యులు వానిని చదువలేరు. దాని ప్రాముఖ్యం గ్రహించలేరు. అట్టి శాసనాలను రక్షించి వెలుగులోనికి తెచ్చి విశ్లేషించి వ్యాఖ్యానించడం కూడ చరిత్ర కారుని బాధ్యతగా ఉండేది. ఈ బాధ్యతను నిర్వహించడానికి శర్మగారు నడుంకట్టారు. ఒంటరిగాను, మిత్రులు నేలటూరి వెంకటరమణయ్య గారితో కలిసీ నెల్లూరు జిల్లాలోను రాయలసీమ జిల్లాల్లోనూ శాసన అన్వేషణ యాత్రలు జరిపినారు. ఈ యాత్రల్లో శర్మగారు ఎదుర్కొన్న సమస్యలు, కష్టనష్టాలు, శాసనాలను గురించి హాస్యాస్పదమైన ప్రజల మూఢవిశ్వాసాలు 'నా నెల్లూరుజిల్లా పర్యటన' అనే వ్యాసాల్లో శర్మగారు వివరించారు. శర్మగారిని 'శాసనాల శర్మగారు' అంటూ ప్రజలు సాదరంగా గౌరవిస్తుండేవారు. ఈ అన్వేషణఫలితంగా అశోకమౌర్యుని ఎర్రగుడి శిలాశాసనాలు పల్లవ, తెలుగుచోడ, రెడ్డి, విజయనగర మొదలైన ఆంధ్రదేశాన్ని పాలించిన వివిధ రాజవంశాల శాసనాలు అనేకం వెలుగులోకివచ్చాయి. అశోకుని శిలాశాసనాలు దక్షిణాంధ్రంలో దొరకడంలోని చారిత్రక ప్రాశస్త్యం వివరించనక్కరలేదు. ఎర్రగుడిపాడు, పొట్లదుర్తి-మాలెపాడుల్లో దొరికిన రేనాటిచోడుల శాసనాలు ప్రాచీన తెలుగు భాషా స్వరూపాన్నీ భాషపరిణామ రీతిని

గ్రహించడానికి ఉపకరిస్తున్నాయి.

తాము సేకరించిన శాసనాలను విశ్లేషించి లిపి ప్రత్యేకతలను చారిత్రకాంశాల ప్రాముఖ్యాన్నీ వివరిస్తూ ఎపిగ్రాఫియా ఇండికా, భారతి, శారద, ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచిక మొదలైన పత్రికల్లో వ్యాసాలు ప్రచురించి ముందుతరాల చరిత్ర సాహిత్య భాషాశాస్త్ర పరిశోధకులకు శర్మగారు మహోపకారం చేశారు. ఘంటసాల ప్రాకృత శాసనాలను గురించిన శర్మగారి వ్యాసం వారి అనంతరం ప్రచురితం కావడం దురదృష్టం. ఈ శాసనాల్లో ఒకటి మలిశాతవాహన యుగానిది. మిగిలిన నాలుగూ ఇక్ష్వాకుల ఆలంకారిక లిపిలో ఉన్నాయి. శాతవాహన-ఇక్ష్వాకుయుగంలో 'కంటకశిల' పేరున ఘంటసాల సుప్రసిద్ధ బౌద్ధ క్షేత్రం. గౌతమ సిద్దార్థుని అభిమానవాహనమైన కంటకమనే గుర్రంపేర కంటకశిల ఏర్పడిందన్న శర్మగారి సూచన సముచితంగా ఆలోచనాత్మకంగా ఉంది.

ఘంటసాల శాసనాల్లో మహానావికుని ప్రసక్తి ఉంది. ఘంటసాల్లోనే ప్రాచీన రోమన్ బంగారు నాణేలు దొరికినాయి. అందుచే గ్రీకునావికుల రచనల్లోని కంటకోసిల రేవు పట్టణం ఘంటసాలేనని స్పష్టమవుతున్నది.పులోమావి నౌకానాణేలకి శాసనాలు సార్థక్యం చేకూరుస్తున్నాయి.

లిపి శాస్త్ర వైదుష్యంలో శర్మగారితో సరితూగగల పండితులు ఆంధ్రదేశంలో నాటికీ నేటికీ లేరు. శాసన పరిశధనలో అఖిలభారత పరిగణన పొందిన ఆంధ్ర చరిత్రకారులు శర్మగారు ఒక్కరేననడంలో అతిశయోక్తి లేదు. కొత్త శాసనం లభించడంతో దాన్ని చదవడంలోగానీ అందలి చారిత్రకాంశాలను వ్యాఖ్యానించడంలోగానీ శర్మగారిలో తొందరపాటు వుండేదికాదు. ఏ సమస్యనైనా భిన్నదృక్కోణాల నుండి పరిశీలించి సమన్వయ శాస్త్రీయ దృష్టితో చర్చించిన తరువాతనే నిర్ణయాలు చేసి వెల్లడించేవారు. ఇందుకు అహదనకర శాసనంపై శర్మగారు జరిపిన చర్చయే మంచి ఉదాహరణ. ఈ శాసనం క్రీస్తుశకం ఎనిమిదో శతాబ్ది పూర్వార్ధానికి చెందిందని చారిత్రకులు నిర్ణయిస్తున్నారు. ఈ శాసన భాష తమిళమనీ, తెలుగనీ, సంస్కృతాంధ్రాలనీ భిన్న అభిప్రాయాలున్నాయి.

ఇందలి అక్షర స్వరూపాన్నీ, పదాల అర్థాన్నీ గురించి నేటికి గూడా పండితుల్లో ఏకాభిప్రాయం లేదు. అహదనకర శాసనభాగాన్ని శర్మగారు ప్రచురించారు. ముఖ్యంగా ఆ శాసనంలోని 'ష్ఞ' శకట రేఫలను గురించి శర్మగారికీ వేటూరి ప్రభాకర శాస్త్రి గారికీ మధ్య జరిగిన వాద ప్రతివాదాలు తెలుగు లిపి శాస్త్రంలో చరిత్రాత్మకమైనవి. శర్మగారు శకటరేఫగా గుర్తించిన అక్షరాన్ని శాస్త్రిగారు ష్ఞగా చదివారు. శకటరేఫను భిన్నకాలాల్లో భిన్న పద్ధతుల్లో లిఖించేవారనీ ఏ స్వరూపంలోనైనా అడ్డగీత సర్వత్రా సమానమనీ అందుచే తన పాఠమే సరియైనదనీ అనేక శాసనాలనుండి ఉదాహరణలు గుప్పిస్తూ శర్మగారు నిరూపణ చేసినారు. ఈ చర్చ శర్మగారి పట్టుదలకు, లిపిశాస్త్రంలో వారి పాండిత్యానికి వాదనా సామర్థ్యానికీ నిదర్శనం. అయితే ఎంతటి పట్టుదల ఉన్నా పొరబాటును అంగీకరించి తన నిర్ణయాన్ని పునఃపరిశీలించి సరిదిద్దుకొనడంలోను, ఎదుటివారి సూచనలను గౌరవించడంలోను ఎంతో సహృదయత, విశాల దృష్టి శర్మగారిలో కన్పిస్తాయి.

లిపి శాస్త్రంలోనేగాక ఆంధ్ర వాస్తు శిల్ప స్వభావ నిరూపణలో, ప్రతిమా స్వరూప నిర్ణయంలో శర్మగారు ఆరితేరిన వారు. 'అమరావతీ స్తూపం' అనే తమ గ్రంథంలో ఆంధ్ర బౌద్ధ వాస్తువులోని తీరుతెన్నులు నాటి స్థపతుల శక్తిసామర్థ్యాలు, సహజ సౌందర్యం ఉట్టిపడే శిల్పాలు గండరించడంలో శిల్పాల నైపుణ్యమూ విపులీకరించారు. 'హిందూ దేవాలయం' అనే వారి వ్యాసంలో ఆలయ వాస్తు వివరణ కన్పిస్తుంది. బౌద్ధ హిందూ వాస్తువులను గురించి తెలుగులో మొదట వ్రాసింది శర్మగారేనని చెప్పవచ్చు. మొగల్‌రాజపురంలోని దుర్గగుహలో మూలవిరాట్ స్థానంలో అస్పష్టంగా ఉన్న కుడ్యశిల్పాన్ని గుర్తించి అది అర్ధనారీశ్వరమూర్తియని సహేతుకంగా నిరూపించారు శర్మగారు. ఈ నిరూపణ వారి నిశిత పరిశీలనాశక్తికి ప్రతిమా శాస్త్ర వైదుష్యానికి తార్కాణము.

సోమశేఖర శర్మగారు తమ దృష్టిని ఎక్కువగా మధ్యయుగాంధ్ర చరిత్రపై కేంద్రీకరించారు. మధ్యయుగ ఆంధ్ర చరిత్రలో వేంగి చాళుక్యయుగం ప్రథమ ఘట్టం. వేంగి చాళుక్య చరిత్ర ఆద్యంతమూ సమస్యాభూయిష్టమే. వేంగి రాజ్యస్థాపన ఎప్పుడు

జరిగింది అనేది ఆ సమస్యల్లో మొదటిది. ప్లీట్ పండితుడు క్రీస్తు శకం 614లో రాజ్యస్థాపన జరిగిందనగా భావరాజు వెంకటకృష్ణారావుగారు క్రీస్తుశకం 624లో జరిగినట్లు నిర్ణయించారు. వేంగి చాళుక్యయుగంలో దాక్షిణాత్య రాజ్యాల మధ్య జరిగిన భీషణయుద్ధాల్లో ఎవరికి వారే తాము విజేతలమని వర్ణించుకోవడంతో నాటి చరిత్ర చాలా క్లిష్టంగా తయారయింది. ఆ సమస్యలను నిర్మమత్వంతో పరిశీలించి సంభవా సంభవాలను చర్చించి వేంగి రాజ్య చరిత్రను ధారావాహికంగా శర్మగారు భారతి మాసపత్రికలో ప్రచురించారు. అయితే వేంగి రాజ్యస్థాపనకు శర్మగారు సూచించిన తేదీగానీ, రాజరాజ నరేంద్ర విజయాదిత్యుల మధ్య సంబంధాల స్వభావాన్ని గురించిన వారి నిర్ణయాలుగానీ ఇటీవలి చరిత్రకారులు అంగీకరించడంలేదు. అందులో అసహజం ఏమీలేదు. ప్రాచీన చరిత్రలోని నిర్ణయాలు శాశ్వతంగా నిలబడకపోవడానికి నాటి సాక్ష్యాధారాలు సమగ్రంగా ఉండకపోవడమే కారణం. ఉపలభ్యమైన సాక్ష్యసమాచారం ఆధారంగానే చారిత్రక సమస్యలపై ఎప్పటికప్పుడు నిర్ణయాలు జరుగుతూ ఉంటాయి. అజ్ఞాతంగా ఉన్న సాక్ష్య సంపద వెలుగులోకి వస్తున్న కొలదీ పాత నిర్ణయాలకు బదులు కొత్త నిర్ణయాలు చేయడం జరుగుతూ ఉంటుంది. అందుచేతనే ముఖ్యంగా మన ప్రాచీన మధ్యయుగ చరిత్రకు సంబంధించినంతవరకు విజ్ఞుడైన చరిత్రకారుడెవరూ 'నేను చెప్పిందే చివరమాట" అనడానికి సాహసించడు.

కాకతీయులన్నా వారి స్వతంత్ర రాజకీయాధికారానికి జన్మస్థలమైన తెలంగాణమన్నా శర్మగారికి చాలా అభిమానం. చాలామంది ఆంధ్రచరిత్రకారుల వలెనే శర్మ గారు కూడా కాకతీయ యుగాన్ని స్వర్ణయుగంగా భావించేవారు. అయితే చారిత్రక సత్యాలు వెల్లడించే సందర్భాల్లో స్వీయాభిమానాలు శర్మగారికి అడ్డువచ్చేవి కావు. తెలంగాణాన్ని పాలించిన రాజవంశాల శాసనాలు ఎనబయికి పైగా లఘువ్యాఖ్యలతో తెలంగాణా శాసనాల నాలుగో సంపుటిగా శర్మగారు తయారుచేశారు. అయితే కాకతీయ యుగం నుండి ఆంధ్రుల చరిత్రకు శాసనాలతోబాటు వాఙ్మయ సాక్ష్యం కూడా లభిస్తున్నది. కాని ప్రతాపచంద్ర, సిద్ధేశ్వర చరిత్రవంటి స్థానిక వాఙ్మయం కట్టుకథలతో నిండి చరిత్రకారులను

మభ్యపెట్టేదిగా ఉంటుంది. ఇక, ఖుస్రూ ఇసామీ వంటి ముస్లిం చరిత్రకారుల రచనలు సుల్తానులను శ్లాఘిస్తూ ఏకపక్షంగా ఉంటాయి. అయినా కొన్ని సందర్భాల్లో హిందూ వృత్తాంతం కంటె ముస్లిం రచయితల సమాచారమే విశ్వసనీయంగా ఉండవచ్చు. ఓరుగల్లుపై ఎన్మిదిమార్లు తురుష్క దండయాత్రలు సాగినాయని స్థానికాధారాలు పేర్కొనగా ముస్లిం రచనలు ఐదు దండయాత్రలనే పేర్కొంటున్నాయి. ఐదు దండయాత్రలకు మాత్రమే సాక్ష్యం లభిస్తున్నందున శర్మగారు ముస్లిం సాక్ష్యాన్నే అంగీకరించారు. నిర్మమత్వం చరిత్రకారున కుండవలసిన లక్షణాల్లో ప్రధానమయింది. ఆ లక్షణం శర్మగారిలో స్పష్టంగా కనిస్తుంది. మిత్రులు వెంకటరమణయ్య గారితో కలిసి ఆచార్య యజ్దానీ సంపాదకత్వంలో వెలువడిన Early History of Deccan లో శర్మగారు సమగ్రమైన కాకతీయుల చరిత్ర వ్రాశారు. నేటి పరిశోధకులకు సయితం ఆ చరిత్ర మార్గదర్శకంగా ఉంది.

కాకతీయ రాజ్యపతనంతో ఆంధ్రదేశం అరాజకంలో మునిగింది. అన్నివిధాలా ఆంధ్రుల చరిత్రలోనది అంధకారయుగంగా కన్పిస్తుంది. ఈ యుగచరిత్రపై వెలుగు ప్రసరించిన ఘనత, కీర్తి శర్మగారివి. ప్రతాపరుద్రుని కొడుకు తిరిగి ఓరుగల్లును స్వాధీనం చేసుకున్నాడని ముస్లిం చరిత్రకారులు వ్రాశారు. అతణ్ణి కాపానీడు, కాన్యాపాయర్, కాబానాయండ్ అంటూ పలు రకాలుగా వ్యవహరించారు. స్థానిక సాక్ష్యాధారాలేవీ ప్రతాపరుద్రునకు కుమారులున్నట్లు చెప్పవు. ప్రోలయ నాయకుని విలాస తామ్ర శాసనభాగము, కాపయ నాయకుని ప్రోలవరం శాసనము, అనితల్లికలువచేరు శాసనం ఆధారంగా ముస్లిం చరిత్రకారుల కథనం. యదార్థంకాదని వివరిస్తూ క్రీస్తు శకం 1323-36 సంవత్సరాల మధ్యకాలంలో ముసునూరు ప్రోలయ, కాపయనాయకులు తురుష్క పాలకులతో స్వాతంత్ర్య పోరాటం సాగించడం, కాపయనాయకుడు ఓరుగల్లు నాక్రమించడం శర్మగారు తన Forgotten chapter of Andhra History ద్వారా చరిత్ర పుటలకు ఉద్ధరించారు. అంధకార యుగంగా భావించే ఈ “ముసునూరు యుగం” రాజకీయంగా సువర్ణ ఘట్టమని శర్మగారు నిరూపించారు.

శర్మగారికి శాశ్వతమైన కీర్తి ప్రతిష్ఠలనార్జించి పెట్టింది రెడ్డిరాజుల చరిత్రలో వారి అపూర్వ పరిశోధన. ఆ పరిశోధనా ఫలితమే 'The History and the Reddi Kingdom and Kondavidu and Rajahmundry' అనే ఉత్తమ పరిశోధక గ్రంథం. రెడ్డిరాజుల శాసనాలు అసంఖ్యాకంగా ఉన్నాయి. ఎర్రన, శ్రీనాథాది కవుల కావ్యాల్లోనూ ఫెరిస్టావంటి ముస్లిం చరిత్ర కారుల రచనల్లోను సమాచారం విశేషంగా లభిస్తున్నది. ఈ ఆధారాలన్నింటినీ పరస్పరం బేరీజువేసి చర్చించి నిగ్గుదేల్చి తయారుచేసిన చరిత్ర. ఇది కేవలం రెడ్డిరాజుల చరిత్ర మాత్రమేకాదు. ఆంధ్రదేశానికి సంబంధించినంతవరకు విజయనగర, వెలమ బహమనీ, ముసునూరు రాజ్యాల చరిత్రనూ, ఆ రాజ్యాల మధ్య సంబంధాలను వివరిస్తూ చెప్పిన నాటి ఆంధ్రదేశ చరిత్ర. ఇది కేవల రాజకీయ చరిత్రకాదు; మత, సాంఘిక, సారస్వత, లలితకళారంగాల్లో ఆ యుగంలో వచ్చిన పరిణామాలను వివరిస్తూ తయారుచేసిన విజ్ఞాన సర్వస్వం.

శర్మగారు రెడ్డిరాజుల చరిత్రకు మాత్రమేకాదు, ఆంధ్రదేశ చరిత్ర సమస్తానికీ సజీవమైన విజ్ఞానసర్వస్వంగా ఉండేవారనడానికి వారి సంపాదకత్వంలో తెలుగు భాషా సమితి వారు వెలువరించిన తెలుగు సంస్కృతి అనే సంపుటమే నిదర్శనం.

లిపి శాస్త్రంలో చరిత్ర పరిశోధనలో ఈ విధంగా తాను నెలకొల్పిన ఉదాత్త సంప్రదాయాల ద్వారా భావితరాల పరిశోధకులకు వరవడిపెట్టి ఆదర్శ చరిత్రకారునకు ఉదాహరణగా నిల్చిన గురువర్యులు శ్రీ మల్లంపల్లి వారికి నా జోహారులు!



---

ఆకాశవాణి విజయవాడ కేంద్రం సౌజన్యంతో

# 17. దేశ దేశాలలో ఆంధ్ర సంస్కృతి

దేశ దేశాంతరాలలో విస్తరించిన తమ సంస్కృతీ ప్రభావ విశిష్టతను తలపోసి గర్వింపని ఆంధ్రుడుండడు. కానీ, ఆంధ్ర సంస్కృతి భారతీయ సంస్కృతిలో అంతర్భాగంగా వికసించి యుండటంచేత, దేశంలోని ప్రతిప్రాంతం వారును, విదేశాలకా సంస్కృతిని ప్రసారించిన గౌరవం తమదేనని భావించటం ఆశ్చర్యం లేదు. ఆ కారణంగా, భారత సంస్కృతీ సామ్రాజ్య నిర్మాణగాథలో ఏ ప్రాంతం వారి పాత్ర ఎంతవరకో నిర్ణయించటంలో వాదోపవాదాలు సహజంగా ఉన్నై. ఐనప్పటికీ, భారతీయ సంస్కృతిని గురించి చెప్పే సందర్భంలో, 'భిన్నత్వంలో ఏకత్వం' అనే మాట తరచు వింటూ ఉంటాం. అంటే, ప్రతి ప్రాంతానికి ఏదో ఒక విశిష్టత ప్రత్యేకత ఉండనే ఉన్నది. కాబట్టి విదేశాలలో విస్తరించిన భారతీయ సంస్కృతిలో ఆంధ్రుల పాలు ఎంతవరకో నిర్ణయించటం అంతకష్టం కాదు. ఇలా నిర్ణయించటంలో కేవలం వాఙ్మయ (Literary) నిదర్శనల కంటె పురాతత్వశాస్త్ర (Archaeological) నిదర్శనలే ఎక్కువ విశ్వాసయోగ్యములైనవని, ప్రామాణికములనీ పండితుల అభిప్రాయము. వాని ఆధారంతోనే ఆంధ్ర సంస్కృతీ విస్తరణను నిర్ణయించవచ్చును.

## విదేశ సంబంధాలు - కారణములు

సిరిసంపదలతో తులతూగుచున్న ఆంధ్ర దేశానికి ప్రాచీన కాలంనుండి దూరదేశాలతో వాణిజ్య సంబంధాలుండేవి. పంటలు విరివిగా పండుతూండేవి; ప్రజలు వృత్తిసంఘాలు (శ్రేణులు)గా నేర్పడి లోహ, వజ్ర, దారు, వస్త్ర పరిశ్రమల నభివృద్ధి చేశారు. సాతవాహనుల శాసనాలలో 19 వృత్తి సంఘాలు పేర్కొనబడినై. సాతవాహనుల నౌకా బలానికి, వారు విదేశ వాణిజ్యానికొసగిన ప్రోత్సాహానికి వారి నౌకా చిహ్నముగల నాణెములే నిదర్శనము. ఆంధ్ర దేశములో వినుకొండ, నెల్లూరు, నాగార్జునకొండ,

కొండాపూర్ మున్నగుచోట్ల రోమను చక్రవర్తుల నాణెములు పెక్కు లభించినవి. ఇవి ఆంధ్ర దేశములో తయారైన వస్తువుల ఎగుమతి ద్వారా వచ్చినవేనని డా॥ రాధాకుముదముఖర్జీ గారి అభిప్రాయము (Indian Shipping) . ఈ విదేశ వాణిజ్యమునకు తూర్పు కోస్తాలోని మనార్పా (మోటుపల్లి), కొట్టిస్ (కొత్తపట్టణం), కంటకోసిలాస్ (ఘంటసాల), కొడ్డూర (కోడూరు), అల్లొసైన్ (కోరంగి), మైసలియాస్ (మచిలీపట్నం) మొదలైన రేవులు కేంద్రములై నట్లు క్రీస్తు శకారంభమున ఇండియాను దర్శించిన ప్లినీ, టాలెమీ అను గ్రీకు చరిత్రకారులు పేర్కొనినారు. క్రీ.శ. 78 ప్రాంతంలో పేరు తెలియని గ్రీకు నావికుడు రచించిన "ఎఱ్ఱ సముద్రముపై దినచర్య" (Periplus of the Erthrean Sea) అనే గ్రంథంలో నాటికే దాక్షిణాత్యులు తూర్పు ఆఫ్రికా తీరంలోనూ తూర్పు ఆసియా దీవులలోనూ వలసలు స్థాపిచినట్లు చెప్పబడింది. ఇండియా ఇండోనేషియా శిల్పములను గురించి పరిశోధనలు చేసిన డా॥ ఆనందకుమారస్వామిగారి నిర్ణయము ప్రకారము, తూర్పుదీవులలో ప్రథమ భారతీయ వలసలు స్థాపించిన వారు ఆంధ్రులు; వీరు కృష్ణా ముఖద్వార మందున్న కోడూరునుండి బయలుదేరి, ఆ దేశాలకు వెళ్లారు.

వాణిజ్యం ద్వారా నేర్పడిన ఈ విదేశ సంబంధాలు బౌద్ధమత ప్రచార కాంక్షతో మరింత బలపడిన్నై. జాతి, వర్ణ విచక్షణలను ఆధిక్యతను నిరసించి, శాంతి, సమత్వము, సౌహార్దములను పెంపొందించు బౌద్ధ ధర్మాన్ని తూర్పు ఆసియా ప్రజలాదరించారు. అశోకుని మరణానంతరం, భారతదేశంలో మొత్తంమీద బౌద్ధానికి రాజాదరణ సన్నగిల్లినదని చెప్పవచ్చును; శుంగ, సాతవాహన వంశముల కాలంలో తీవ్రమైన వైదిక ధర్మోద్ధరణోద్యమము విజృంభించింది. ఇక్ష్వాకులు కూడా శైవ సంబంధమైన హిందూ మతాభిమానులు; పల్లవుల కాలంలో పాశుపత, కాలాముఖాది తీవ్రవాద శైవం ప్రబలమై బౌద్ధమతాన్ని హింసించసాగింది. ఈ వాతావరణంలో బౌద్ధులకు మాతృదేశంలోకంటె తూర్పుదేశాలలోనే ఆదరాభిమానాలు లభించినవి. తమ మతాన్ని, శిల్పసాంప్రదాయాలను తీసుకొని, బౌద్ధులు అసంఖ్యాకంగా తూర్పుదేశాలకు తరలిపోయి వలసలు స్థాపించుకొన్నట్లు తెలుస్తున్నది. ఈ విధంగా నేర్పడిన వలసలు ఆంధ్ర సంస్కృతిని ఆ దేశాల ప్రజలకే విధంగా పంచిపెట్టినది పరిశీలిద్దాం.

## తూర్పు దేశాలు

బర్మా: క్రీ.పూ. 5వ శతాబ్దంలోనే తెలాంగులనబడే మాన్ ప్రజలు బర్మాలో ప్రవేశించారు; వీరు తెలుంగు దేశంనుండి వలసవెళ్లినట్లు వారి పేరే సూచిస్తున్నది. వీరు రామన్న దేశమనే రాజ్యాన్ని స్థాపించారు; దాని రాజధాని హంసవటి (పెగూ). దీనికి కొంచెం ఉత్తరంగా శ్రీ క్షేత్రమనే రాజ్యం వెలసింది. దీనినే 'వనవాసి' అని కూడా వ్యవహరించేవారు. దక్షిణదేశంలో "వనవాసి" (ప్రస్తుతం మైసూరులో ఉంది) సాతవాహన సామ్రాజ్యంలోనొక విభాగమై, చుటుకుల శాతకర్ణి వంశస్థులచే పాలింపబడేది. క్రీ.శ. 6వ శతాబ్దంలో పెగూ రాజ్యాన్ని పాలించిన "శాన్‌లాన్ క్రోం" ఇంచుమించు అదేకాలంలో వేంగి, కళింగ రాజ్యాలనేలిన శాలంకాయన రాజవంశ శాఖీయుడేనని భావింపబడుచున్నది. ఇతని వంశము వారే బర్మాలో బౌద్ధమతాన్ని ప్రవేశపెట్టారని ప్రసిద్ధి. డా॥ నీహర రంజన్‌రాయ్ పరిశోధనల ప్రకారం బర్మాలోని బౌద్ధమతం అమరావతి-నాగార్జునకొండల ప్రాంతం నుండి వెళ్లినదే. బర్మాలో ప్రచారమందున్న 'లోకతిష్య' అర్థకథకును, తెలుగుదేశంలో వాడుకలోనున్న కొల్లేటి దహనం కథకును లేశమైనా వ్యత్యాసం కన్పించదు. ఇటీవల ప్రోంలో కింబొగోన్ అనేచోట క్రీ.శ.6వ శతాబ్దికి చెందిన బౌద్ధ స్తూపం బయల్పడింది. అందు బుద్ధ విగ్రహాలకు అమర్పబడిన చేతి ఉంగరములు, చెవి కమ్మలు ఆంధ్రశిల్ప ప్రభావాన్ని చాటుచున్నవి. అచటి శాసనములు క్రీ.శ.5వ శతాబ్దానికి చెందిన తెలుగు - కన్నడ లిపిలో వ్రాయబడినవి.

మలయా: మలయాలో నేటికికూడా విదేశీయులను క్లింగ్ (కళింగ)లని పిలుస్తారు. దీనినిబట్టి మలయాలో ప్రవేశించిన మొదటి విదేశీయులు కళింగులని తేలుచున్నది. కళింగనుంచి విదేశాలకు వలస వెళ్లినవారు పల్లూరు అనే రేవునుండి బయలుదేరారు (The Culture of South East Asia - Reginald Le May). ఇక, కళింగమంటే ఒరిస్సా ప్రాంతమేనని కొందరు పండితుల భ్రాంతి. తూర్పు తీరమున గంగా గోదావరీ ముఖద్వారముల మధ్యప్రాంతమంతయు కళింగమని ఒకప్పుడు వ్యవహరింపబడినది. ఇందు ఉత్తర, మధ్య, దక్షిణ లేక త్రికళింగము లను విభాగములుండేవి. ఉత్తర కళింగమే

ఉత్కళయైనది. త్రికళింగమే త్రిలింగమైనదని కొందరి వాదము. ఏమైనప్పటికీ ఉత్తరాంధ్రమునకు గళింగమను పేరుండెననుట నిర్వివాదాంశము. పల్లూరు (పాలూరు) గంజాం జిల్లాలోని చిలక సరస్సు దక్షిణ అగ్రమునందున్నది. ఇదియే సంస్కృత వాఙ్మయములో (పల్లు + ఊరు) దంతపురమై యుండును. ప్రస్తుతము ఒరిస్సా రాష్ట్రములో చేరియున్నను, ఈ ప్రాంతమంతయూ నిర్వివాదముగ తెలుగు ప్రాంతమే. పల్లూరునుండి కళింగాంధ్రులు మలయాకు వలస వెళ్లిరనుటకు మరికొన్ని నిదర్శనములున్నవి. మలయాలో శాన్‌కోలక్‌లో దొరికిన కంచుబుద్ధ విగ్రహములకును గుంటూరు జిల్లాలో బుద్ధాము (బాపట్ల తాలూకా)లో దొరికిన విగ్రహాలకును చాలా పోలికలున్నవి; లిగర్ అనే చోటనున్న హిందూదేవాలయములలో ఉండవల్లి (గుంటూరు జిల్లా) గుహాలయముల పోలికలు కన్పించును; కౌలానెలిన్‌సింగ్, కెడాహాలలో దొరికిన శాసనములు క్రీ.శ. 5వ శతాబ్దమునాటి వేంగి లిపిలో వేయబడెను.

ఇండో చైనా: ఇండోచైనాలో మొట్టమొదట వలసలు స్థాపించిన వారు ఆంధ్రులు. గౌతమీపుత్ర శాతకర్ణి కాలంలో (క్రీ.శ. 1వ శతాబ్ది) కౌండిన్యుడనే ఆంధ్ర బ్రాహ్మణ యువకుడు ఆ దేశాన్ని పాలిస్తున్న 'సోమ' అనే నాగరాణిని వివాహమాడి కౌండిన్య సోమవంశమును స్థాపించినాడు (Ancient India - Dr. K. P. Jayaswal). అతని సంతతివారు చంపా మున్నగు రాజ్యాలను కూడా జయించారు. చంపారాజ్యం పూర్తిగా ఆంధ్రుల వలసయని చెప్పవచ్చును. ఆ రాజ్యానికి ముఖ్య పట్టణం సింహపురం; అందలి రాష్ట్రాల పేర్లు అమరావతి, కౌధార, విజయ, పంద్రంగ, ఇవియన్ని ఆంధ్రదేశంలోని స్థలముల పేర్లే. సింహపురం: విశాఖపట్టణం జిల్లాలో క్రీ.శ. 4,5 శతాబ్దాలలో రాజ్యం చేసిన మాఠరుల రాజధాని; ప్రస్తుతం సింగపురం అనే పేరున చికకోలు, నరసన్నపేటల మధ్య నున్నది (Early Dynasties of Andhradesa - B.V.K. Rao). అమరావతి: సుప్రసిద్ధ బౌద్ధక్షేత్రం; గుంటూరుజిల్లా, కౌదార: సముద్ర గుప్తుని అలహాబాదు ప్రశస్తిలో ష్టపురము (పిఠాపురం)నకు సమీపమున పేర్కొనబడిన కొత్తూరు. విజయ: శ్రీపర్వత యపురి (నాగార్జునకొండ), పంద్రంగ: నెల్లూరు జిల్లాలోని పంద్రంగమే. ఈ

ప్రాంతముల నుండి వలస వెళ్ళిన ఆంధ్రులు, మాతృదేశంపై గల అభిమానము కొలది తమ కొత్త స్థావరముల కాయా పేరులే పెట్టుకొని యుందురు. ఇండోచైనాలో నేర్పడిన మరొక భారతీయ రాజ్యం కాంభోజ (Combodia). ఈ రాజ్యానికి, తెలుగు దేశంలో విరివిగా ప్రచారమందున్న కాంభోజరాజకథకు గల సంబంధమేమో పరిశోధింపవలసి యున్నది.

చంపా, కాంభోజ రాజ్యముల నేలిన రాజులపేర్లు, వేంగినేలిన శాలంకాయన, విష్ణుకుండిన రాజుల పేర్లను బోలి (చండవర్మ, ఇంద్రవర్మ) ఉండేవి. నేటికిని ఇండోనేషియా ప్రజల పేర్ల చివరనుండే "ఫాన్' అనేమాట "వర్మన్" అనుదాని అపభ్రంశ రూపమై యుండవచ్చును. ఈ రాజులు పల్లవులవలె "ధర్మ మహారాజాధిరాజ" బిరుదును ధరించారు; వేలాది విద్యల నభ్యసించారు. అమరావతీ రాష్ట్రంలో డాంగ్‌డుయాంగ్ చెంత దొరికిన బుద్ధ విగ్రహాలు ఆంధ్రదేశంలోని అమరావతినుండియే ఎగుమతి యైనవని పండితుల అభిప్రాయము, 'వోకన్' అనేచోట దొరికిన శాసనలిపి వాసిష్ఠీపుత్ర శాతకర్ణి కన్హేరి శాసన లిపికి నకలుగా నున్నది; తరువాతి శాసనాలు వేంగి లిపిలో నున్నై. ఇండోచైనాలో శాలివాహన శకం వాడబడింది. కాంభోజ దేశాన్ని పాలించిన ఐదవ జయ వర్మ (క్రీ.శ. 968) తనను శ్రీశైలముతో (కర్నూలు జిల్లా) పోల్చుకొన్నాడు. భక్తులకు శ్రీశైలము మోక్షము నిచ్చునట్లు, యాచకులకు జయవర్మ దక్షిణల నిచ్చువాడట! దీనినిబట్టి క్రీ.శ. 10వ శతాబ్దము వరకును, శ్రీశైల శైవక్షేత్రము ఇండోచైనా ప్రజల దృష్టి నాకర్షించుచుండెనని వేరుగా చెప్పనక్కరలేదు. కాంభోజ దేశంలోని వైష్ణవులు విష్ణువును, అనంతశాయి రూపంలో ఆరాధించేవారు. ఆ దేశంలోని శైవులను శ్రీశైలం వలె వైష్ణవులను బహుశః ఉండవల్లి గుహాలయంలోని అనంతశాయి ఆకర్షించి యుండవచ్చును.

**ఇండోనేషియా** : పెగూ, కాంభోజ దేశాలనుండి భారతీయులు ఇండోనేషియాను (జావా, బోర్నియో మొదలైన సుగంధ ద్వీపాలను) ఆక్రమించారని పెర్గూసన్ పండితుని సిద్ధాంతము. కళింగాంధ్రులాక్రమించారనటానికి నిదర్శనంగా, జావాకు కళింగమనే పేరుండేది. ఈ ద్వీపాల నేలిన రాజులు కూడ 'వర్మ' నామాంకితులే. అందు పురాణ వర్మ

మహారాజు గోసహస్రదాన మొనర్చెనట! ఇటువంటి దానముల ప్రసక్తి తరచు ఆంధ్రదేశము నేలిన చక్రవర్తుల శాసనములలో కన్పించును. విజయ పురిలో ఇక్ష్వాకు రాజవంశ స్థాపకుడైన శ్రీ శాంతమూలుడు గోశతసహస్ర హలశతసహస్ర ప్రదాతయట!

ఇండోనేషియాలో పెక్కు చోట్ల అమరావతీ సాంప్రదాయములలో మలచబడిన బౌద్ధశిల్పములు లభించినవి. జావాలో నెల్ల బోరోబుదురు శిల్పము జగత్ప్రసిద్ధి గాంచినది. ఇచ్చట ఒక మహాపర్వతాన్ని అసంఖ్యాకమైన ఉద్దేశిక స్తూపాలుగా శిల్పి చెక్కివేశాడు. ఆంధ్రదేశంలో బొజ్జన్నకొండ. లింగాలమెట్టలను (విశాఖపట్నం జిల్లా) చూచినవారికి బోరోబుదురు గుర్తుకు వస్తుంది. ఇచట కొండలో మలచబడిన ఉద్దేశిక స్తూపాలనే, తరువాతి కాలంలోని శైవులు లింగాలమెట్ట అన్నారు. కాకతాళీయంగా దీని ద్వారా శైవులవల్ల బౌద్ధానికి జరిగిన అపచారాన్ని కూడా గ్రహించవచ్చు. వీరు లింగాలమెట్టను ఆనుకొని ఉన్న కొండగుహలోని బుద్ధుని బొజ్జన్న (విఘ్నేశ్వరుడు)గా పూజించారు. స్తూపాలు లింగాలైనవి; బుద్ధుడు బొజ్జన్నయైనాడు! దాని ప్రక్కనే ఉన్న సంఘారామము నేడు సంకరం ఐపోయింది! (సంకరం అనే గ్రామం ఇప్పుడున్నది) కాని, బౌద్ధ క్షేత్రంగా నుండిన లింగాల మెట్టయే బోరోబుదురు శిల్ప మహాకార్యానికి ఉపక్రమణిక యైనదని శిల్పచరిత్రకారుల అభిప్రాయము. (Buddhist Remains in Andhradesa - K.R. Subramaniam.)

ఇండోనేషియాలో శివ, కేశవు లిద్దరూ ఆరాధింప బడ్డారు. కాని క్రీ.శ. 12, 13 శతాబ్దాలనాటికి ఈ దేవతల కభేదము నూహించి హరిహరస్వామిని ప్రజలు పూజించారు. ఇండోనేషియాలో హరిహరస్వామి విగ్రహాలు పెక్కు దొరికినై. విశేషమేమంటే, ఇదేకాలంలో ఆంధ్రదేశంలోకూడ హరిహరభావం ప్రబలంగా ఉండేది. కవిబ్రహ్మయైన తిక్కన సోమయాజి "శ్రీయనగౌరినాబరగు'' అంటూ హరిహరతత్త్వాన్ని ప్రజలకు మహా భారతం ద్వారా ప్రబోధించినది క్రీ. శ. 11వ శతాబ్దిలోనే ఈ రెండు దేశాలలోని హరిహరతత్త్వాలకు గల సంబంధాన్ని పరిశోధింపవలసిఉంది.

హిందూమతంతోబాటు మహాభారత రామాయణేతిహాసములుకూడా సుగంధ ద్వీపాలకు, పయనించినై, తెలుగు దేశంలో వలెనే ఇచట తోలుబొమ్మలాటలు (Shadow lay) ప్రజల వినోదాలు. ఆ ఆటలకు ఇతి హాస కథలే ఇతివృత్తాలుగా ఉండేవి. ఇవి 'కవి'

భాషలో వ్రాయబడినై. ఇందు నూటికి 90 పాళ్లు సంస్కృతం. లిపిమాత్రం వేంగిలిపియే. బోర్నియోలో దొరికిన 'యూపా' శాసనం వేంగి లిపిలోనే వేయబడిందని ప్రఖ్యాత క్రోంపండితుని నిర్ణయము. ఈ దీవుల్లో గూడా శాలివాహన శకమునే ప్రజలు వాడుకొన్నారు.

**సింహళము :** ఆంధ్ర సింహళ దేశాలమధ్య సంబంధం బహుపురాతనమైనది. బౌద్ధ వాఙ్మయంలో సింహళాన్ని నాగలోకమనేవారు; కృష్ణానదీ ముఖద్వార ప్రాంతం కూడ నాగదేశమని వ్యవహరింపబడింది. తూర్పుతీర ప్రాంతాల నుండియే నాగజాతులు సింహళానికి వలస పోయినారని ఊహించవచ్చును. రామాయణంలో పేర్కొన బడిన లంకయే సింహళమైనచో, రావణుడు దండకారణ్యప్రాంతాన్ని జనస్థానము (జననస్థానము) అని పిలవటం గమనింపదగినది! సింహళానికి గొనిపోబడిన బుద్ధుని దంతగాథల్లో కృష్ణా ముఖద్వారంలోని వజ్రాలదిన్నె ప్రస్తావన కన్పిస్తుంది. సింహళ ప్రభువులైన విజయుడు, క్షేమ సింహుడు కర్మరాష్ట్రం నుండి 'కమ్మసాలీల' నాహ్వానించినట్లొక ఐతిహ్యం ఉంది. దుత్తగామిని అనే సింహళ ప్రభువు, ఆంధ్రదేశం నుండి బుద్ధుని ధాతువులు సంపాదించి వానిపై అనూరాధపురంలో స్తూపాలు నిర్మించినట్లును, ఆ స్తూప ఆవిష్కరణ మహోత్సవానికి పల్లవ బొగ్గు (పల్లవభోగ్య లేక పలనాడు) నుండి పదివేలమంది శిష్యులతో మహాదేవభిక్షు సింహళమున కేగినట్లును మహావంశమనే సింహళ గ్రంథము పేర్కొనుచున్నది. భారత దేశంలో నాటికే రూపుమాసిపోయిన "ప్రజ్ఞాపారమిత" శాస్త్రమును ఆచార్య నాగార్జునుడు సింహళ దేశము నుండి తెచ్చి వ్యాఖ్యానాలు రచించినాడట! ఆనాటి నుండి నాగార్జునకొండ సింహళ బౌద్ధులకు పుణ్యక్షేత్రమైనది. సింహళ యాత్రికులకై ప్రత్యేకంగా నాగార్జున కొండలో "సిహళ విహారము" (సింహళ విహారము)ను నిర్మించి అందు బోధివృక్షమును నెలకొల్పారు. ఆచార్య నాగార్జునుని తరువాత, ఆచార్య పీఠ మధిష్ఠించిన ఆర్య దేవుని, సింహళ రాజైన ఓహరతిస్స తన దేశానికి ఆహ్వానించి గౌరవించాడు.

కుతూహల మహాకవి రచించిన 'లీలావతి' అనే ప్రాకృత కావ్యం ద్వారా లీలావతి అనే సింహళ రాకుమారి, కవివత్సలుడైన హాలుని వరించి వచ్చి వివాహమాడినట్లు తెలియుచున్నది.

ఇంతటి సన్నిహిత సంబంధాలుండటంవల్ల ఆంధ్ర సంస్కృతిని సింహళ ప్రజ

లారాధించారనటంలో విప్రతి పత్తి యుండదు. అనూరాధపురంలోని బౌద్ధదేవాలయాలకు ఉండవల్లి గుహాలయాలు నమూనాలైనవి; సింహళములోని త్రిపిటకములు ఆంధ్రదేశమునుండి దిగుమతియైన పాళీభాషలో వ్రాయబడినవని ఓల్డెన్ బర్గ్ (Oldenburg) పండితుని తీర్మానము.

**మధ్య ఆసియా:** ఆంధ్ర సంస్కృతీ ప్రభావము మధ్య ఆసియా వరకునూ ప్రాకుట మరీ విశేషము. నాగార్జున కొండలో లభించిన శాసనముల వలన ఆంధ్రప్రాంతం నుండి బౌద్ధభిక్షువులు మత ప్రచారార్థం కాశ్మీరు, చైనా మొదలైన దేశాలకు గూడ వెళ్ళినట్లు తెలియుచున్నది. చైనా జపాను దేశాలలో వ్యాపించిన జైన్ బౌద్ధం శ్రీపర్వతశిఖరాలనుండి ప్రబోధింపబడిన మహాయానంలో నొకభాగమైన ధ్యానబౌద్ధమే! ఆచార్య నాగార్జునుడు వైద్యశాస్త్ర ప్రవీణుడని, అతడు చైనా టిబెట్ దేశాలకు గూడ వెళ్ళినట్లును విశ్వసింపబడుచున్నది. అతని పరిశోధనా ఫలితములైన నేత్రాంజనము మొదలైన ఔషధములు నేటికి చైనాలో వాడుకలోనున్నవి. నాగార్జునకొండలో ఇటీవల బయల్పడిన పురావస్తు విశేషముల వలన నచట రసాయనిక పరిశోధనలు జరిగినట్లు రుజువగుచున్నది. క్రీ.శ. 7వ శతాబ్దంలో శ్రీపర్వత క్షేత్రమును దర్శించిన యువాన్‌చాంగ్ కూడ ఆ విహారములోని బౌద్ధులు ప్రజలకు ఔషధ సేవ చేయుచున్నట్లు వచించినాడు. చైనాలోని హోనామరాష్ట్రమందలి నాన్‌హ్సింగ్ టాంగ్ గుహాలయములలోని బౌద్ధశిల్పాలకు అమరావతీ శిల్పాలుమాతృకలు. జపానులోని హోరియూజి దేవాలయంలోని కుడ్య చిత్రాలకు అజంతా చిత్రాలకు దగ్గిర పోలికలున్నవట! టిబెట్ చరిత్రకారుడైన లామా తారానాథుడు (క్రీ.శ. 8వ శతాబ్దివాడు) లాసా విశ్వవిద్యాలయాన్ని అమరావతీ-ధాన్యకటక విశ్వవిద్యాలయం నమూనాగా నిర్మించి నట్లు పేర్కొనినాడు. ఆ విశ్వవిద్యాలయంలో 1700 మంది విద్యార్థులు విద్య నభ్యసించుచుండేవారట!

మధ్య ఆసియాలో కారాసాహర్, కూచి మొదలైన చోట్ల బౌద్ధస్తూప శిథిలాలతోబాటు పెక్కు సంస్కృత గ్రంథముల ప్రతులు దొరికినై. వానిలో కాతంత్రవ్యాకరణ మొకటి. ఈ వ్యాకరణము ననుసరించియే మధ్య ఆసియా ప్రజలు సంస్కృతము నభ్యసించుచుండిరి. కాతంత్ర వ్యాకరణమును శర్వవర్మ యను పండితుడు (క్రీ.పూ. 1 వ శతాబ్ది) తన యేలికయైన ఆంధ్ర సాతవాహన చక్రవర్తిని ఆరు మాసములలో సంస్కృత విద్వాంసుని

చేయుటకై రచించి కృతకృత్యుడైనాడట! ఆ వ్యాకరణానికే ఆసియా ప్రజలు జోహారు లర్పించినారు!

ఈ విధంగా ప్రాచీనాంధ్రులు విదేశాలతో నేర్పరచు కొన్న వాణిజ్య, సాంస్కృతిక సంబంధాలు, ఇటీవల కాలం వరకూ నిలిచియుండినట్లు తెలుస్తుంది. క్రీ.శ. 15వ శతాబ్దంలో విజయనగర రాజ్యము నేలిన ఇమ్మడి దేవరాయలికి బర్మాలోని పెగూ, టెనాసరిం రాజ్యములు కప్పము చెల్లించుచుండినట్లు పారశీక బాటసారియైన అబ్దుల్ రజాక్ పేర్కొనినాడు. దేవరాయలికి సమకాలికుడైన శ్రీనాథకవిసార్వభౌముడు తన హరవిలాస కావ్యంలో కొండవీటి రాజ్యములో చామిశెట్టి వాణిజ్యమును వర్ణించుచు రచించిన ఈ క్రింది పద్యం వల్ల నాడాంధ్ర దేశానికి ఏ యే దేశాలతో సంబంధములున్నవో తెలియగలదు.

*పంజార (సుమత్రా) గర్పూర పాదపంబులు దెచ్చె*
*జలనోంగి (మలయా) బంగారు మొలక దెచ్చె*
*సింహళంబున గంధ సింధురంబులు దెచ్చె*
*హరుమంజి (ఆర్మన్) బలుతేజుహరులు దెచ్చె*

.................................................................

*యాంప (జాఫ్నా) గట్టాణిముత్యాలు దెచ్చె*
*భోట (భూటాన్) కస్తూరికాపుటకోశములు దెచ్చె*
*చీని చీనాంబరశ్రేణి దెచ్చె.*



# ఆచార్య బి.యస్.యల్. హనుమంతరావుగారి ఇతర రచనలు

## స్వీయరచనలు :

### ఆంగ్లము : ముద్రితాలు

1. Religion in Andhra
2. Indian History and Culture
3. Guntur through Ages
4. Age of Satavahanas
5. Srisailam - History & Culture
6. Modern Europe (guide book for students)

### ఆంగ్లము : అముద్రితాలు

1. Essays on social Mobility in Medieval Andhra
2. Buddhist Inscriptions of Andhra Desa
3. War of Palnad - It's socio - Political Significance
4. Buddhism & Jainism in Andhra Desa (compilation of Research Papers)
5. Socio - Cultural History of Ancient & Medieval Andhra Compilation of Research Papers
6. Views & Reviews (Compilation of Popular Articles)

### తెలుగు : ముద్రితాలు

1. ఆంధ్రుల చరిత్ర
2. భారతీయ సంస్కృతి - ఒక పరిశీలన
3. ఆంధ్రలో సామాజిక చలనం

4. విజయవాణి (రేడియో ప్రసంగాలు)

5. ప్రణయాంజలి (ఖండ కావ్యము)

6. డిగ్రీ, ఇంటర్, మెట్రిక్, ఇతర తరగతులకు పాఠ్యపుస్తకాలు

7. ఆంధ్రదేశంలో బౌద్ధజైనమతాలు (ముద్రణలో తెలుగు అకాడమీ)

**అనువాదాలు :**

1. యం. యన్. రాయ్ స్వీయ గాధలు
2. మానవ నాగరికత
3. అశోకుడు - మౌర్యవంశక్షీణత
4. గతాన్ని గురించిన అపోహలు
5. లోకాయత వాద పరిశీలన

**జీవిత సంగ్రహము :**

| | | |
|---|---|---|
| జననము | : | 4-1-1924 దోనేపూడి, గుంటూరుజిల్లా |
| జననీ జనకులు | : | వెంకటలక్ష్మి, రామకృష్ణయ్య |
| బాల్యం - విద్యాభ్యాసము | : | మూల్పూరు, తురిమెళ్ళ, తెనాలి |
| కళాశాల విద్య | : | గుంటూరు |
| యం.ఎ.బి.యిడి | : | ఆంధ్ర విశ్వవిద్యాలయము |
| పి.హెచ్‌డి | : | కర్నాటక విశ్వవిద్యాలయము |
| చరిత్ర - సంస్కృతి అధ్యాపన | : | |
| 1946 నుండి 1983 వరకు | : | తెనాలి, కూచిపూడి హైస్కూళ్లలో<br>హిందూకళాశాల గుంటూరులో |
| 1983 - 1987 | : | ఆచార్యత్వం - బౌద్ధపీఠం నాగార్జున విశ్వవిద్యాలయము |
| నిర్యాణము | : | 8-6-1993 హైదరాబాదు. |

